క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం



# అధిక రుచికరం అధిక సంపూర్ణం

**ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు పాపాయి పెరుగుదలకు మంచిది.**




పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం. కలపడం సులభం. పాపాయికి తినిపించడం సులభం.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రోటీన్‌తో సమృద్ధం. ఆరోగ్యవంతమైన రక్తంకోసం అదనంగా ఐరన్ కలిగినది. గట్టి పళ్ళు, ఎముకలకోసం సరియైన నిష్పత్తిలో కాల్షియం మరియు ఫాస్ఫరస్ కలిగినది. పాపాయి సున్నిత జీర్ణశక్తికి అనువుగా ముందుగానే పచనం చేయబడినది.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

ప్రతి చెంచాలో అధిక సంపూర్ణ ఘన ఆహారం.

CLARION/B/GX/3/183 TEL

# చతుర

సంపుటి : 7 సెప్టెంబర్ 1984 సంచిక : 8


## ఈనెల సమగ్ర నవల

"ఈ హైద్రాబాద్‌లో దాదాపు పన్నెండేళ్ళ నుంచీ ఉంటున్నా. దాదాపు ఏడెనిమిదేళ్లుగా జాబ్ చేస్తున్నా. రకరకాల స్నేహితుల్తో.. పోనీ స్నేహితులమనుకునేవాళ్ళతో కల్సి సినిమాలకెళ్లాను ... షికార్లకెళ్లాను. నేను చేసే పనిలో మంచుందో, చెడుందో నేను నిర్ణయించుకోగలను. నా బాగోగులు నా ఇష్టానిష్టాలు నాకు తెలుసు. నన్ను గురించి ఎంతమంది హీనులు, నీచులు, ఎంతెంత నీచంగా అనుకుంటారో నేను కొంత ఊహించగలను ... కొంత తెలుసు. వాళ్ళని లెక్కచేయాల్సిన అవసరం నాకు లేదు. నాతో స్నేహం చెయ్యడం వలన నీకు అవమానంగా వుంటే నిన్నిక్కడ ఎవరూ బలవంతంగా పట్టి ఆపరు. నీ ఇష్టంవచ్చినట్టు నువ్వెళ్లొచ్చు. కాని నామీద నువ్వు అధికారం చెలాయించొద్దు. లోకుల్ని కేర్ చెయ్యాల్సినవసరం నాకు లేదు.- నా మనసుకి నేను సమాధానం చెప్పుకోగల్గితే నాకు చాలు. నా ఆత్మకి విరుద్ధంగా, నా ఆత్మాభిమానాన్ని పోగొట్టుకుని నేనెప్పుడూ ప్రవర్తించను ..." అని తనను వివాహమాడేందుకు తహతహలాడుతున్న యువకుడిని, అన్నీ ఉన్నవాడిని గద్దించి సాగనంపిందామె. ఆమె పేరు వేణు. మరి ఆమె హృదయతంత్రుల్ని మీటి...అపూర్వమైన...

# వేణుగానం

వినగలిగిన ఆదర్శ పురుషుడీ లోకంలో ఆమెకు ఎదురయ్యాడా? ఎవరతను...?ఎలాంటివాడై ఉంటాడతను...?

## అక్కినేని కుటుంబ రావు

ఈనాటి "నిజమైన" విద్యావంతురాల్ని నాయికగా తీసుకుని... వివాహం ... అనే మాటకు అంతరార్థాన్ని అపూర్వంగా విప్పి చెప్పిన "వేణుగానం" ఈ నెల చతుర సమగ్ర నవల.

మఖ చిత్రం : జి. జగన్మోహనరావు

ఫొటోఫీచర్ : సూరజ్ ఎన్ శర్మ, బ్రహ్మదేవ్, ఎల్.ఆర్. గ్రోవర్, రాజ్యలక్ష్మి, డి. విద్యారాణి

కవితలు : నాగేంద్రదేవ్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగాని, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# ఆ వీధి ప్రత్యేకత

స్విట్జర్లాండ్‌లోని జ్యూరిచ్ నగరంలో వున్న బానోఫ్ స్ట్రాస్సే వీధి ప్రపంచంలోని అత్యంత సంపన్నవంతమైన వీధి. ఆ వీధిలో ప్రపంచంలోని అతి సంపన్నమైన ప్రభుత్వ, ప్రైవేట్ బాంకులున్నాయి.

జ్యూరిచ్ రైల్వేస్టేషన్ నుంచి 15 నిమిషాల నడకతో ఆ వీధిని చేరుకోవచ్చు. ఆ వీధిలో ప్రవేశించడానికి వాహనాలకి అనుమతి లేదు. నడిచి మాత్రమే రావాలి. ఆ వీధిలో ఒక చదరపు గజం స్థలం ఒక లక్ష 35 వేల రూపాయల ఖరీదు వుంటుంది. న్యూయార్క్‌లో బాగా రద్దీగా వుండే ప్రాంతంలోనే ఒక చదరపు గజం స్థలం ఖరీదు ఈ ధరలో కేవలం సగం మాత్రం వుంటుంది.

నూనె గనులుండే అరబ్ షేక్‌లు, ధనిక ప్రముఖులు, మిలియనీర్లు, బిలియనీర్లు అక్కడ తరుచుగా కలుసుకుంటారు; ఆ వీధిలో ప్రతి మూలా అతి ఖరీదైన దుస్తుల, ఆభరణాల దుకాణాలుంటాయి.

సాధారణ మానవులెవరికీ ఆ వీధిలో అడుగుపెట్టే అవసరమే రాదు. కాని



స్విట్జర్లాండ్ వచ్చిన ప్రతి టూరిస్టు తప్పక ఈ ప్రాంతాన్ని దర్శిస్తాడు. సాధారణ టూరిస్టు ఈ బాంకుల్లో చిన్న నోట్లను మార్చబోతే బాంకువాళ్లు ఏమనుకుంటారోనని భయపడతాడు. కాని బాంకువాళ్ళు ప్రముఖుల్ని ఆదరించినట్టే సామాన్యుల్ని ఆదరిస్తారు.

అక్కడ ఎంతోమంది గుమిగూడి బాంకుల్లోని క్లోజ్ సర్క్యూట్ టెలివిజన్‌లో ప్రదర్శించే వివిధ కంపెనీల్లోని స్టాకుల పరిస్థితిని గురించి చర్చించుకుంటారు.

కొన్ని బాంకులముందు మన పాలబూతుల లానే 'మనీబూతులు' వుంటాయి. అందులో క్రెడిట్ కార్డ్ పడేస్తే చాలు ఫెళఫెళ్లాడే 100 ఫ్రాంకుల నోట్లు



బయటికొస్తాయి.

జ్యూరిచ్ స్టాక్ ఎక్స్ఛేంజిలో 'గేలరీ' అనేది ఓ ప్రధాన ప్రదేశం. ఆ గేలరీని 9.45 నుంచి 12 వరకూ తెరిచి వుంచుతారు. అందులోకి వెళ్ళడానికి ప్రవేశ రుసుమేమీ వుండదు. అక్కడికి వెళ్ళిన వారికి స్విట్జర్లాండ్‌లోని బాంకుల గురించి తెలిపే చిన్న పుస్తకాన్ని ఉచితంగా ఇస్తారు.

అక్కడ గల ప్రైవేటు బాంకులకి ఓ సమస్యవుంది. స్విస్ దేశంలోని చట్ట ప్రకారం ప్రైవేటు బాంకులు గవర్నమెంటుబాంకుల్లా తమ గురించి ప్రకటనలు చేసుకునేందుకు వీలులేదు. డాక్టర్ల లాగా అవి కూడా బాంకు ముందు ఒక బోర్డుని వేలాడదీయాలంతే! ప్రైవేటు బాంకులు ప్రచారం చేసుకోకుండా స్విస్ చట్టాలు ఆవిధంగా అడ్డుకుంటున్నాయి. అయినా అక్కడి ప్రైవేటు బాంకులు అతి సమర్థవంతంగా వ్యాపారాన్ని నిర్వహిస్తూ, ఖాతాదారుల్ని ఆకర్షిస్తాయి!

## అరుపుల పోటీ

అరుపుల పోటీ నిర్వహించడం విచిత్రమే అయినా జపాన్‌లో ఓ వ్యాపార సంస్థ తమ ఉత్పత్తుల అమ్మకాలను పెంచుకోవడానికి ప్రచారం కోసం అలాంటి పోటీని నిర్వహించింది. బాగా గట్టిగా అరిచిన వారికి 250 అమెరికన్ స్టెర్లింగులు బహుమతిగా ప్రకటించింది. ఈ పోటీలో నిరుద్యోగులు, సేల్స్‌మన్‌లు, విద్యార్థులు, యువతులు, వృద్ధులు, గృహిణులు, పిల్లలతో సహా ఎందరో పాల్గొన్నారు.

21 ఏళ్ల యువకుడు ఒకడు 105.2 డెసిబుల్స్ ధ్వనిగల అరుపుతో బహుమతిని గెలుచుకున్నాడు.మహిళలలో 109.7 డెసిబుల్స్ శబ్దం వచ్చేట్టు అరచిన 25 ఏళ్ళ యువతికి బహుమతి లభించింది. శబ్దంయొక్క తీవ్రతను డెసిబుల్స్‌గా లెక్కిస్తారు.

టెలిఫోన్‌లో మాట్లాడేవారి కంఠస్థాయి 70 డెసిబుల్స్‌కి మించి వుండదు. పహలో పోతున్న రైలు కూత పెడితే ఆ శబ్దం 100 డెసిబుల్స్ ఉంటుంది. 150 డెసిబుల్స్ శబ్దానికి చెవి గూబలు పగిలిపోతాయి!

అరుపుల పోటీలో పాల్గొన్నవారిలో బాలామంది తమ కనీసావసరాలు తీరాలని అరిచారు. కొంతమంది అరుపులరూపంలో ఏవో ప్రశ్నలు వేశారు. మరికొందరు తిట్లు, శాపనార్థాలు పెట్టారు.

ఓ గృహిణి "నాకు ఉద్యోగం కావాలి" ఓ పిల్లవాడు "అమ్మా నువ్వెక్కడున్నావ్? నేనిక్కడున్నాను" అని అరిచారు.



# మమ్మీలు

ప్రాచీన ఈజిప్షియన్లు మరణించిన తర్వాతకూడా జీవితం వుంటుందని నమ్మేవారు. అందుకే వాళ్లు చనిపోయినవారిని మమ్మీలుగా రూపొందించి పిరమిడ్లలో జాగ్రత్త చేసేవారు.

గత శతాబ్దంనుంచి ఐరోపా ఖండపు పరిశోధకులు కొందరు ఈజిప్టువాళ్ళ తోలు వస్తువులు, పిరమిడ్లను పరిశీలించడం ద్వారా ఈజిప్ట్‌లోని మమ్మీలకు సంబంధించిన అనేక విషయాలు వెలుగులోకి వచ్చాయి.

మొదటిసారి మమ్మీని ఎక్స్‌రే తీసిన ఘనత ఎలియట్ స్మిత్, హావార్డ్ కార్టర్ లకి దక్కుతుంది. స్మిత్ శారీరకశాస్త్రంలో నిపుణుడుకాగా, కార్టర్‌కి తోళ్ళకి సంబంధించిన పరిజ్ఞానం బాగా వుంది.

ఈ శాస్త్రవేత్తలిద్దరూ నాలుగవ 'టత్ మోసిస్' అనే మమ్మీ చుట్టూ చుట్టిన ఔషధీయుక్తమైన బట్టలను తొలగించి, ఆ దేహాన్ని ఎక్స్‌రే తీశారు. అప్పటినుంచి మమ్మీలపై పరిశోధన ముమ్మరంగా జరుగుతోంది. ఆవిధంగా దాదాపు 8 వేల మమ్మీల శరీరభాగాలన్నింటిని కోసి పరీక్షించి చూశారు.

1974లో వాళ్లు 3,200 ఏళ్ళక్రితం నాటిదయిన మమ్మీని అలా పరిక్షచేశారు. ఆ మమ్మీ ఒక నేతపనివానిది. ఇంకా విశ్లేషించి చూడగా, ఆ మమ్మీ 15 ఏళ్ళ వయసులోనే మృతిచెందిన బాలునిదని వెల్లడయింది.

అతని ఎముకలను పరిశీలించి చూస్తే అతను సరయిన పోషకాహారంలేక చాలా రోగాలతో బాధపడినట్టు వెల్లడయింది.





అతని శ్వాసకోశాలను పరిశీలించగా వాటిలో ఎంతో ధూళి, బొగ్గుపొడి వున్నట్టు బయటపడింది. దీన్నిబట్టి అప్పట్లోనే వాతావరణ కాలుష్యమనే సమస్య వుండేదని వూహించారు.

అతని ఎముకలకి అంటివున్న పరాన్న భుక్కులను బట్టి చూస్తే అతను 'స్కిస్టో సోమియాసిస్' అనే వ్యాధితో బాధపడినట్టు తెలిసింది. ఈజిప్ట్‌వాళ్లు చాలామంది ఈ వ్యాధితో బాధపడే వారట!

అతని పళ్లు మంచిస్థితిలోనే వున్నాయి. ఒక్కటి పాడవలేదు. దాన్నిబట్టి ఆ బాలుడికి తీపిపదార్థాలు తినే అలవాటు లేదని తెలుస్తోంది.

ఆశ్చర్యకరమయిన విశేషమేమంటే, ఆ ఈజిప్టు బాలుడి తల్లిదండ్రులు ధనవంతులు కాకపోవడంవల్ల అతన్ని సాంప్రదాయకమయిన పద్ధతిలో మమ్మీగా తయారుచేయలేదు. అతని మృతదేహాన్ని కేవలం ఒక బట్టలో చుట్టేసి ఈజిప్టులోని ఎడారుల్లో ఖననంచేశారు. ఈజిప్టులో వుండే వాతావరణం, తేమల కారణంగా ఆ మృతదేహం ఇన్ని శతాబ్దాలుగా ఏమీ పాడవకుండా మిగిలి వుంది.

ఈజిప్టులో ఆరోజుల్లో మృతదేహాలను మమ్మీలుగా మార్చేపని చేపట్టేందుకు ఓ ప్రత్యేకమైన జాతి వుండేది. వాళ్ళు ముందుగా పొత్తికడుపులోని ప్రేవులను, మెదడును తొలగించేవారు. గుండెకాయను అలాగే వుంచేవారు.

ఈజిప్టువాళ్ళు మెదడు కూడా గుండె యొక్క భాగమేనని నమ్మేవారు. వాళ్ళు శరీరంలోకి నీరుపోకుండా ముందు శరీరంపై 'వాటర్‌ప్రూఫ్ పేస్ట్' రాసిన తర్వాత వాషింగ్ సోడాతో కడుగు

తాయి. తర్వాత ఆ శరీరాన్ని 40 రోజుల పాటు ఎండగడతాయి.

మమ్మీలనగానే ఎవరికైనా వెంటనే ఈజిప్ట్ మాత్రమే గుర్తొస్తుంది. కాని, మమ్మీలు అలాస్కా, పెరూ, డెన్మార్క్, ఆస్ట్రేలియా, జపాన్ దేశాల్లో కూడా వున్నాయి. స్మశానంలో ఖననంచేసిన మృతదేహాలని తప్ప, దాచి ఉంచిన ఏ మృతదేహాన్ని అయినా మమ్మీ అనవచ్చు.

జపాన్, ఈజిప్టులలో తప్ప మిగిలిన దేశాల్లో మృతదేహాలను దాచడానికి ప్రత్యేకమైన ప్రయత్నమేమీ చేయరు. ఆ దేశాల్లోగల వాతావరణ పరిస్థితులవల్ల మృతదేహాలు చెడకుండా వుంటాయి. జపాన్‌లో బౌద్ధమత నాయకులు తమ మత గురువుల మృతదేహాలను మమ్మీలుగా తయారుచేయాలని నమ్ముతారు.

1950లో కొందరు రైతులు అనుకోకుండా 2,100 ఏళ్ల నాటి ఒక మమ్మీని భూమిలోంచి వెలికిదీశారు. 'టోలేండ్‌మేన్' అని పేరు పెట్టిన ఆ మమ్మీ చూడ్డానికి క్రితం రోజునే ఖననం చేసినట్టుగా కనబడుతోంది.

# పంటినొప్పికి కాలి వైద్యం!

"కాలికి ఓ సూది గుచ్చి ఎటువంటి నొప్పి లేకుండా పన్ను తీసేయొచ్చు" అంటే విచిత్రంగానే వుంటుంది. కాని, ఆక్యుపంచర్ వల్ల అది సాధ్యమవుతుంది.

మనదేశంలో ఇంతవరకూ పూర్తి కాలం ఆక్యుపంచర్ వైద్యవృత్తిలో గడిపే డాక్టర్లు చాలా తక్కువ. మద్రాసులోని 'రాక్సీ సినిమా థియేటర్' దగ్గరలో యస్.కె.యమ్. ఇబ్రహీమ్ అనే డాక్టర్ ఓ ఆక్యుపంచర్ క్లినిక్ తెరిచాడు. దాని పేరు 'సైనిక్ ఆక్యుపంచర్ క్లినిక్'. ఆక్యుపంచర్ పద్ధతిలో రోగనివారణ అతి తక్కువ ఖర్చుతో కూడినదేకాక, రోగికి త్వరగా ఉపశమనాన్నిస్తుంది. అల్లోపతి వైద్యం తగ్గించలేని రోగాల నెన్నిటినో ఆక్యుపంచర్ నివారించినట్టు చెబుతుంటాడు డాక్టర్ ఇబ్రహీమ్.

ఆక్యుపంచర్ చైనా తర్వాత శ్రీలంకలో బాగా ప్రాచుర్యం పొందింది. డాక్టర్ ఇబ్రహీమ్ శ్రీలంకలోనే ఆక్యు



పంచర్‌లో శిక్షణ పొందాడు. శ్రీలంక లోని ఆస్పత్రులలో రోజుకి 500 మంది రోగులకి ఆక్యుపంచర్ పద్ధతిలో వైద్యం జరుగుతుంది.

డాక్టర్ ఇబ్రహీమ్ క్లినిక్ తెరిచిన మొదటివారంలోనే 30 మంది రోగులకి వైద్యం చేశాడు.

"కాళ్లో ఒకచోట సూదిని గుచ్చి, ఎలాంటి నొప్పీ లేకుండా పంటిని తొల గిస్తాను" అని చెబుతున్నాడు ఈ ఆక్యు పంచర్ వైద్య నిపుణుడు.

## తాళి లేని పెళ్లి

తమిళనాడులోని సేలం హైవేలో ఉన్న 'విరుదాచలం'కి దాదాపు 3 మైళ్ళ దూరంలో 'కొలంజియప్పార్' ఆలయ ముంది. భుజాలపై ఎర్రటి కండువాలు వేసుకున్న కామ్రేడ్లు కొందరు గుంపులు గుంపులుగా ఆ ఆలయంవైపు వెళు తున్నారు.

వాళ్ళంతా ప్రొఫెసర్ కాలియ పెరుమాళ్ కూతురైన అంజుహామ్ పెళ్ళికి హాజరవుతున్నారు. 60 ఏళ్ళ ప్రొఫెసర్ కాలియపెరుమాళ్ తమిళ నాడులో ప్రముఖ నక్సలైటు. 12 ఏళ్లు జైల్లో వుండి ప్రస్తుతం 'పెరోల్' మీద బైటకు వచ్చాడు. అతని కుమారులైన వల్లువన్, నంబిలు; బంధువులైన రాజ మాణిక్యమ్, ఆర్ముగమ్, మసిలమణిలు కూడా 10, 12 ఏళ్ళబట్టి జైల్లోనే ఉంటున్నారు.

ఇటీవలి కాలంలో వాళ్ళింట్లో ఈ పెళ్ళి ఒక్కటే గొప్ప సంఘటన. పూర్వం ఆయన జైల్లో ఉండగానే 1972లో పెద్ద కుమార్తె 'తమిలరసి' పెళ్ళి జరిగింది. ఆయన భార్య వలంబాళ్ అప్పట్లో తన పెద్ద కూతురు పెళ్ళి కోసం బెంగపెట్టుకుని, ఆమె పెళ్ళిని హడావుడిగా జరిపించింది. "మొదట జైలు అధికారులు తమిలరసి పెళ్లి జైల్లో జరుపుతామంటే ఒప్పుకోలేదు. మేము వదలకుండా అర్జీలు పెడుతుండేసరికి వాళ్ళు మెత్తబడ్డారు. పెళ్లికూతురు, పెళ్లికొడుకు కటకటాల బైట ఉండగా నా భర్త జైల్లో నుంచే వారికి పూల దండలు అందజేశాడు. వాళ్ళు ఆ దండలు మార్చుకోగానే, జైల్లో ఉన్న ఇతర కామ్రేడ్స్ తమ శుభాకాంక్షలను తెలుపుతూ పాటలు పాడారు" అని ఆ పెళ్లి గురించి వివరించిందామె.

ఈ పెళ్లిరోజు అది జరిగిన ఆలయం సినిమా సెంటులా కనబడుతోంది. నక్సలైట్లు కొందరు గేటు దగ్గర నిలబడి అక్కడికి వచ్చినవారికి స్వాగతం చెబు



తున్నారు.

ఆలయ ప్రాంగణంలో జరుగుతున్నా ఆ పెళ్లి ఆలయ ఆచార వ్యవహారాలకి భిన్నంగా నక్సలైటుల పెళ్ళిలానే జరిగింది. నిజానికి చూసేవారికి అదో నక్సలైటుల రహస్య సమావేశంలా తోచింది.

వధువు అంజుహామ్ ఎస్సెస్సెల్సీ వరకు చదివి, కుట్టుపనిలో డిప్లొమా చేసింది. వరుడైన షణ్ముగమ్ ఆటోమొబైల్ కోర్సులో డిప్లొమా తీసుకుని మెకానిక్‌గా ఉద్యోగం చేస్తున్నాడు.

కోయంబత్తూరులో నక్సలైట్ల పెద్ద అయిన ఈశ్వరన్ ఆ పెళ్లికి ఆధ్వర్యం వహించాడు. వివాహ ప్రకటనను పైకి చదివాక, వధూవరులిద్దరూ పెళ్లి సర్టిఫికెట్ మీద తమ సంతకాలు చేశారు. తాళి కట్టడంలాంటివి లేకుండా, పరస్పరం పూలదండలు వేసుకోవడంతో ఆ వివాహం పూర్తయింది.

పౌర స్వేచ్ఛ కోసం పాటుపడే ప్రఖ్యాత న్యాయవాది ఇబ్రహీమ్, మరో ప్రముఖ న్యాయవాది గౌస్‌లు సాక్షి సంతకాలు చేశారు. పెళ్లికి వచ్చినవాళ్లు నూతన జంటను మార్క్సిస్ట్ లెనినిస్ట్ సిద్ధాంతాల కోసం పాటుపడమని సలహా ఇచ్చారు.

## మాట వినే కారు

ఫ్రాన్సులో కార్లు తయారుచేసే ప్రముఖ రెనాల్ట్ కంపెనీవాళ్లు ఓ కొత్తరకమైన కారును రూపొందించారు. ఆ కారు మనం చెప్పిన మాట విని, ఆ ప్రకారం పని చేస్తుంది.

కారు డ్రైవ్ చేస్తుండగా కారులో అమర్చిన మైక్రోఫోన్‌లో 'సెకండ్ గేర్' అంటే చాలు, ఆవిధంగా గేరు మార్చేస్తుంది. 'హెడ్‌లైట్స్ ఆన్' అనగానే లైట్లు వెలిగిస్తుంది. కారులోగల కంప్యూటర్ ఆవిధంగా ఏం చెప్పినా జరిగేటట్టు చూస్తుంది.

ఈ కారుకు స్టీరింగ్ వీల్ అవసరం వుండదనుకుంటే పొరపాటు. తక్కిన కార్లకుమల్లేనే ఈకారుకీ స్టీరింగ్ ఉంటుంది. ఈ కారు కూడా స్టీరింగ్ వీల్‌నిబట్టే మలుపులు తిరుగుతుంది.

ప్రస్తుతం ఈ కారును ప్రదర్శించి చూపడం మాత్రమే జరుగుతోంది. త్వరలో మార్కెట్లో అమ్మకానికి వస్తుంది.



# వెనకడుగు

పిలాన్ని లింగో అనే అమెరికన్ చాలా కాలం పాటు నిరుద్యోగిగా బాధలను అను భవించాడు. ప్రభుత్వం ఇచ్చే కొద్దిపాటి నిరుద్యోగ భృతితో ఎంతోకాలం బతక లేకపోయాడు. దాంతో అతనికో ఆలోచన కలిగింది. వెనుకకు నడుస్తూ ప్రపంచాన్ని చుట్టాలనేదే ఆ ఆలోచన.

అతనలా వెనుకకు నడిచే ప్రయాణాన్ని 1931 ఏప్రిల్ 15న టెక్సాస్‌లోని ఫోర్ట్‌వర్త్ అనే ప్రదేశం నుంచి ప్రారంభించాడు. మొదట్లో లింగోని ఎవరూ పట్టించుకోలేదు. క్రమంగా స్థానిక పత్రికలు అతని గురించి రాయడం ప్రారంభించాక ప్రజలకి ఆసక్తి పెరిగి, అతను వెళ్లిన చోటల్లా ఎంతోమంది అతన్ని చుట్టుముట్టేవారు.

లింగోకి భారీమొత్తంలో విరాళాలు కూడా అందసాగాయి. ఎక్కడికి వెళితే అక్కడ మంచి భోజనం లభించేది. కొన్ని కంపెనీలు అతన్ని తమ ప్రచారానికి వాడుకునేవి. అతను రోజుకి 35 మైళ్లు నడిచేవాడు.

అతను అలా వెనుకకు నడుస్తూ యూరప్‌ని దాటి ఆసియా చేరుకున్నాడు. కాని ఆసియా సరిహద్దుల దగ్గర అధికారులు అతను తమ ఖండంలో ప్రవేశించడానికి అనుమతి ఇవ్వలేదు. దాంతో అతను నౌకలో వెనక్కి మరలి కాలిఫోర్నియా చేరుకున్నాడు.

కాలిఫోర్నియా నుంచి తన స్వస్థలం చేరుకోవడానికి మళ్లీ వెనుకకు నడుస్తూ ప్రయాణించాడు లింగో. అలా అతను 8 వేల మైళ్లు నడిచాడు. లింగో తన ప్రయాణంలో 13 జతల బూట్లు మార్చాడు.

కార్లు, బస్సులకు వున్నట్టు లింగో తన బూట్లకు రియర్‌వ్యూ అద్దాలను బిగించుకోవడంతో అతను వెనుకకు చూడ గల్గుతూ, ఎలాంటి ప్రమాదాలు జరగకుండా ప్రయాణం చేసేవాడు.

ప్రస్తుతం లింగో 88 ఏళ్ల వృద్ధుడైనా ఇప్పటికీ అతను తాను వెనుకకు నడుస్తూ ఎలా ప్రయాణించిందీ అదే వుత్సాహంతో చెబుతాడు. ఈ నడకవల్ల అతను గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో కూడా చోటు చేసుకున్నాడు.



"ఏం చెయ్యనక్కా! నేనూ చూస్తున్నా ఎక్కడన్నా ఓ మంచి మనిషి కన్పడ్తాడేమోనని ... ఆడవాళ్లని కూడా మనుషుల్లా చూసే మగమనిషి కనపడ్తాడేమో అని" అంది వేణు నవ్వుతూ.

రమాదేవి ఆశ్చర్యపోతూ అంది– "అయితే ఇంత పెద్ద నగరంలో నీకు మగాడే కనపళ్లేదంటావ్!"

"మగాడా! మగాళ్లదేముంది? దేశంలో సగంమంది వాళ్లేగా. నాక్కావల్సింది మగాళ్లలో మనిషి. మనిషి కాని మగాణ్ణి నేను ఇష్టపడలేను...పడను" అంది ప్రతి పదాన్నీ వత్తి పలుకుతూ.

వేణు చిత్రమైన పిల్ల. తోటి ఆడపిల్లలందర్లా తనక్కాబోయే భర్తకి మంచి ఉద్యోగం వుంటేనో, బాగా చదువు వుంటేనో, అందముంటేనో చాలనుకునే పిల్ల కాదు.

తను జీవితమంతా కల్సి బతకాల్సిన వ్యక్తి గురించి కొన్ని స్పష్టమైన ఇష్టాలు వున్నాయి.

అమ్మా నాన్నలేమో ఒకటే గొడవ. వాళ్లు ఆ గొడవ ఊళ్లో వుండే చేస్తున్నారు. కాని, ఆ గోల ఈ సిటీలోకి కూడా విన్పడ్తూనేవుంటుంది. ఊర్నించి సిటీకి ఎవరొస్తున్నా 'మా అమ్మాయి దగ్గర కెళ్లండ'ని అడ్రసిస్తారు.

ఓసారి వేణు హడావుడిగా వంటా అదీ పూర్తిచేసుకుని, తయారయి ఆఫీసు కెళ్లబోతున్న సమయంలో సుందర రామయ్య బాబాయ్ కాస్తా చక్కగా వచ్చి కూర్చున్నాడు.

"అమ్మాయ్" అంటూ మొదలెట్టి ఆయనతీరిగ్గావేణు ఈడున్న పిల్లలెవరెవరికి ఎంతెంత మంది పిల్లలు పుట్టారో, ఆపరేషన్ గనక చేయించుకోకపోతే ఎంతెంత మంది పుట్టివుండేవారో, ఆ పుట్టిన పిల్లలికి ఎంతెంత వయసులొచ్చాయో మొదలైన భోగట్టాలన్నీ చెప్పాడు. అంతా అయ్యాక చివరికి "ఇంతకీ నువ్వు ఈ పీడన్నా మాకు పప్పన్నం పెడ్తావా?" అని రంగంలోకి దిగాడు.

వేణు ఆఫీసుకెళ్లేసరికి ఎంత లేటవు తుందో ఆలోచిస్తూ 'ఊ' 'ఊ' అంటూ మధ్య మధ్యలో ఆయనేసే ప్రశ్నలకి అంటీ ముట్టనట్టు ఏమేమిటో చెప్పి మొహమాటపడ్తూ "నా ఆఫీసుకి టైం అయింది. సాయంత్రం మాట్లాడుకుందాం" అంది ఓపిక నశించాక.

"ఏం..ఒక్కపూట ఆఫీసు మానేస్తే ఏమవుతుంది? మీ నాన్న ఒక అడ్రసిచ్చి పంపాడు. కుర్రాడిక్కడే సనత్‌నగర్‌లో జాబ్ చేస్తున్నాడట. నాలుగొందలొస్తున్నాయ్. మనేపే. ఊళ్లో కాస్త పొలం కూడా వుందంట. నీకిష్టమైతే నన్నెళ్ళి మాట్టాడమన్నాడు మీ నాన్న. మరి ఏమంటావ్?" అన్నాడు.

"అది కాదు బాబాయ్! సరే...నేను తర్వాత నాన్నకి ఉత్తరం రాస్తాలే...." అని ఆగింది వేణు.

అలా వచ్చినవాళ్లందరికీ తనకి నచ్చినమనిషినే చేసుకుంటాననీ, నచ్చడం నచ్చకపోవడం అనేది బాగా పరిచయమయ్యాక గానీ తెల్చుకోలేననీ ఎలా చెప్పడమా అని ఆలోచిస్తూంది వేణు.

కాని, సుందరరామయ్యకి అనుమానం "ఏంటమ్మా సంగతి! ఎవరన్నా నీ మనసులో వుంటే చెప్పు. మీ నాన్నకి నేను నచ్చజెప్తా" అంటూ మొదలెట్టి తానెటువంటి క్లిష్టమైన వ్యవహారాలు ఎలా ఎలా నడిపిందీ, ఎంతెంత పెద్ద పెద్దవాళ్లు తన చాతుర్యానికీ, చమత్కా




రానికీ డంగై పోయిందీ వర్ణించాడు.

వేణుకి నీర్సం కమ్ముకొస్తూండగా "సాయంత్రం వరకూ రూంలోనే వుండు బాబాయ్! నేను ఆరింటికొస్తా" అని చెప్పేసి, బాబాయ్ ఎంత గోలచేస్తున్నా వినకుండా ఉరుకులు పరుగుల్తో బైట పడింది.

సాయంత్రం మళ్ళీ మొదలు...

తనెన్నెన్ని మాయలుచేసి ఎన్నెన్ని పెళ్ళిళ్లు చేయించాడో...

చివరికి వేణు నవ్వుతూ "ఎంత మందికి పెళ్లిళ్లు చేయించావో చెప్తున్నావు... బాగానే వుంది. కానీ వాళ్లల్లో ఎంతమంది శాంతిగా, సుఖంగా ఒకరంటే ఒకరికిష్టంగా వున్నారు? అది చెప్పవేం బాబాయ్" అంది.

"ఏ..ఏం తీపరం? అందరూ వుంటల్లా! పెళ్ళి అయ్యేదాకానే ఈ నిక్కులూ, నీల్గులూ! పెళ్లయ్యాక ఒకరికొకరు కష్ట మొచ్చినా సుఖమొచ్చినా..."

"నేననేది అదికాదే...నువ్వు పెళ్ళిళ్ళు చేయించినవాళ్లల్లో ఎంతమంది సుఖంగా వున్నారు?"

"అందరూ సుఖంగా వున్నారు...ఆ నూటికి నూరుమందీని" అన్నాడు సుందర రామయ్య.

"కబుర్లు చెప్పమాక. నువ్వు చేయించిన పెళ్ళి కదూ మన సుబ్బా రావుది. వాళ్ళిద్దరూ ఎప్పుడూ కీచులాడు కుంటూనే వుంటారు"

"ఏ.... కీచులాడుకుంటే మొగుడూ పెళ్ళాం కాకుండా పోయారా? అసలు కీచులాటలూ, దెబ్బలాటలూ ఎవరి సంసా రాల్లో వుండవంటా! పెళ్లామన్నాక ఒక మాట అనకుండానూ ఉండదు. మొగు డన్నాక ఒక దెబ్బ వెయ్యకుండానూ ఉండడు. ఎంత కిందామీదాపడ్డా వాళ్ళిద్దరూ ఒకటే. చెడి చెడి సంసారా లవుతాయనీ శాస్త్రం"

"అంటే పోట్లాడుకోకుండా భార్యా భర్తలుండటం కుదరదంటావా?"

"కుదరడానికేముందిలేమ్మా! ఒక రేటికి లాగితే ఒకరు కాటికి లాగుతారు. ఒక్క మాటమీద ఉండేవాళ్లు లేరనికాదు గానీ...ఎక్కడో ఒక్కరు"

"అదే...ఎందుకనలా అవుతుందీ అని?"

"ఎందుకంటే...? ఇప్పుడు లాటరీ టిక్కెట్టులుకొంటున్నారు. అందరికీ లాటరీ వస్తుందా? లక్షలమంది కొంటే ఎక్కడో ఒకడికి లక్ష వస్తుంది. పది పన్నెండు మందికి వేలూ వందలూ వస్తాయ్. మరి మిగిల్నాళ్ళందరికీ కూడా రావాలంటే, అదెట్టా కుదుర్తుంది? పెళ్ళన్నా అంతే! ఎక్కడో ఓ జంట కన్నుల పండుగ్గా వుంటుంది. కొందరు చిన్న చిన్న తగాదా లొచ్చినా సర్దుకుపోతారు. ఎక్కువమంది అట్టాగే...ఏడుస్తో, మొత్తుకుంటో సంసా రాలు చేస్తారు. లోకమంతా అట్టాగే వుంది. సుబ్బారావూ అంతే" అన్నాడు సుందర రామయ్య.

"సుబ్బారావు గురించి తీసెయ్యకు. నేననేది...లాటరీ రాకపోయినా పోయేది ఒక రూపాయే కాబట్టి ఫర్లేదనుకో. నా కైతే ఆ లాటరీ కూడా ఇష్టం వుండదు. అది పోనీ! మరి ఒకసారి పెళ్లి చేసుకుంటే లాటరీలాగా, సరయిన మనిషి తగలక పోతే, జీవితమంతా నరకమేగా బాబాయ్!"

"ఒసి ఊరుకోవే! చదవేస్తే ఉన్న మతి పోయిందనీ...మీ చదువుకున్నాళ్లతో ఇదో చిక్కు. ఏలికేస్తే కాలికి కాలికేస్తే ఏలికి ఏస్తారు. దేశం 'అంతా పెళ్లిళ్లు చేసుకోటల్లా! అట్టా అని అసలు పెళ్ళే



ఎంతోరుచి...
ఎంతోరుచి...

ప్రియలోనే
వుంది.




అన్ని రకాలలోను అనంతమైన రుచులు
కలబోసి అందిస్తై ప్రియ పచ్చళ్ళు.
తలచుకొంటే చాలు తరగిపోని
రుచిరానుభూతికి- ప్రియ.
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి
తీసుకువెళ్ళండి.

ఎంతో రుచి... ఎంతో రుచి...- ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETIN
PRIVATE LIMITED

మానేస్తారా ఎవరన్నా?" అని చనువుగా కోప్పడ్డాడు.

"పెళ్ళి మానేస్తానని కాదు ... నాకు నచ్చిన మనిషి దొరికేవరకూ ఆగాలని" అంది నవ్వుతూ వేణు.

"నచ్చిన మనిషి... నచ్చిన మనిషనే అన్నట్టూ చంపుతున్నావ్! అసలాడికి బుద్ధి లేదులే. 'చురుకయింది, తెలివైంది' అని నిన్ను నెత్తినెక్కిచ్చుకున్నాడు మీ నాన్న. అసలు నీకు నచ్చిన మనిషి దొరుకుతాడా? ఉన్నాళ్ళల్లోనే కాస్త నాలుగు డబ్బులు సంపాదించేవాణ్ణి, కాలూ చెయ్యీ సరిగ్గా వున్నాణ్ణి, ముక్కూంకర మూతొంకర లేనివాణ్ణి చూడాలి... చేసుకోవాలి. పెళ్ళయ్యే అన్నీ అయ్యే నచ్చుతాయ్. మా అందరికీ నచ్చే చేసుకున్నామా? ఇప్పుడు నచ్చినా, నచ్చకపోయినా వదిలేస్తున్నామా?

"అది కాదు బాబాయ్! మీకెవరికీ నా గోడు అర్థంకాదులే...నేనట్లా ఎవరో ఒకరులే అని చేసుకోదల్చుకోలా! నా మనసుకి అన్నివిధాలా నచ్చిన మనిషినే..."

"అన్ని విధాలా నచ్చిన మనిషి దొరకడు...అప్పుడు?" అని ఎడమ అరచేతిలో కుడిచేతి గుప్పిటతో కొట్టి, అసలు పాయింటు పట్టేసినంత—సంబరపడ్డాడు సుందరరామయ్య.

"ఏంటి అప్పుడూ...?అసలు పెళ్లే చేసుకోను. ఏం? పెళ్ళిలేకపోతే ప్రాణం పోతుందా?"

"ఓసి నీ దుంపతెగ! నీ వరస జూస్తే నీ ప్రాణం పోదుగానీ, ఊళ్లో కస్తూరి పెళ్ళిచెయ్యలేకపోయాడని చెప్పుకుంటూంటే, వినలేక మీ బాబు ప్రాణం పోతుందే!"

"లాభం లేదులే బాబాయ్! ఎవరెన్ని చెప్పినా నే వినను. నన్నర్థం చేసుకోండి! అంతే"

"నేనర్థం చేసుకుంటానమ్మా! కానీ లోకం అర్థంచేసుకోవద్దూ? ఊళ్లో జనం అర్థంచేసుకోవద్దూ?"

వేణు దగ్గిరకొచ్చి వెళ్లే ప్రతివాళ్లూ అనే మాటే సుందరరామయ్య కూడా అన్నాడు. విడివిడిగా అందరూ వేణుని అర్థంచేసుకుంటారు. కానీ అందరూ కల్సి మాత్రం అర్థంచేసుకోరు.

నిజం చెప్పాలంటే వేణుని వాళ్లెవరూ అర్థం చేసుకోలేదు...చేసుకోలేరు. వాళ్లకా శక్తి లేదు. అయినా తాము అర్థం చేసుకున్నాంగానీ ఇతరులే చేసుకోలేరు అంటారు.

"అందుకే ఎవరో నన్ను అర్థం చేసుకోలేరు కాబట్టి, నేను పెళ్ళిచేసుకోవాలా? నా పెళ్ళి నాకోసమా? ఊళ్లో నన్నర్థం చేసుకోలేని వాళ్లకోసమా?" అంది వేణు కోపంగా.

"నువ్వు పెళ్ళిచేసుకుంటే ఊళ్లోవాళ్ల కేం లాభం? నువ్వు చేసుకునేది నీకోసమే"

"నాకోసమయితే నాకు తెలుసు ఎప్పుడు, ఎవర్ని, ఎందుకు, ఎలా పెళ్ళి చేసుకోవాలో, అక్కర్లేదో? మీరెవరూ నాకు సంబంధాలు చూడక్కర్లేదు...." అని కాస్త తమాయించుకుని-

"ఇదుగో బాబాయ్ చెప్తున్నా...నువ్వు నా దగ్గిరికి నీ ఇష్టమొచ్చినన్నిసార్లు రా! కానీ పెళ్ళి గురించి మాత్రం అడగమాక. తెల్సిందా? ఇక అది పోనీ...ఏమిటి ఊరి విశేషాలు? ఎవరన్నా పిల్లల్ని కన్నారా? ఎవరన్నా చచ్చిపోయారా? మీ పచ్చ గన్నేరు చెట్లు అలానే వున్నాయా? నీగ్గుర్తుందా నేనూ, అరుణా ఎప్పుడుచూసినా ఆ

చెట్ల దగ్గరే ఉంటామని... ఆ పాలు కంట్లో పడి కళ్లుపోతే అందరూ తనసంటారని పిన్ని తెగ గొడవ చేసేది..." అంటూ దారి మళ్లించింది రేణు. ఇలా నెలకి రెండు మూడుసార్లన్నా ఊళ్లోంచి 'బా బా య్'లో, 'అ త్త య్య'లో, 'మావయ్య'లో, 'పిన్నమ్మ'లో వస్తూనే వుంటారు.

తన స్నేహితులందరికీ పెళ్ళిళ్ళయి పోయి పెద్ద సంసారులు, అంటే పాత సంసారులు అయిపోతున్నారు.

తనకి అప్పుడే ముప్పైయేళ్ళు వచ్చే స్తున్నాయి.

కానీ, తనకిష్టమైనవాడు కనపడటం లేదే అనే బాధకన్నా, ఈ శ్రేయోభి లాషుల హితవచనాలూ, వాళ్లు తెస్తున్న సంబంధాలూ ఒక్కొసారి వేడుకి నిర్ఘాం తెప్పించేస్తున్నాయ్.

ఎప్పుడో, ఏ పుస్తకమో చదూతూ చదూతూ ఒక్కసారి ఆలోచనల్లోకెళ్ళి పోతుంటుంది.

తను చదివే పుస్తకాల్లో మంచి వ్యక్తి త్వంతో, సహృదయంతో, స్త్రీలయెడల సానుభూతితో, సమాన గౌరవాభిమానాలు వ్యక్తంచేస్తూ ఒకరిద్దరు మంచి వ్యక్తులు కన్పడుతూ వుంటారు.

కానీ, జీవితంలో...?

పోనీ ఊళ్లో గడిపిన పద్దెనిమిదేళ్లు తీసేసినా...పది - పన్నెండేళ్ల నించి చూస్తూనే వుంది...

పెద్ద పెద్ద చదువులు చదువుకున్న వారినీ...

మంచి ఉద్యోగాలు చేస్తున్నవారినీ...

సు...రవంతుల్లా ఉండేవారినీ...

...వారినీ...

ఎంతమందిని తను చూసింది! ఎందరితో కాస్త దూరంగానైనా పరిచయా లున్నాయ్!

కానీ, ఏ ఒక్కరూ ఒక్క అయిదు నిమిషాలపాటు 'మనిషి'లా నిలబడలేక పోయారే!

ఇద్దరు ముగ్గురి విషయంలో కాస్త మినుకు మినుకుమన్న ఆశ...వారికి మరి కాస్త దగ్గరకొచ్చేసరికి తేలిపోయిందేం!

రమాదేవి అంటోంది "ఎవర్నీ దగ్గ రకే రానివ్వకపోతే ఏ మగాడెటువంటి వాడో ఎలా తెలుస్తుందే! అసలు పెళ్ళి చూపులకే ఒప్పుకోవ్వూ. పోనీ నీ అంతట నువ్వు చూసుకుంటావేమోలే అని ఊరు కుంటే అదీ లేదాయె. అక్కడికీ నాన్న ఏదో లోకంతోపాటు పోకుండా నిన్ను చదివించినందుకు, ఇంత పెద్ద నగరంలో ఉద్యోగం చేయిస్తున్నందుకు కాస్త మంచీ చెడ్డా తెల్సుకున్నదానివని నీమీద భారముంచి నిన్ను నమ్మినందుకు, పోనీ నువ్వన్నా చూసుకుంటున్నావా అంటే అదీ లేదు. ఎంత ఆలోచించే నాన్నయితే మట్టుకు ఆయనకీ లోకానికి జవాబు చెప్పుకోవాల్సిన పనుందా లేదా? తెల్లారి లేస్తే ప్రతివాళ్లూ అడిగేవాళ్ళేనాయే- 'అమ్మాయి పెళ్ళి అమ్మాయిపెళ్ళి' అని. పోనీ నువ్వేమన్నా చిన్నపిల్లవా మరో నాలుగేళ్ళు ఆగుదాంలే అనుకోడానికి. నీతోపాటు థర్డుఫారం చదివి మానేసి పెళ్ళి చేసుకుందికదూ ఆ అరుణ. దాని కూతురు కల్పన మొన్న పెద్ద మనిషయ్యింది. ఈ ఏడో పైయేడో దాని క్కూడా పెళ్ళిచేస్తారట మేనమామ కిచ్చి. మరి నువ్వేమో చీమకూడా కుట్ట నట్టు కూర్చున్నావే. నీకెలా వున్నా పెద్దాళ్ళం మాకుండదూ" ఇలారమాదేవి వేణుని ఊదరగొట్టేసింది.

"నన్నేంచేయమంటావక్కా! మంచి మనిషి కన్పడ్తే పెళ్ళి చేసుకోవాలనే నేనూ చూస్తున్నా" అంది వేణు మళ్ళీ.

"ఆ మంచి మంచి అని కూర్చుంటే ఆ మంచిమనిషి మన కళ్ళముందుకొచ్చి వాల్తాడా? ఉన్నవాళ్ళల్లోనే మంచివాళ్ళని చూసుకోవాలి. లేదూ నా పల్లకాదంటే నాన్నే మాట్లాడినవాణ్ని ఎవర్నయినా నోరు మూసుకుని చేసుకోవాలి. లోకంలో అందరూ దుర్మార్గులే ఉన్నారనుకుంటు న్నావా? ఒకప్పుడు తిట్టుకున్నా మళ్ళీ వాళ్ళే మంచిగా అవుతారు. భార్యాభర్తలన్నాక పోట్లాటలు రాకుండానూ వుండవు. పోట్లాటలు వచ్చాకపోకుండానూ ఉండవు" అని సంసారవేదాంతసారాన్ని వివరించింది రమ.

రమ చెప్పిన సంసార వేదాంతాన్ని విన్న వేణు నవ్వునెలా ఆపుకోవాలో తెలీక సతమతమవుతోంది.

రమ కనిపెట్టింది "ఎందుకాస్తోం దమ్మా అంత నవ్వు? చెప్తే నేనూ నవ్వుతాగా!" అంది తనూ నవ్వుతూ.

"అది సరేగానీ వేణూ ... ఆమధ్య ఒక పిల్లాడు నీ చుట్టూ తిరుగుతున్నాడనీ నువ్వుకూడా అతనంటే కాస్త ఇష్టం చూపిస్తున్నావనీ అన్నాడే నాన్న" అని వేణు వంక చూసింది రమ.

"పోనీయక్కా! ఊరి కబుర్లేమన్నా చెప్పు...వింటాను" అంది మోముపై నవ్వు మాయమయిన వేణు.

"ఊరి కబుర్లకేముంది. ఎప్పుడూ వుండేవేలే! సరేగానీ ... ఆ కుర్రాడే మన్నాడే. కట్నం కావాలంటాడా?"

రమకి తెలియదు. రమకేకాదు– వేణు నెరిగినవారిలో కూడా చాలామందికి తెలియదు. ఏ కుర్రాడైనా వచ్చి వేణుని 'నిన్ను పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాను' అనగానే వేణు ఎగిరిగంతేసి అతన్ని పెళ్ళాడుతుందని అనుకుంటావుగాని అలా అడిగినవాళ్ళనికూడా వేణు తిరస్కరించిందని తెలియదు. ఈ విషయం తెలిస్తే వేణుని సుఖంగా బతకనిచ్చేవారా ఈ బంధువులు!

వేణుకి దురలవాట్లు లేనివాడయితే చాలు అనే తృప్తిలేదు. తనక్కావల్సిన వాడు తను జీవితమంతా కల్సిబతకవల్సిన వాడు–

చదువు,సంస్కారంగలవాడై వుండాలి.

సాహిత్యంతో పరిచయంగలవాడై వుండాలి.

ఆడపిల్ల మగపిల్లవాడికన్నా తక్కువనిగాక ఇద్దరూ సమానమనన్నట్లు ఖచ్చితంగా ఉండాలి.

కట్నం తీసుకోక తననేదో ఉద్ధరిస్తున్నట్టు గాక, కట్నం తీసుకోవడం ఓ ఘోరమైన, నీచమైన, హీనమైన పనిగా భావించాలి.

ఇలా... చాలా కోరికలున్నాయి వేణుకు!

"అడిగిందానికి చెప్పవేమే" అంది రమ ఆపలిస్తూ.

"అబ్బ! ఇప్పుడొచ్చావో లేదో అన్నీ 'ఆరా'లే నీకు. బడలికగా లేదూ? పడుకో.. తర్వాత మాట్లాడుకుందాం" అంది వేణు.

"సర్లే" అనుకుని బడలికగా పడుకుంది రమాదేవి.

వేణుకి నెమ్మదిగా రమ ప్రస్తావించిన ఆ 'పిల్లాడు' అప్పారావు గుర్తొచ్చాడు. అతన్తోపాటే శేఖరం.

"ఈ అప్పారావు మీకు తెలుసా?" అన్నాడు శేఖరం – టేబిల్ మీదున్న





వెడ్డింగ్ కార్డు తీసి చూస్తూ.

"ఆ! ఏదో..." అంది వేణు.

"ఎలా తెలుసూ?" అన్నాడు శేఖరం.

"మా కొలీగ్ మంజులకి బ్రదర్"

"ఆహా!" అని ఆలోచనలోపడ్డాడు శేఖరం.

"మీకెలా తెలుసూ అని నేనుకూడా అడగకపోతే చెప్పగూడదా" అంది వేణు నవ్వుతూ.

"కొన్నాళ్లు మేమిద్దరం కల్సి ఓ ప్రైవేటు కంపెనీలో పనిచేశాం...అప్పుడు తెలుసు. తర్వాత నేను హెవీ ఎలక్ట్రికల్స్‌లో చేరాను. అతను మరేవో రెండు మూడు కంపెనీల్లో చేసి ... ఇప్పుడు సెక్రటేరియట్‌లో అనుకుంటా...." అని ఆగాడు శేఖరం.

"అవును. సెక్రటేరియట్‌లోనే! ఆమధ్య ఇక్కడికొస్తూండేవాడు.." అని చప్పున ఆగింది వేణు.



"ఇప్పుడూ?"

శేఖరం వంక చూసి ఊరుకుంది.

"మీకిష్టం లేకపోతే చెప్పాల్సిన అవసరం లేదుగాని...ఇతను...నాకు బాగా తెల్సుగదూ...నాల్గయిదేళ్లు మేమంతా ఒక రకమైన సర్కిల్‌లోనే వున్నాం..."

ముఖ్యంగా ఆడవాళ్ల విషయంలో వీడంత హీనుణ్ని బహుశా నేను చూడలేను" అని కోపంగా ఆపాడు శేఖరం.

"అతని గురించి నాకు చాలా తక్కువ తెల్సునుకోండి. కాని తెల్సినంత వరకూ అతనికొక్క మంచి గుణం కూడా లేదన్పించింది" అంది వేణు.

"నిజమే! మీకింకా ఎక్కువ తెలిస్తే ఆ తెలిసింది కూడా అతనికి వ్యతిరేకమే అయుండేది. ఆడవాళ్లంటే వీడికెంత చులకనో? చివరికి అక్క చెల్లెళ్లు...అమ్మ... ఎవర్నీ గౌరవించడు. ఓసారి మేమంతా కలిసి ఎటో వెళ్తున్నాం. ఎదురుగా ఓ పదారు పదేడేళ్ల అమ్మాయి వస్తోంది. వీడేదో దర్రిద్రపు కూతొకటి కూశాడు - ఆ పిల్లని చూసి. ఆ పిల్ల తల లేపి వాడి వంక చూసింది. వీడిలో ఏ కాస్త మనిషి లక్షణాలున్నా, మానాభిమానాలున్నా ఆ పిల్ల చూపుకి సిగ్గుపడి చావొచ్చు. నీచుడు... అంత నీచుడు మళ్లీ వాడే... అప్పుడు వీడు మళ్లీ ఏదో అన్నాడు.

"మేం ఏడెనిమిది మందిమున్నాం. నేను సరేననుకోండి. అందరూ నాలాగా కాకపోయినా, మొత్తంమీద అందరికీ వాడంటే అసహ్యం పుట్టింది.

నేను అప్పారావుతో 'మీ చెల్లికి కూడా బహుశా ఈ ఈడే వుంటుందనుకుంటా' అన్నాను.

వెకిలిగా నవ్వాడు వాడు!

వాణ్నలా వదలాలన్పించక 'ఆ పిల్లనే ఎవరన్నా నీలాంటివాడు ఇలానే అనొచ్చుగదా?' అన్నాను.

అప్పారావు మళ్లీ వెకిలిగా నవ్వి 'నేనిప్పుడీ పిల్లనేమీ అనకపోతే మా చెల్లిని ఎవడూ ఏమీ అనడా?' అని మహా వెకిలిగా నవ్వేడు. మళ్లీ 'మా చెల్లిని అనేవాళ్లెలానూ అనక మానరు. 'దీన్ని' మనమెందుకు వదలాలి?' అన్నాడు.

అబ్బ! ఎంత అసహ్యమేసిందో. అప్పట్నుంచీ వాడితో నేను మాట్లాడలేదు" అని ఆగాడు శేఖరం.

వేణుకి అప్పారావు గురించి కాస్త బాగానే తెలుసు. అతను ఆడవాళ్లని 'అదీ' 'ఇదీ' అనే సంబోధిస్తూ మాట్లాడ్తాడు. ఎదురుగా ఉన్న స్త్రీ ఏమనుకుంటుందో అని కూడా తెలియనంత మూర్ఖుడన్న మాట అతను!

ఓసారి వాళ్ళింట్లో మంజులతోపాటు కూర్చునున్నపుడు భానుమతి పాటల్ని గురించి మాట్లాడ్తుండగా అతను కల్పించుకుని—

"దాని పాట నాకు నచ్చదు" అన్నాడు.

భానుమతి ముఖం వంక కాదుగదా ఓ కళాకారిణిగా ఆమె పాదాల వంక కూడా చూడటానికి అర్హతలేని హీనుడు. కాబట్టే అసలలా అనగల్గాడనుకుంది వేణు.

వెంటనే "మంజులా..నేవెళ్తున్నా" అని లేచి వచ్చేసింది - వెనక నుంచి మంజుల వేసే కేకలు కూడా వినకుండా!

'ఇప్పటిగ్గానీ అప్పారావు అసలు స్వరూపం తెలవలేదన్నమాట' అనుకుంది వేణు. ఆమెకి చాలా బాధగా వుంది. 'ఎంత నీచుడు. వీడు...,అనుకునికోపంతో ఉడికిపోయింది.

అంత నీచుడయిన ఆ అప్పారావే సరిగ్గా నాలుగునెల్ల క్రితం వేణుని పెళ్ళి చేసుకుని ఉద్ధరిస్తానన్నట్టు మాట్లాడాడు.

అది కూడా ఎలా మాట్లాడాడు...?

అప్పారావు కుర్చీ మీద కూడా స్కూటర్ మీద కూర్చున్నట్టే కూర్చుని




"వేణుగారూ! మిమ్మల్నోక మాట అడుగు దామనుకుంటున్నాను'' అన్నాడు.

అతని మొహంలో కనపడ్డ గర్వం, దర్పం అన్నీ చూసి 'ఇతను నన్ను ఉద్ధరిస్తానంటాడా ఏం ఖర్మ' అనుకుంది వేణు అప్పుడే!

"అడగండి" అంది ఆలోచనగా.

"మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాను"

"ఎందుకలా అనుకుంటున్నారు?" అంది వేణు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా.

తన ప్రస్తావన తేగానే గబుక్కున సిగ్గుపడిపోయి,తక్షణం లేచి తలుపు చాటు కెళ్ళి కంతల్లోగుండా ఓరగా చూడకపోగా "ఎందుకు!" అనేసరికి అప్పారావుకి భలే కోపమొచ్చేసింది. 'ఎందుకు' అనే ఆ ప్రశ్న ఇదివరకెన్నడూ లేనంత భయం కరంగా కన్పడింది.

"ఏం చూసి నన్ను పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నారు?" మళ్ళీ అంది వేణు.

"ఏం చూసినా ఏం చూడకపోయినా మీ తలతిక్క్గని మాత్రం కాదు" అన్నాడు అప్పారావు, తనన్న మాటలకి తనకే అర్థం తెలపనంత కసిగా. అసలు తనెంత త్యాగం చేస్తున్నాడో తెలియడంలా ఈ మొద్దుకి.

"సరేలెండి. మీరేం చూశారోగాని, నాకయితే మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటే మనిద్దరికీ నరకమేనని చాలా స్పష్టంగా తెలుసు.సో...సారీ" అంది వేణు.

అప్పటికే వాడిని గురించి కొంత తెలిసి మిగతాది ఊహించి ఉంది వేణు. అందుకే "అయాం వెరీ సారీ! అది జన్మలో జరగదు" అంది మళ్ళీ.

ఆ మాటతో వాడు భలే చిత్రంగా మారిపోయాడు.

వాడి ఉద్దేశం ఏమిటంటే తను పెళ్ళి చేసుకుంటానని చెప్పగానే, వెంటనే అవాక్ పరంగా భావించిన వేణు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా బహుశా వేనిటీ బ్యాగ్‌లోనుంచి మంగళసూత్రం కూడా తియ్యొచ్చుననీ, పెళ్ళికి వప్పు కుంటుందనీ అనుకున్నాడు.

నిజమే! అప్పారావుకేం తక్కువ?

వాడు స్కూటరేసుకుని తిరుగుతాడు.

వాడికి గవర్న మెంటుద్యోగం వుంది.

వాడికి డబ్బులున్నాయి.

వాడికి ప్రతి సాయంత్రమూ తాగే అలవాటుంది.

తాగనివాడెవడన్నా వున్నాడూ అంటే 'వాడు తాగడం చాతకాని దద్దమ్మ అయినా అయుంటాడు,

లేదా

'నాలుగు మెతుకులు తినడానికే దేవుళ్ళాడుకునేవాడు, వాడికి తాగడానికి డబ్బెక్కడిది' అనే అభిప్రాయంలో వున్నాడు.

నోట్లో నాలుగింగ్లీషు ముక్కలుతప్ప బుర్రలో కొంచెం కూడా సంస్కారం లేదు.

అయినాసరే తను 'ఊ' అంటే తన పాదాలమీద 'తండాలు తండాలు'గా ఆడ పిల్లలూ, వాళ్ళని కన్నతండ్రులూ పడతారని వాడి దృఢనిశ్చయం.

ట్రాజెడీ ఏమిటంటే వాడి నిశ్చయానికి రావటానికి సవాలక్ష ఆధారా లున్నాయి. వాస్తవం కూడా అది.

అయితే వేణు విషయంలో కూడా అలా జరుగుతుందనుకోడంలోనే అసలు ట్రాజెడీ వుంది.

పిల్ల బాగుంటుంది...

పిల్ల చేసే ఉద్యోగమూ బాగుంటుంది. అందువల్ల జీతం మరీ బాగుంటుంది... పదిమందిలోనూ కట్నం తీసుకోని ఆదర్శ పురుషుడిలా పోజ్ కొట్టొచ్చు...

ఇన్ని రకాలుగా ఆలోచించగలిగాడు గాని, వేణూ గురించీ, ఆవిడ స్వభావం, అభిప్రాయాల గురించి గానీ ఏమీ తెలియకుండానే, మహా మూర్ఖంగా ఈ నిర్ణయానికి వచ్చాడు అప్పారావు.

తీరా తన నిర్ణయ పర్యవసానం అలా అయ్యేసరికి గొప్ప అవమానం అయిపోయింది.

అంతే! అప్పట్నుంచి ప్రతివాళ్ళ దగ్గిరా వేణూ గురించి రకరకాల ప్రచారాలు ప్రారంభించాడు.

'తగలడనియ్ వెధవని' అనుకుంది వేణు.

ఇటువంటి నీచులూ, హీనులూ తనని గురించి మంచిదీ అంటే తనేదో తప్పుచేసినట్టే. వీళ్ళు తననెంత తిడితే తనకంత మంచిది... అనుకుంది.

అప్పారావో, అప్పారావులాటి వాళ్లో- వేణు కాలిగోరు తాకడానికి కూడా పనికి



రాదు. సందేహం లేదు.

కానీ, ఇప్పుడు భర్తలుగా వున్న చాలామందికి భర్తలుగా ఉండటానికి ఏ అర్హత లేకుండానే గడిచిపోతోంది.

భార్యల్ని నానా హింసలు పెట్టే పురుషపుంగవులు మనసమాజంలో లక్షల మీదే వున్నారు.

అయితే, వేణు అందర్లాంటి ఆడపిల్ల కాదు. అందుకే తన కాలిగోరు కూడా తాకడానికి అర్హతలేనివాడికి భార్యఅయి, తన శరీరాన్నీ, మనసునీ కొరుక్కుతినడానికి వప్పుకోదు...వప్పుకోలా!

కాని రమ అడిగింది అప్పారావు గురించి కాదు... శేఖరం గురించి.

వేణుకి శేఖరం, అతను మాట్లాడే మాటలు... మాటల వరకూ బాగానే వున్నాయి. ప్రవర్తన గమనించడానికి మాత్రం కుదర్డంలా.

ఒకటి రెండుసార్లుమాత్రం శేఖరం ప్రవర్తన కాస్త కష్టమనిపించింది వేణుకి.

ఓసారి ప్రపంచంతా కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

వేణుకేదో వచ్చింది '[illegible]' అని చెప్పింది. అందరూ తలలూపారు.

వేణు శేఖరం వైపు చూసింది.

అప్పటికే వేణు గుంపులో నుంచి శేఖరాన్ని కాస్త సెపరేట్‌గా చూస్తోంది. కాని, శేఖరం కూడా అందర్లాగే ఉన్నాడు. అప్పుడే వడిస్తున్న ఏదో పత్రిక చేతిలోకి తీసుకొని తిప్పడం మొదలెట్టాడు.

అతను వెళ్ళగానే తనూ వెళ్ళిపోవాలనో, తన వెంట గేటువరకూ రావాలనో వేణుకు లేదు గానీ,

అందర్లా గాక, తను వెళ్తోంటే అతను కాస్త అటెన్షన్ పే చెయ్యాలనిపించింది.





అయినా, ఆవిడ పెద్దగా ఫీల్ అవలా.

చాలా సందర్భాల్లో మనుషులు రకరకాల మూడ్స్ వల్ల సహజంగా గాక, వేరే రకంగా కూడా ప్రవర్తిస్తారు.

మరోసారి వేణుకి కాస్త గట్టి దెబ్బే తగిలింది.

ఒక ఆదివారం అతన్ని తన రూంకి ఉదయాన్నే వచ్చెయ్యమంది.

"అలాగే" అన్నాడతను.

"అలాగే అంటే కాదు. తొమ్మిదికల్లా రూంలో వుండాలి. ఇద్దరం కల్సి వంట చేసుకుని భోంచేద్దాం" అంది నవ్వుతూ.

శేఖరం కూడా నవ్వుతూ "నాకు వంటరాదే!" అన్నాడు.

"ఈ ఊరొచ్చినకొత్తలోనాకూరాదు. నేర్చుకుంటే అదే వస్తుంది. నేన్నేర్పుతాను రండి" అంది.

"సరే" అన్నాడు.

తెల్లారిందగ్గర్నుంచీ శేఖరం కోసం చూస్తున్న వేణు రూంకి, అనుకోకుండా ఆవిడ ఆఫీసు కొలీగ్స్ వచ్చి గండిపేట వెళ్దాం రమ్మంటూ కూర్చున్నారు. వాళ్ళు ఎప్పుడూ తనసంత బలవంతం చెయ్యలేదు. అందర్లోనూ కలవదని తన మీద అప్పటికే అభియోగం వుంది. మామూలుగా అయితే వెళ్ళాలి. కాని శేఖరాన్ని రమ్మని చెప్పింది కనుక– ముందు అనుకోలేదు కాబట్టి, ఎవరో గెస్టులొస్తున్నారు కాబట్టి రావడం కుదరదని వాళ్ళని పంపేసి అలానే ఎదురు చూస్తూ కూర్చుంది వేణు.

మధ్యాహ్నం రెండింటికి తీరిగ్గావచ్చాడు శేఖరం.

ఆశ్చర్యం ఏమిటంటే అతను ఏమీ కారణం చెప్పకపోవడం. వేణు ఆ షాక్ నుంచి తేరుకుని అడిగింది– "మీగ్గుర్తుందా? తొమ్మిదికల్లా వస్తానన్నారు. తొమ్మిది

నించి నేనెంత ఎదురు చూశానో? మీకేమన్నా యాక్సిడెంటయిందేమో? లేపోతే అకస్మాత్తుగా ఏమన్నా అనారోగ్యం చేసిందా? ... అని ఎంత వర్రీ అవుతున్నానో? మరి మీరేం చెప్పరేం కారణం" అంది కాస్త ఆవేశంగా, మరి కాస్త నిష్ఠూరంగా.

"ఎందుకండీ అంత ఫైర్ అవుతారు? నాకేమీ కాలా! ఎవరో ఫ్రెండ్స్ బలవంతం చేస్తే పాతాళభైరవి మార్నింగ్‌షో కెళ్లొస్తున్నా" అన్నాడు తాపీగా.

"ఆ పాతాళభైరవికే గదా మనిద్దరం వెళ్దామనుకున్నది" అంది వేణు.

"అనుకుంటే ఇంకెవ్వరితోనూ వెళ్లకూడదా?" అన్నాడు శేఖరం.

"వెళ్లొచ్చులెండి తప్పక పోతే. కాని... నేనిక్కడ మీకోసం ఎదురుచూస్తానని తెలుసుగా"

"అందుకేగా ఇపుడు వచ్చింది! వాళ్లు బాగా బలవంతం చేశారు..."

"అయ్యో... ఇదేం మనిషి!" అని తెగ ఆశ్చర్యపోయింది వేణు. లోలోన చాలా ఆశాభంగమూ పొందింది.

శేఖరాన్ని తల్చుకుంటూంటే వేణుకి రెండు రకాల ఆలోచన్లు.

అతను మంచివాడిలా కన్పడ్తూ వున్నాడు. సరే... అందమూ, ఉద్యోగమూ ఉన్నవే – వాటిని తానంతగా పట్టించుకోకపోయినా!

కాస్త సాహిత్య జ్ఞానమూ వున్నట్టుంది. మంచి చెడ్డ మాట్లాడగలడు.

ఒంటరిగా కూర్చుని అలా ఆలోచించుకుంటూ వుంటే చాలా కనిపిస్తున్నాయి. తనకిష్టమైనవాళ్లని తనూ ఇష్టపడినట్లు కూడా ఉంటున్నాడు. కాని అలా ఉండటం మాత్రమే చాలదు. వాళ్లని తనెందుకు ఇష్టపడ్తోందో, అందుకే అతనూ ఇష్టపడ్తున్నాడా? అలా ప్రవర్తిస్తున్నాడా? తనకేది ఇష్టమో అది అతని ప్రవర్తనలో వుందా? – అనేది ముఖ్యం అనుకుంది వేణు.

ఏదీ?

అతని ప్రవర్తన పెద్దగా తెలవడంలా వేణుకి! తెల్సుకుందామంటే కుదరదు. అతనొస్తాడు ఎప్పుడో ... దాదాపు ప్రతిసారీ వెంట ఎవరో ఒకరుంటారు. నలుగురితో కల్సి మాట్లాడేప్పుడు ఎటువంటి మనిషీ బైటపడటం కాస్త కష్టమే! ముఖ్యమైనవి వదిలేసి దానిమీదా, దీనిమీదా మాట్లాడ్తారు అందరూ! ఇతను కట్నం తీసుకోడు. కట్నం తీసుకోడం నీచం అనే అభిప్రాయం కూడా వున్నట్టువుంది.

అంతా బాగానేవుందని సరిపెట్టుకుంటే ముందుముందు ఏ విషయాలు తనకీ అతనికీ అంతరాల్ని సృష్టిస్తాయోనని ఆలోచిస్తోంది వేణు.



## 2

వెంకటప్పయ్య శేఖరాన్ని చూడగానే ఆశ్చర్యంగా కళ్లు పెద్దవిచేసి నడవడం ఆపేసి, అంతటితో ఆగకుండా – "మీరు శేఖరంగారు కదూ?" అన్నాడు.

"అవును. మీరూ...?"

"నేనూ... మా అన్నయ్యకి తమ్ముణ్ని ... అదే మీ ఫ్రెండు



వెంకటేశ్వర్రావు ఎఫ్.సీ. అయ్.లో పని..."

"ఆ... నువ్వటోయ్! నీ పేరు శేషయ్య కదూ...?"

"కాదండీ ... శేషయ్య కాదు–వెంకటప్పయ్య"

"ఆ ... అదే! ఎక్కడికీ? ఏంచేస్తున్నావూ? ... ఏంటి సంగతీ?" అని క్షేమ సమాచారాల్లోకి దిగాడు శేఖరం.

వెంకటప్పయ్యకి శేఖరాన్ని కల్సుకోవడం చాలా సంతోషాన్ని కల్గించింది. అతను తన అన్నకి స్వయానా స్నేహితుడు. ఏదో మామూలు వేలు విడిచిన స్నేహితుడు కూడా కాదు. స్వంత స్నేహితుడు. అన్నకి అంత స్నేహితుడంటే తమ్ముడికీ స్నేహితుడే అవ్వచ్చుగదా!

"సరే! నీకేం పని లేనట్టుంది. నేనో ఫ్రెండ్ దగ్గరకెళ్తున్నా. నువ్వూరా! కాసేపు కలిసి గడపొచ్చుగదా" అన్నాడు శేఖరం.

"మీకేం ఇబ్బంది..."

"నాకేం ఇబ్బంది? నేనయితే నిన్ను ఎత్తుకోను. నువ్వ నడుస్తావుగదా!" అని నవ్వి, "వేణూ అని ఓ ఫ్రెండుంది

కెళ్తున్నా. నీకెప్పుడు కావాలంటే అప్పుడు వెళ్ళిపోదుగానిలే...రా" అని వెంకటప్ప య్యని తీసుకుని వేణు రూంకొచ్చాడు శేఖరం.

"వేణూ! ఇతను వెంకటప్పయ్యని నా క్లాస్‌మేట్, రూమ్మేట్, మరియూ స్నేహితుడితమ్ముడు. బాలానగర్‌లో..." అని ఆగాడు శేఖరం.

"ఖానూ కన్‌స్ట్రిక్షన్స్" అని అందిచ్చాడు వెంకటప్పయ్య.

"ఆ... దాన్లో క్లర్కుగా చేస్తు న్నాడు" అని వెంకటప్పయ్య వంక తిరిగి-

"ఈవిడేనోయ్... నేను చెప్పానే వేణూ!"

వెంకటప్పయ్య మొహమాటంగా నవ్వాడు.

వేణు కూడా చిన్నగా నవ్వింది.

'వెంకటప్పయ్య' అనే పేరుగల వ్యక్తికి కనీసం డెబ్బయిఏళ్ళన్నా వుండా లనిపిస్తుంది. కాని పాపం.... ఈయనకి పాతిక ఏళ్ళుంటాయేమో. ఆ పేరు వాళ్ళ తాతగారిది. వాళ్ళ తాతగారికేమో వాళ్ళ తాతగారిది పెట్టారట! ఆయనది కూడా ఆయన తాతగారిదే. ఈ వెంకటప్పయ్య అనే పేరు వింటే మనంగనక బయలుదేరి వెనక్కివెళితే 'ఆ' మొదటాయన ఏ రాతి గదో పట్టుకుని ఏ కీకారణ్యంలోనో వేటా డుతూవుండివుంటాడు. ఇలాంటి పేర్లు మనకింకా చాలానే వున్నాయనుకోండి.

వెంకటప్పయ్య కాస్త సంకోచంగా అన్నాడు- "వేణు అనే పేరు నాకెంత ఇష్టమో!"

వేణు నవ్వుతూ "నాక్కూడా నా పేరే ఇష్టం. మీరేం అనుకోకండిగానీ మీ పేరంటే నాకంత ఇష్టం లేదు కూడా" అంది.

"అయితే మనం రెండు విషయాల్లో ఏకాభిప్రాయానికొచ్చాం" అన్నాడు వెంకటప్పయ్య నవ్వుతూ.

"అయితే నేనన్నది 'పేరు'ను గురించే గాని ఆ పేరున్న మనుషులగురించి కాదు.

మా ఫ్రెండుకో తాతున్నాడు. వెంక టప్పయ్యతాత. చాలా మంచాడు. మా అందరికీ ఆయనంటే చాలా ఇష్టం కూడా" అంది.

"మా తాత పేరు కూడా వెంక టప్పయ్య తాతే!" అన్నాడు వెంక టప్పయ్య.

వేణు, శేఖరం పెద్దగా నవ్వారు.

వెంకటప్పయ్యక్కాస్త కొత్తదనం తాలూకు బెరుకు తగ్గింది.

కొంచెమాగి వేణు "భోంచేద్దామా?" అంది.

"నేను చెయ్యనండీ" అన్నాడు వెంక టప్పయ్య.

"ఏ...మానేశారా?" అంది నవ్వుతూ వేణు.

వెంకటప్పయ్య కూడా నవ్వుతూ "అలా ఏంకాదుగానీ 'అనుకోని అతిథి' పాత్ర పోషించడం నాకంత ఇష్టం వుండదు" అన్నాడు.

"అతిథిగా వద్దు...ఫ్రెండుగా భోంచె య్యండి" అని ప్లేట్లు సర్దుతూ అంది వేణు.

"ఫర్లేదులే... వేణు ఎలానూ కాస్త ఎక్కువే వండుతుంది. ముగ్గురం కాస్త కాస్త తక్కువ తిందాం. రా...కూర్చో" అని చెయ్యిపట్టుకు లాగాడు శేఖరం-తను కూర్చుంటూ.

"మీరు 'కోశిష్' చూశారా?" అడిగింది వేణు.





వెంకటప్పయ్య ఫోంచెయ్యటం ఆపాడు. 'కోశిష్' సినిమాలోని విషాదం గుర్తొచ్చి. ఓక్కమొహంపెట్టి "చూశానండీ...రెండుసార్లు" అని అంతలోనే "అద్భుతంగా ఉందండీ! మీరు చూశారా?" అన్నాడు.

"లేదు. నేనో పత్రికలో రివ్యూ చదివా! అప్పట్నుంచి చూడాలని ఉంది గానీ . ఆమధ్య ఊరెళ్ళడంమూలాన కుదర్లా! ఇవ్వాళ చూడాలని...ఏం శేఖరం...ఇవ్వాళ వెళ్దామా ?" అంది వేణు.

"ఊ..." అని అక్కవంక తలెగ రేశాడు శేఖరం.

"అక్క రాదులే. ఆవిడకి హిందీ సినిమాలంటే ఎలర్జీ. హిందీ వాళ్ళమీద కోపం తెలుగు మాట్లాడరని" అంది వేణు.

"నీ ఇష్టం" అన్నాడు శేఖరం.

"నా ఇష్టం సర్లే, నీ ఇష్టం ఏంటని?"

"నీ ఇష్టమే నా ఇష్టమని"

"అబ్బో! బడాయి" అంది వేణు.

"చట్నీ బాగుందండీ!" అన్నాడు వెంకటప్పయ్య.

నవ్వింది. వేణు.

వేణు నవ్వు చూసి శేఖరంకూడా కాస్త నవ్వుతూనే "ఎందుకు ? ఏమయింది ?", అన్నాడు.

వాళ్ళిద్దరి వాలకం చూసి "నేనేం అనరాని మాటన్నానండీ" అని ఓసంగా అడిగాడు వెంకటప్పయ్య.

నవ్వి నవ్వి తమాయించుకుని "చట్నీ బాగుంది కదూ !" అని మళ్ళీ నవ్వడం మొదలెట్టింది వేణు.

"ఏం...బాగాలేదా? నాకయితే చాలా బాగుంది" అని ఖచ్చితంగా చెప్పాడు వెంకటప్పయ్య.

వేణు నవ్వుతూనే "సరే...అయితేఅదేం చట్నీయో చెప్పండి. ఒప్పుకుంటా" అంది.

"అమ్మా..చంపేశారే! నేను ఆవకాయ, గోంగూర, నిమ్మకాయ తప్ప ఇంకే పచ్చళ్లూ గుర్తట్టలేను. అల్లప్పచ్చడీ, టమాటా పచ్చడీ ఒక రకంగానే వున్నట్టుంటాయి. ఇక తొక్కుడు పచ్చళ్ళయితే మరీ అన్యాయం. అన్నీ ఒక రకంగానే వున్నట్టుంటాయి. ఏది ఏమిటో, ఎందుకు బాగుందో చెప్పలేను గానీ, బాగుందా లేదా అనేది మాత్రం చెప్పగలను" అని నవ్వాడు వెంకటప్పయ్య.

వెంకటప్పయ్య మాట్లాడుతున్నంత సేపు తోసుకొస్తున్న నవ్వుని అదుపులో పెట్టుకోలేక నవ్వుతూనేవున్న వేణు కాసేపటికి తమాయించుకుని "అమ్మ... మీరింక అన్నంతినడం పూర్తయ్యేవరకూ మాట్లాడకండి" అంది.

"విషయం తెలవక సస్పెన్స్ భరించ లేకపోతున్నానే!" అన్నాడు వెంకటప్పయ్య.

వేణు నవ్వాపుకుంటూ పళ్లు బిగించి, "ఏమిటంటే... మీరు మెచ్చుకుంటున్న చట్నీ చట్నీ కాదు–అది కూర" అంది.

శేఖరం పెద్దగా నవ్వాడు.

"అవునా?" అని వెంకటప్పయ్య కూడా నవ్వుతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

అన్నం పూర్తయ్యేవరకూ వేణు అప్పుడప్పుడూ నవ్వుతూనే వుంది.

"ఈ విషయం మా అమ్మకి తెలిస్తే ఎంత తిడ్తుందో నన్ను..." అని వెంకటప్పయ్య బాధపడ్డాడు. పచ్చళ్ళలో రకాలు సంగతలా ఉంచి, పచ్చడో, కూరో కూడా తెలియని తన తెలివితక్కువ

చతుర ... లిలి

తనానికి తననే తిట్టుకుంటూ "ఎట్లా బతుకుతానో ఏమో! వట్టి తెలివితక్కువ మొద్దుని- అన్నాడు పైకే.

మళ్ళీ నవ్వులు.

రోజుకన్నా ఆలస్యంగా అన్నాలు అయ్యాయి.

వేణు అంది "మీకేమన్నా పనుందా?" అని వెంకటప్పయ్యతో.

"పనా? నాకా?'' అని ఆశ్చర్యపోయాడు.

వేణు నవ్వుతూ ''కోశిష్ మూడుసార్లు చూటొచ్చా?'' అంది.

"మూడుసార్లేం? ముప్పై సార్లు చూడచ్చు. కాని డబ్బుల్లేవే" అన్నాడు వెంకటప్పయ్య.

"మిగతా ఇరవయి ఏడుసార్లూ ఎక్కడన్నా చూసుకోండిగానీ, ఈసారి మీరు కూడా మాతో వస్తున్నారు" అంది వేణు.

"చాలా సంతోషంగా" అన్నాడు వెంకటప్పయ్య.

"సంతోషమెందుకగ్గాదు? వేరే వాళ్ల డబ్బుల్తో సినిమాకెళ్లడం అంటే అందరికీ అన్నివేళలా సంతోషమే" నవ్వుతూ అన్నాడు శేఖరం.

''కాని ... ఎవరి వెంటబడితేవారితో వెళ్లడం మాత్రం సంతోషం కాదు..." అని సవరించాడు వెంకటప్పయ్య.

"అలాగే, ఏ సినిమాకెబడితే ఆ సినిమాకి వెళ్ళడం కూడా సంతోషం కాదు'' అంది వేణు.

ముగ్గురూ నవ్వుకున్నారు.

వేణు వీళ్ళిద్దర్నీ చూసి "మీరిద్దరూ అయిదు నిముషాలు ఆ వరండాలోకి..." అని ఆగింది.

ఇద్దరూ వరండాలోకివచ్చి కూర్చున్నారు. ఎండ మండిపోతోంది బైట. వరండాపక్కనించి సన్నజాజి పైకి పాకుతోంది. 'నన్నిప్పుడేంచూస్తారుగాని సాయంత్రం చూడండి' అని పచ్చగా నవ్వుతోంది.

వేణు ఉంటున్నది ఒక్క గదిలో. దానికే నూటయాభై రూపాయల అద్దె. ముందు చిన్న వరండా. ఆ వరండాని ఇంటివాళ్లతో కలిసి వాడుకోవాలి. అంట్లూ అవీ బాత్‌రూం దగ్గర 'మోరీ'లో తోముకోవాలి. ఆఫీసు హడావుడి, సాయంత్రాలు ఏమన్నా చదూకోడం... అన్నిటికీ ఇబ్బందని ఓ పనిపిల్లని పెట్టుకుంది వేణు. పిల్లపేరు లక్ష్మి. 11-12 ఏళ్లుంటాయి. లక్ష్మికుంటుందని కాస్త ఎక్కువగా వండుతుంది. తనతో పాటు టీ ఇస్తుంది. ఎప్పుడన్నా తనతోపాటు షికారుకో, సినిమాకో తీసుకెళ్తుంది. లక్ష్మి మొదట్లో వేణుని 'అమ్మా' అనో 'దొరసాని' అనో పిలవాలని చూసేది. వేణు రోజూ ఆ పిల్లని సరిచేసి 'అక్కా' అని పిలవడం అలవాటు చేసింది. లక్ష్మికి వేణు అంటే ప్రాణం.

వరండాలోకి వీళ్ళిద్దరూ వచ్చేసరికి అప్పటివరకూ వరండాలో వున్న లక్ష్మి లోనికెళ్ళి ప్లేట్లు బైటికి తీసుకొచ్చింది. ఓ ప్లేటులోంచి కొంచెం నీళ్ళు వలికి వీళ్ళిద్దరి దగ్గరా పడ్డాయ్. తన పాంటు ఎక్కడ పాడవుతుందోనని ఎగిరి గంతేసి పక్కకు తప్పుకున్నాడు శేఖరం.

"ఏయ్... కళ్లు కనిపించటంలా? జాగ్రత్తగా తీసికెళ్లడం తెలవదూ?" అన్నాడు కళ్లు పెద్దవిచేసి, ముఖానికి గంటుపెట్టుకుని.

వెంకటప్పయ్య "ఊర్కోండి ... ఊర్కోండి. పొరపాటుగా పడ్డాయిలెండి" అన్నాడు సర్దుబాటు చేస్తూ.

లక్ష్మి బిక్కమొహంతో సగం చచ్చిపోయినట్టయిపోయింది.

"నువ్వెళ్ళమ్మాయ్..నీ పనిచూసుకో" అని వెంకటప్పయ్య అనేవరకూ లక్ష్మికి కదలాలని కూడా తోచలా.

శేఖరం కసురుకోడం లోన్నుంచి విని గబగబా వచ్చి "ఏమైంది?" అంది వేణు.

"ఆ ... ఏంలేదులెండి" అని ఆ వాతావరణాన్ని మార్చడానికి తాపత్రయ పడిపోయాడు వెంకటప్పయ్య.

లక్ష్మి అంట్లు తీసుకెళ్ళి బాత్‌రూం దగ్గర వేసి, గబగబా వెనక్కి వచ్చింది. "అక్కా!అంటుల్లో నీళ్లుపొరపాటుగా..." అని నేలమీది నీళ్ళని చూపించింది.

వేణు "అంతేనా! ఫర్లేదులే. నువ్వెళ్ళి అది కడిగెయ్" అంది

లక్ష్మి లోనకెళ్ళి నేలని తుడవడానికి బట్ట తీసుకొచ్చింది. వేణు అది తీసుకొని "నువ్వుపో. ఆ పని చూడు" అంది.

లక్ష్మి వెళ్ళింది.

వెంకటప్పయ్య "ముందు మీరు తయారవ్వండి. ఇది నేను తుడిచేస్తా" అన్నాడు.

"భలేవారే! ఇదెంతపని ... నలుగురు కల్సి చెయ్యాలా? అయ్యే పోయింది చూడండి" అని ఆ బట్ట తీసి బైట తాడుమీద ఆరేసి బాత్‌రూంలోకెళ్ళి కాళ్లు, చేతులూ, మొఖం కడుక్కుని వచ్చింది వేణు.

"ఇప్పుడే అయిదు నిముషాల్లో వెళ్ళిపోదాం" అని బట్టలు మార్చుకోడానికి గదిలోకెళ్ళింది.

వేణుకి మనసులో కాస్త బాధగా వుంది. లక్ష్మిని శేఖరం అలా కసరడం. పొరపాట్లు మనుషులకు చాలా సహజం. పైగా చిన్నపిల్ల. ఆడుతూ పాడుతూ తిరగాల్సిన వయసులో, రంగు రంగుల బట్టలేసుకుని స్నేహితుల్తో కబుర్లు చెప్పుకుంటూ స్కూలు కెళ్లవలసిన వయసులో లక్ష్మిలాంటి పిల్లలు నాలుగు మెతుకుల కోసం, ఇలా ఇళ్లల్లో అంట్లు కడుగుతూ, బట్టలుతుకుతూ, గడపవల్సి రావడమే పెద్ద అన్యాయంగా కన్పడ్తుంది వేణుకి. అందుకే లక్ష్మి ఏంచేసినా ఏమీ అనదు వేణు. మొన్నొక రోజు వేణు ఎంతో ఇష్టపడి కొని తెచ్చుకున్న కప్పు పగలగొట్టింది లక్ష్మి.

లక్ష్మి ప్రాణాలు పైనే పోయాయ్. ఈ దెబ్బతో తనపని పోయినట్టేననుకుంది. ఊపిరి ఆగిపోయినంత ఇది అయిపోయింది.

వేణుకి మాత్రం కప్పు పగిలినందుకు మనసు చివుక్కుమన్నా లక్ష్మి వంక చూసేసరికి నవ్వొచ్చింది.

"ఏంటే పిచ్చిమొహమా! కాస్త గాలి పీల్చుకో" అని నవ్వింది.

"అక్కా..." అంది దీనంగా లక్ష్మి.

"పోనియ్...ఏం చేస్తాం. ఈ బాధ ముందే వుండాల్సింది. ఓటి చేతులూ నువ్వూను" అంది వేణు- ఆ కప్పు ముక్కలు ఒక్కోటి చేతుల్లోకి ఎత్తుతూ.

అందుకే లక్ష్మికి వేణు అంటే అంత ప్రేమ. ఈ ఇంట్లో ప్రతి వస్తువూ అమూల్యమైనదే అక్కలాగా అనుకుంటుంది లక్ష్మి.

లక్ష్మి మనసులో ఏముందో వేణుకి లక్ష్మి చూపుల్లోనే అర్థమవుతుంది. అందుకే శేఖరం లక్ష్మినలా అనడం నచ్చలా! ఒక్కక్షణం సినిమా కేన్సిల్ చేద్దామా అని కూడా అన్పించి 'పోనీ' అనుకుని గబగబా బట్టలు మార్చుకుని, తల పైపైన దువ్వుకుని బైటికొచ్చింది.




వరండాలో కొచ్చి 'ఒక్క నిమిషం' అని లక్ష్మి దగ్గరకెళ్ళింది వేణు.

"లక్ష్మీ...ఆయనలా అన్నాడని బాధ పడమాక. ఆ నీళ్ళు బట్టల మీద పడ్డాయను కుని కంగారుపడ్డట్టున్నాడు. మేం సినిమాకెళ్తున్నాం. నువ్వు ఇక్కడే వుంటావుగా. అక్కతో చెప్పు మేం వచ్చే సరికి ఏడవుతుందని" అని టైంచూసింది. రెండవుతోంది.

"రెండవుతోందే! మనకి పిక్చర్ అందు తుందా?" అంటూ గబగబా వచ్చింది.

"ఆ...ఏం ఫర్లా. మూడూ మూడు న్నరగ్గానీ మొదలవ్వదు" అన్నాడు వెంకటప్పయ్య.

ముగ్గురూ బజార్లోకొచ్చారు.

"ఎలా వెళ్దాం?" అన్నాడు శేఖరం.

"ముగ్గురమున్నాంగా. బస్సుకైనా దాదాపు అంతే అవుతుంది కనుక ఆటోలో పోదాం" అంది వేణు.

"ఆటోనా?" అన్నాడు వెంకటప్పయ్య.

"నువ్వు డబ్బులివ్వొద్దు లేవోయ్" నవ్వుతూ అన్నాడు శేఖరం.

"సర్లే. నా దగ్గరెక్కడున్నాయ్‌గానీ ఇవ్వడానికీ..." అని నసిగాడు వెంక టప్పయ్య.

"పెద్ద ఎక్కువవ్వదు లెండి. వెళ్ళి పోదాం" అంది వేణు నెమ్మదిగా.

ఆటో వచ్చింది.

ఎక్కబోతూ ఆగాడు వెంకటప్పయ్య. వేణు ఎక్కింది. శేఖరం ఎక్కాడు. వెంక టప్పయ్య కూడా.

వెంకటప్పయ్య ఏ సినిమాకెళ్ళినా అన్నిటికన్నా చివరిక్లాసుకెళ్తాడు.

వీళ్ళు వెళ్ళడం వెళ్ళడమే అన్నిటికన్నా పెద్దక్లాసు బుకింగ్ దగ్గరకెళ్ళి నిలబడ్డారు.

వెంకటప్పయ్యకి మతిపోయినంత పనయ్యింది. నాల్రూపాయలదెబ్బయయిదు పైసల టిక్కెట్టు.... ఒక్కొక్కరికి! తనైతే ఆ డబ్బుల్తో కనీసం నాలుగు సినిమాలు చూసేవాడు.

ఈమాటే ఏమాత్రం సంకోచం లేకుండా అనేశాడు:

శేఖరం కసురుకుని "ఊర్కోవాయ్! ఎవరన్నా వింటారు" అన్నాడు.

"వింటే ఏమవుతుందీ? అదేమన్నా తప్పు విషయమా?" అంది వేణు. వెంక టప్పయ్యవేపుతిరిగి "కాని కళ్ళు పాడవుతా యనుకుంటానండీ" అంది.

"ఆ క్లాసులో కూచున్నవాళ్ళందరి కళ్ళూ పాడయ్యాయా? నేనెప్పుడూ అక్క ణ్నించే. నాకేం పాడవలేదే...కాకపోతే మెడలుకాస్త నెప్పెడతాయి – మరీ ముందు సీటయితే... మొన్నొకరోజు 'శ్రీ ఫోర్ ట్వంటీ' చూశా. రాజ్‌కపూర్ ఎంత బారుగాకనపడ్డాడో...నా సీటు ఓ చివర" అని నవ్వాడు.

'హైక్లాసుకొచ్చి ఈ లోక్లాసు గొడ వేంటోయ్' అన్నట్టు చూశాడు శేఖరం.

ఇంకా గేట్లు తెరవలా. అందరూ రక రకాలుగా అలంకరించుకుని వచ్చారు సినిమా చూడటానికి.

ఒకావిడ–అరవై ఏళ్ళుంటాయి. శరీరం పండి వడిలిపోయింది. కాని జుట్టుమాత్రం రంగు వెయ్యడంవల్ల నల్లగావుంది. ఎర్రగా లిప్‌స్టిక్ వేసుకుంది. ఎర్రటి లంగా కనపడేంత పల్చటి చీర కట్టు కుంది. నల్ల కళ్ళజోడు పెట్టుకుంది. ఆవిడ పక్కనే క్రాపట్టుకుని తెల్లటి జుట్టుతో, షర్టూ పాంటుతో వంగినట్టు నిలబడివున్నాడు ముసలాయన.

వేణు వంక చూశాడు వెంకటప్పయ్య వేణు ఓ చేతికి వాచీ వుంది. గాజుల్లేవు.



మెళ్లో ఏమీలేవు. చిన్న బొట్టుమాత్రం వుంది. నేత చీర. ఎంత సింపుల్‌గా, ఎంత శుభ్రంగా, ఎంత చక్కగా ఉండొచ్చో అంత చక్కగా వుంది.

వేణు అతని చూపులు గమనించి "ఏమిటి?" అంది.

సిగ్గుపడ్డాడు వెంకటప్పయ్య. 'ఏం లేద'ని తలూపాడు. సినిమా పోష్టర్లవంక చూపు తిప్పాడు. రెండు మూడు రోజుల్లో 'కోశిష్' వెళ్ళిపోయి ఒక మహత్తర చిత్రం



రాబోతోందని థియేటర్‌వాళ్ళు రాసి పోష్టర్లు అంటించారు. వాటిల్లో మనుషులు మన మానవుల్లా లేరు. ఆ మొఖాల్లో జీవంలేదు. అసలవి మనుషుల మొఖాల్లానే లేవు. జీబురు జుట్లల్లో, వికార చేష్టల్తో, బట్టల్ని పైకి లేపుకుంటూ ఏమి టేమిటోగా ఇవ్వాళ నడుస్తున్న సినిమా ల్లాగా వున్నారు.

వెంకటప్పయ్య ముఖంవంకే చూస్తున్న వేణుకి నవ్వొచ్చింది.

"అబ్బ! ఇంకెప్పుడు తెరుస్తారో ఈ గేట్లు?" వాచీ చూసుకుంటూ విసుగ్గా అన్నాడు శేఖరం.

దీనంగా వున్న ముసలామె వచ్చి దీనాతిదీనంగా చెయ్యి చాపింది వారి

ముందు! పండిపోయిన తల చిన్నగా ఊగుతోంది. నడుం సగం వంగి పోయింది. ఓ చేతిలో కర్ర, దీనమైన చూపులు ... ఆశగా చూస్తూ చెయ్యి చాపింది.

వేణు హృదయం బాధతో ముడుచుకు పోయింది. ఇంత వయసులో ఓ మనిషి మరో మనిషి దగ్గరకు వెళ్ళి చేయిచాచి అడుక్కోవల్సి రావడం, అందరి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడవల్సి రావడం–వేణు మనసు ఆర్ద్రతతో నిండి పోయింది. ఆమె అనుకోకుండానే వెంకటప్పయ్య వంక చూసింది.

అంతవరకు సరదాగా ఉన్న అతని మోము ఒక్కసారిగా ఏదో నేరంచేసిన వాడి మోములా అయిపోయింది.

ఇంతలో "అవతలకుపో" చిరాగ్గా అన్నాడు శేఖరం.

కంగారుగా "వుండు...వుండు" అని జేబులో చెయ్యిపెట్టాడు వెంకటప్పయ్య.

"ఊ...సర్లేవోయ్! నువ్వొక దాన కర్ణుడివి బయలుదేరావు" అని, ఆమెతో– "నీగ్గాదు చెప్పేది ... అవతలకుపో" అన్నాడుశేఖరం.

వేణుకి శేఖరం ప్రవర్తన చాలా ఛండాలంగా అన్పించింది.

త్వరగా తన బేగ్‌లోంచి తీసి ఆ అవ్వకి ఓ రూపాయిచ్చింది వేణు. తన కన్నా ఎంతో పెద్దదయిన, ఎన్నో అనుభవాలున్న ఆ ముసలామెకి తను డబ్బులివ్వాల్సిరావటం, తన దయతో ఆ మనిషి కడుపు నిండాల్సిరావడం వేణుకి చాలా సిగ్గన్పించింది.

వెంకటప్పయ్య ఇరవై పైసలిచ్చాడు.

శేఖరం "ఇచ్చావుగా.... వెళ్లు" అన్నాడు.

తన అన్న స్నేహితుడి మీద వెంకటప్పయ్యకి కాస్త కోపం వచ్చింది. కాని పెద్దాడు...

వేణు ఏదో మాట్లాడబోతున్నంతలో సినిమాహాల్ తలుపులు తెరిచారు.

శేఖరం వడివడిగా నడిచాడు.

ఇద్దరూ అనుసరించారు.

'కోశిష్' సినిమా అంటే వెంకటప్పయ్యకి చాలా ఇష్టం.

చెవుడూ, మూగ వున్న ఓ అమ్మాయి, అబ్బాయికి పరిచయం అవుతుంది. ఒకర్నొకరు అర్థంచేసుకుంటారు. పెళ్ళి చేసుకుంటారు. నోరువిప్పి మాట్లాడుకోకపోయినా వాళ్లు పంచుకోని ఫీలింగ్ లేదు. ఏమీ, ఎవర్నీ వినలేకపోయినా, వాళ్ళిద్దరూ మంచి అవగాహనతో తమ జీవితాల్ని ఆనందమయం చేసుకుంటారు. వాళ్లకో బాబు పుడ్తాడు. ఆ తల్లిదండ్రులు తమ పిల్లాడు కూడా తమలానే చెవిటివాడుగానూ, మూగవాడిగానూ అవుతాడేమోనని చాలా మానసిక వేదనకి గురవుతారు. ఆ బాబు చెవిటివాడు కాదని తెల్సుకోడానికి చేసిన వారి ప్రయత్నాలు, కాదని తెల్సుకున్న తర్వాత వాళ్ల సంతోషం...

అంగవికలత్వాన్నీ, మూగవారినీ, చెవిటివారినీ, అంధుల్నీ, వారికికమరొక జీవితం లేనట్టు, వారికి సమస్యల్లేనట్టు చూస్తూ బఫూన్లలాగా చిత్రిస్తూ వారి ప్రవర్తనల్ని వికార చేష్టలుగా చూపించి కుళ్లు హాస్యాన్ని విరజిమ్మే వెండితెరకి 'కోశిష్' సినిమా ఓవరం.

వాళ్లకున్న ప్రత్యేకమైన ఇబ్బందుల్నీ వాటిని ఎదుర్కోడానికి మనుషులుగా వాళ్లుచేసిన ప్రయత్నాల్నీ, వాళ్ల ఆశల్నీ, ఆశయాల్నీ ఎంత చక్కగా,

హృదయాలకి హత్తుకునేట్టు తీశాడు గుల్జార్‌సాబ్.

ముఖ్యంగా ఆ చివరి సీను...

వీళ్ళిద్దరూ పెద్దవాళ్ళవుతారు. కొడుకు పెళ్ళీడువాడవుతాడు. అతనికి ఏ లోపమూ లేదు. చక్కగా చదువుకుంటున్నాడు. అతని పైఅధికారి తన కూతుర్ని ఈ కుర్రాడికి చేసుకోమని అడుగుతాడు.

తమని గేలిచెయ్యడానికే, అవమానించడానికే ఎంతో ధనవంతుడూ, హోదాగలవాడూ అయిన ఆఅధికారి అలా అంటున్నాడని ఈ తల్లీదండ్రీ భావిస్తారు.

కానీ ఆయన నిజంగానే అంటున్నాడు. తన కూతుర్ని వీరికి చూపిస్తాడు. పిల్ల అందంగా వుంటుంది. చాలా నెమ్మదైన పిల్లలా కన్పడుతుంది.

ఆయన చివరికో మాట చెప్తాడు. "మీరిద్దరూ చాలా గొప్ప మనుషులు. ఎన్నో కష్టాలూ, కన్నీళ్లూ, అన్యాయాలూ, అవమానాలూ చవిచూశారు. అవన్నీ మీ ఇరువురు మూగవాళ్ళవడం మూలంగా, చెవిటివాళ్ళవడం మూలంగానే. అయినా ఎంతో ఓర్పుతో, నేర్పుతో మీ ఇరువురూ ఉన్నదాన్లోనే సుఖంగా గడపడమేగాక మీ అబ్బాయిని ఇంతవాడిగా చేసుకున్నారు.

మీరయితేనే నా పిల్లని సరిగ్గా అర్థం చేసుకోగల్గుతారు. మీ పిల్లవాడైతేనే నా కుమార్తెని సుఖపెట్టగల్గుతాడు. నా కుమార్తె కూడా మీలానే చెవిటి, మూగ" అంటాడు.

అప్పుడు....అప్పుడు.... ఈ తల్లీ తండ్రుల హృదయాలు పట్టేస్తాయ్.

ఆ తండ్రి ఆ పిల్లతో తన మూగ భాషలో "అమ్మా ! నీకు మేమున్నాం!" అని ధైర్యాన్నిస్తాడు.

సినిమా అంతా ఒకెత్తూ-

ఈ సీను ఒక్కటి ఒకెత్తూనూ.

వెంకటప్పయ్యకి అప్పట్నించీ ఆ తల్లిదండ్రుల పాత్ర వేసిన జయబాధురీ, సంజీవ్‌కుమార్‌లంటే ఎంతిష్టమో! వాళ్లు కూడా అంత అద్భుతంగా నటించారు.

ఇతను మరో లోకంలోకెళ్ళిపోడాన్ని గమనించిన వేణు "వెంకటప్పయ్యగారు! ఎక్కడున్నారు?" అంది నవ్వుతూ.

వెంకటప్పయ్య ఉలిక్కిపడ్డాడు. ఆ ఉలికిపాటును చూసి శేఖరం "ఏమిటోయ్ అంత ఆలోచన?" అన్నాడు.

"ఆ...ఏంలేదు. ఈసినిమాగురించే"

"చూడబోతూ ఆలోచనెందుకు?"

"ఇంతకుముందు చూశానుగదూ! చాలా బాగుంటుంది" అన్నాడు. అని – వేణువైపు తిరిగిచూస్తూ "మీకు బాగానచ్చుతుంది. చూడండింకా?" అన్నాడు.

వేణు లోలోన నవ్వుకుంది.

'తనకేది నచ్చుతుందో ఇతనికేం తెలుసు?' అని.

సినిమా మొదలయ్యేముందు చూపించే అడ్వర్టయిజ్‌మెంట్లన్నీ చూపిస్తున్నారు. ఏ ఒక్కటి వినకుండా, చూడకుండా హాల్లో జనం ఒకటే గోల చేస్తున్నారు. ఎప్పుడన్నా ఓ అమ్మాయి గోచీల్లాటి బట్టల్లో కనపడి, ఫలానా పళ్ళపొడి వాడమంటేనో లేదా ఫలానా తలనూనె రాసుకోమంటేనో, జనం కాస్త గోల ఆపుతున్నారు. అయితే ఈలలూ, కేకలూ వస్తూనే వున్నాయ్.

సరే... అలా అలా సినిమా మొదలయింది.

నిజంగానే వేణు ఆ సినిమాలోని వాళ్ళిద్దరితో లీనమయిపోయింది. వాళ్ళు నవ్వితే నవ్వింది. ఏడిస్తే ఏడ్చింది. వాళ్ల

బాధపడ్తోంటే కళ్ళు నిళ్ళెట్టుకుంది.

చివరి సీను జరుగుతోంటే వేణుకీ, వెంకటప్పయ్యకీ రెండు రకాలుగా దుఃఖం వచ్చింది.

ఆ సీనులో వున్న గొప్ప మానవతా దృక్పథం, హృదయాల్ని కరిగించే కరుణరసం, ప్రకృతి విధించిన శిక్షకి మనిషి చూపించే పరిష్కారం...అవన్నీ కలిపిచూస్తున్నందువల్ల కలిగే అర్ద్రితతో హృదయం మూలుగుతోండగా జనించే దుఃఖం ఒక రకం!

ముసలి ఖద్దమ్మగాల్లాటి మనుషులు వెకిలివేషాలు వేసుకుని, ముక్కుపచ్చ లారని ఆకపిల్లల్తో శృంగారం పేరిట వేసే 'ఈ రంగాలు' చూసి, ఈలలేసీ, చప్పట్లుకొట్టి సంతోషపడి......... ఆ మాటల్నీ, వెకిలిచేష్టల్నీ, వికారపు పనుల్నీ, ప్రతీ పదంలోనూ, ప్రతీఅక్షరం లోనూ, బూతు ధ్వనించేట్టు రాసిన, పాడిన పాటల్నీ, వేసే గంతుల్నీ, అవాస్తవిక సంఘటనల్నీ, పనికిమాలిన ప్రేలాపనల్నీ, ఎవర్నీ ఉద్ధరించని త్యాగాల్నీ, లొట్టలేసుకుంటూ చూడటానికి ఒక ప్లాన్ ప్రకారం అలవాటు చెయ్యబడ్డ ప్రేక్షకులు...

క్లోజ్‌లోని చివరి ఆ అద్భుతమైన సీన్ జరుగుతోంటగా ప్రేక్షకుల్లో కొందరు మూగతండ్రి యొక్క బాధాకరమయిన ధ్వనుల్ని అనుకరిస్తూ, మహోన్నతమైన మానవజాతిని హీనాతిహీనమైన స్థితికి లాగేట్టుచేసిన గోల చూసి పడినబాధ రెండో దుఃఖానికి కారణం.

ఆ తండ్రిని అనుకరిస్తూ జనం ఒకటే గోల చేశారు.

మూగవాళ్ళందరినీ, ఆ మాటకొస్తే మనుషుల్నీ, మానవత్వాల్నీ హేళన చేశారు. దొందూ దొందే అన్నారు. పిళ్ళకి తగిందే దొరికింది అన్నారు.

వెంకటప్పయ్యకి కోపంతో దవడలు బిగుసుకున్నాయి. అసహ్యంతో తల పగిలిపోయేట్టుంది.

వేణు కన్నులూ, హృదయమూ నీరయి పోయాయ్. ఈ దుఃఖభారాన్ని మోయలే నన్పించింది ఆమెకి.

అప్పుడే...సరిగ్గా అప్పుడే-

అతి తక్కువమంది వేణు వెంకటప్పయ్యల్లాంటివారిని వదిలితే అందరూ వెకిలి సంతోషంతో కేరింతలు కొడుతుంటగా చూసిన శేఖరం కూడా ఎగతాళిగా నవ్వాడు.

చురుగ్గా అతనివంక చూసింది వేణు.

"భలే సంబంధమే" అన్నాడు శేఖరం.

"మాట్లాడమాక"

ఆ అయిదక్షరాల్లో హాలందర్నీ కపించగలిగినంత అసహ్యాన్ని పొందు పర్చింది వేణు.

సినిమా అయింది.

భారంగా బయటకొచ్చారు.

కాని, భలే హాస్యరస ప్రధానమయిన చిత్రానికి వచ్చినట్టు చాలామంది నవ్వు కుంటూ వెళ్ళటం గమనించింది వేణు.

కుర్చీలనిండా ఏదో స్కూళ్ళనుంచి వచ్చిన మూగ, చెవిటి పిల్లలున్నారు. సైగల్తో చకచకా మాట్లాడుకుంటూ కన పడ్డారు.

తమ సాటి మనుషుల్ని రకరకాలుగా అవమానించి, హేళనచేసి, అసహ్యించు కునే ఈపవిత్ర భారతదేశపు మనుషులకి—

పాపం ఈ చెవిటి, మూగపిల్లలు కన పడ్డారు.

వాళ్ళని హేళనచేసీ, వెక్కిరించీ,




వాళ్ళతో వాళ్ళ భాషలో తిట్లు తినీ, మళ్ళీ నవ్వి...

ఆ సినిమా ఓ పక్కా—

ఈ జనం మరోపక్కా—

బాధిస్తుండగా నెమ్మదిగా నడుస్తోంది వేణు.

పక్కనే మౌనంగా అనుసరిస్తున్నాడు వెంకటప్పయ్య.

శేఖరానికి కాస్త అర్థమయింది పరిస్థితి. ముగ్గురూ మౌనంగా కాస్త దూరం నడిచాక—

"మీరెటూ" అంది వేణు వెంకటప్పయ్య వంక చూస్తూ. అతను ఆలోచనలో పడ్డాడు.

అతనికి వెంటనే ఆ సినిమా నుంచి, ఆ పాత్రలనుంచి బైటపడాలని లేదు.

త్వరత్వరగా బస్సెక్కడం.. వేళాడ్డం.. పరుగులు...పని ... వీటికి దూరంగా కనీసం కొంతసేపు.

'ఏమో' అన్నట్టు తల వూపాడు. చెయ్యి తిప్పాడు.

"కాసేపలా పబ్లిగ్గార్డెన్స్ వేపెళ్దామా?" అంది వేణు. అంతలోనే అక్క గుర్తొచ్చి, "అరే...మర్చేపోయా! రూంలో అక్క ఒక్కతే వుంటుంది గదా! నేనయితే రూంకెళ్ళిపోతా. రూంకొస్తారా?" అంది.

వెంకటప్పయ్యకి వేణు ఎక్కడికెళ్తే అక్కడికి తల్లి వెంటే పోయే పిల్లాడిలా వెళ్లాలనే వుంది. కానీ...బాగోదు.

"నేను వెళ్ళిపోతాలెండి" అన్నాడు.

శేఖరం అన్నాడు వేణుతో "పద! నిన్ను మీ రూంలోదించి నే వెళ్తా!''

"నన్ను సువ్వేం దించక్కర్లె ! నేవెళ్లగల్ను" అంది వేణు.

"కాదులే. వీలయితే మీ అక్కతో కాసేపు మాట్లాడదామని...మీ రూంకొస్తా నేను" అన్నాడు శేఖరం.

అంతలో సనత్‌నగర్ వెళ్లే బస్సు వస్తోంటే "వెంకటప్పయ్యా! ఉయకు... దొరుకుతుంది" అన్నాడు శేఖరం.

"నాకు తొందరలేదు. నేను నెమ్మదిగా వెళ్తాలే!" అన్నాడు మూడీగా వెంకటప్పయ్య.

"సరే! మనం ఆటోలో పోదామా?''

''ఎందుకూ? బస్సులోనే పోదాం" అంది.

బస్సొచ్చింది.

వేణు వెంకటప్పయ్య వైపు తిరిగి "మా రూంకి మళ్లీ ఎప్పుడొస్తారు?" అంది.

ఆమె మాటల్లో ఆత్మీయతకి వెంకటప్పయ్య మనసు పులకించింది.

"మీరెప్పుడు రమ్మంటే అప్పుడు"

"వచ్చే ఆదివారం రండి. ఈలోపు మీకూ,నాకూ కూడా పన్లుంటాయి గదా!"

"సరే"

"వెళ్తానోయ్. కలుద్దాంలే" అన్నాడు శేఖరం పెద్దమనిషి తరహాగా. వీళ్ళిద్దరికీ నాలుగైదేళ్ల తేడా వుంటుందేమో. కాని ఒక్కోసారి ఏ నలభైఏళ్ల తేడానో ఉన్నట్టు మాట్లాడ్తాడు శేఖరం.

ముందునుంచీ వేణు,

వెనకనుంచీ శేఖరం బస్సెక్కారు.

బస్సు కదిలింది.

వెంకటప్పయ్య వేణు వంకే చూస్తున్నాడు. వేణు చిన్నగా నవ్వి వెళ్తున్నట్టుగా చిన్నగా తలవూపింది.

బస్సులో లేడీస్ సీట్లు రెండు ఖాళీగా వున్నాయి. ఒకదానిలో వేణు కూర్చుని వెనక్కి చూసింది.

మగవాళ్లు చాలామంది తోసుకుంటూ నిలబడివున్నారు. శేఖరం కనపడలేదు

వారిలో. ఎక్కడున్నాడో?

తర్వాత స్టాప్‌లో నలుగురాడవాళ్లు ఎక్కారు. ఒకావిడ గబగబా వచ్చి ఖాళీగా ఉన్న సీట్లో కూర్చుంది. మిగిలిన ముగ్గుర్లో ఒకావిడ ఇబ్బందిగా సీట్లవంకా, కూర్చున్న వారివంకా చూసి నీరసంగా, ఇబ్బందిగా నిలబడింది. వేణు ఆవిణ్ని పిలిచి సీటిచ్చి తను నిలబడింది.

రెండు స్టాపుల తర్వాత వెనక్కి చూస్తే శేఖరం ఓ సీట్లో కూర్చుని వున్నాడు సంతోషంగా.

బస్సు దిగాక వేణుతోపాటు నడిచాడు శేఖరం.

వేణు ముభావంగా వుంది. చకచకా నడుస్తోంది ఒక్కమాటకూడా లేకుండా.

శేఖరానికి అర్థమైంది. వేణుకి తనమీద ఎందుకో కాస్త కోపం వచ్చింది.

రూంలో రమ అప్పుడే లేచినట్టుంది. తల దువ్వుకుంటోంది. మరో ఇద్దరెవరో కొత్తవాళ్లు కూర్చుని ఉన్నారు. వేణుని చూడగానే "అమ్మయ్య.... వచ్చారా?" అన్నారు వాళ్లు.

శేఖరం "నేను మళ్లీ వస్తాను" అని వెనక్కి తిరిగాడు.




భయం భయంగా తలుపుకొట్టాడు శేఖరం. వేణుకి తన మీదెందుకు కోపం వచ్చిందో అప్పట్నించి తెలియలేదు శేఖరానికి.

'ఎవ్వరూ లేకుండా వుంటే బావుణ్ను. విషయాలు వివరంగా మాట్లాడుకోవచ్చు' అనుకుంటూ వచ్చాడు శేఖరం.

జుట్టు సరిజేసుకుంటూ నిద్రమొహంతో తలుపుతీసింది వేణు.

"అరే! నిద్రపోతున్నావా" అన్నాడు శేఖరం లోనికొస్తూ.

"ఫర్లేదులే. చాలా సేపయింది పడుకుని. కూర్చో" అంటూ టవల్ తీసుకుని మొహం కడుక్కోడానికెళ్లింది వేణు.

పేపర్ చూస్తున్నాడన్న మాటేగాని శేఖరం బుర్రలో కొక్క విషయమూ ఎక్కడంలా.

మొహం తుడ్చుకుంటూవచ్చింది వేణు.

పేపరు మడిచి పక్కన పడేస్తూ "ఆ రోజు సినిమా అయిపోయినప్పట్నుంచి నామీద ఎందుకంత కోపంగా వున్నావు? అప్పుడే మాట్లాడదామనుకుని వస్తే ఎవరో వున్నారు..." గబగబా అనేశాడు-అంతకు ముందు బట్టీపెట్టుకున్న వాక్యాలని.

వేణుకి ఆరోజు జరిగిన సంఘటనలన్నీ ఒక్కసారిగా మనసులో మెదిలి వల్‌గా అయిపోయింది. అంతకుముందు ఆ సంఘటనల్ని గురించి చాలాసార్లు ఆలోచించింది. ఎన్నివిధాల సరిపెట్టుకుందామనుకున్నా కుదరలేదు. ఆరోజు జరిగిన ప్రతి సంఘటనలోనూ అతని విలువలు స్పష్టంగా తెలుస్తున్నాయి.

చాలామందికి చాలా విషయాలు తెలీవు. అందుకే కొన్ని సందర్భాల్లో సరిగ్గా ప్రవర్తించడంలో ఫెయిలవుతూంటారు. ఆ ప్రవర్తన వెనకాలవున్న పొరపాట్లని చెబితే దిద్దుకుంటారు. అతన్ని సరిదిద్దేవారు లేరేమో. తను ఈ విషయాల్ని వివరంగా మాట్లాడాలనుకుంది

వేణు.

"ఆ రోజు నేనేమన్నా పొరపాటుగా ప్రవర్తించానా?" వేణుమవునాన్ని భరించలేక అన్నాడు శేఖరం.

"అవును శేఖరం! ఆ రోజు నీ ప్రవర్తన నన్ను బాగా హర్ట్ చేసింది. 'కౌశిష్' సినిమాలో అంత హృదయవిదారకమైన సీన్లో చలించిపోడానికిబదులు నువ్వుకూడా ఆ హాల్లో వెకిలిగా నవ్వేవాళ్లతో కలిసి నవ్వడం చూసి నాకసలప్పుడే సినిమా నుంచి లేచిరావాలనిపించింది.మనం స్నేహితులుగా వున్నామంటే మన విలువలు, మన ఆలోచనలు ఒకరకంగా వున్నప్పుడే స్నేహం నిలుస్తుంది. ఆ సీన్‌ని నేను ఫీల్ అవుతున్నట్టు నువ్వు ఫీల్ అవ్వడం లేదనేది నన్ను చాలా బాధ పెట్టింది"

"క్షమించు వేణు! నాకు అలాంటి సీరియస్ సినిమాలు చూడ్డం అంతగా అలవాటు లేదు. ఆ సినిమా నేను పూర్తిగా ఎంజాయ్ చెయ్యలేకపోయాను. జనం గోల చెయ్యడం కొంత కారణం... అందుకా అంత కోపం వచ్చింది? ఇంకెప్పుడూ అలా ప్రవర్తించను"అనేసి తేలికపడ్డాడు శేఖరం.

అతనా విమర్శనలా తీసుకోవడం సంతోషమన్పించింది వేణుకి.

"అడుక్కోడానికొచ్చిన ఆ ముసలమ్మని ఎందుకంత కసిరావు? ఆ వయసులో, అంత దయనీయమైనస్థితిలో ఆమె ఏం చేస్తుంది?"

"ఈ అడుక్కుతినేవాళ్లని చూస్తే నాకు పరమసహ్యం. అదొక వృత్తిలాగా అలవాటయిపోయింది..."

"కావచ్చు. కాని ఆ ముసలమ్మ దగ్గర్నుంచే మనం మొదలెట్టక్కర్లేదు—బిచ్చమెత్తుకోడాన్ని వ్యతిరేకించడం. అదీగాక ఇలాంటి విషయాల్లో సామాజికపరంగా మార్పులు రావాలిగానీ మనం వ్యక్తులుగా, ముసలాళ్లనీ, వికలాంగుల్నీ కసిరి ఆ వృత్తిని మాన్పించలేం కదా? నిస్సహాయంగా వున్నవాళ్లకి మనకి చేతనైన సాయంచెయ్యడం న్యాయం"

"నేను ఎందుకో చిరాగ్గా వుండటం మూలాన అలా కసిరాను...అలాటి ముసలాళ్లు అడుక్కోడంలో నాకేం వ్యతిరేకత లేదు. ఏంజేస్తారు పాపం వాళ్లు..."

"'ఎవరు' పాపం వాళ్లు?" అంటూ వచ్చారు లెక్కల మాష్టారూ, సునీతా.

"దిక్కులేక అడుక్కునేవాళ్ల సంగతిలెండి" అన్నాడు శేఖరం.

"అడుక్కునే వాళ్లకేంటండీ? వాళ్లకి బ్యాంక్ ఎక్కవుంట్లలో వున్నంత డబ్బు మీకూ, నాకూ వుందేంటి?" అన్నాడు లెక్కల మాష్టారు.

"సర్లెండి. ఎక్కడో ఓ రౌడీ వెధవ కుండొచ్చుగానీ.... రోజూ అడుక్కునే వాళ్లకి బ్యాంకుల్లో దాచుకోడానికేం వుంటాయి? ఇంతింత ఉద్యోగాలు చేస్తూ మనమే నెలాకర్లో విలవిల్లాడతాం గదా... అద్సరేగానీ పిల్లల్ని తీసుకురాలేదే?" అంది వేణు.

"ఆ! వాళ్లని పక్కింట్లో వదిలి పెట్టొచ్చాం" అంది సునీత.

"తీసుకురాలేదే అంటే?"

"వాళ్లు నడవలేరు..."

"నడవడం ఎందుకూ? మీ ఇంటిముందు బస్సెక్కితే మా ఇంటిముందు దిగొచ్చు"

"ఊరికే దించుతారా? వాళ్ళని తీసుకొస్తున్నాం అంటే బస్సెక్కాలి. వాళ్ళిద్దరికీ అరటిక్కట్టన్నమాటేగానీ అక్కణ్ణించిక్కడికి మినిమమ్ గదా! నలు



గఁరికీ రూపాయిరవై పైసలు రాటానికి, రూపాయిరవై పైసలుపోవటానికీ. మొత్తం రెండూ నంభై. మూడుపూటలా కూరలొస్తయ్. వాళ్ళనక్కడొదిలాం. ఇద్దరం నడిచొచ్చాం. నడిచెళ్తాం. వెళ్ళేప్పుడే కూరలుకూడా తీసుకెళ్ళాలి. ఎన్ని కష్టాలు పడితే రోజు గడుస్తోంది..."

"అబ్బబ్బ! మొదలెట్టారూ. మీ లెక్కలూ మీరూను. మొట్టమొదటగా

ఎవరన్నారండీ మిమ్మల్ని లెక్కలం మాష్టారని. నిజంగా వాళ్ళకాళ్ళకి ఒక కొబ్బరికాయకొట్టొచ్చు"

"ఆ కొట్టొచ్చు. కొబ్బరికాయ కొనేట్టున్నాయా రోజులు. ఒక కాయ... అదీ జాంకాయంతుంటుంది ... రెండుం బావలా అంట! ప్చ్! లాభం లేదు" అని నీరసపడిపోతున్నాడు లెక్కలం మాష్టారు.

"కాస్తాగండి....టీ ఇస్తాను. మరీ అంత నీరసపడమాకండి. మళ్లీ నడిచెళ్లాలి కూడానేమో!" అని నవ్వుతూ టీ పెట్టి తీసుకొచ్చింది.

"నేను టీ మానేశాను" అన్నాడు లెక్కల మాష్టారు.

"కాని తాగటం మానెయ్యండి... మేం ఇచ్చినప్పుడు తాగితే నష్టం



ఏముంది?" అంది నవ్వుతూ వేణు.

"నీకన్నీ నవ్వులే. అన్నావుగాబట్టి చెప్తున్నా- మీ దగ్గర తాగితే, మీరు మా ఇంటికొచ్చినప్పుడు టీ పెట్టి ఇవ్వాలి గదా. అసలే మానేస్తే, మీ రొచ్చినా ఇవ్వనక్కర్లేదు కదా!"

"ఊ... చాల్లే ఊర్కోండి మరీను."

అంది సునీత భర్త వంక మురిపెంగా చూస్తూ.

"అది మాత్రం కుదరదు లెండి. మీరిక్కడ తాగినా తాక్కపోయినా, మీ ఇంటికొస్తే మాకు టీ ఇవ్వాల్సిందే" అన్నాడు శేఖరం.

"అయితే ఇక్కడ తాగుతాం" అన్నాడు లెక్కల మాష్టారు.

టీ తాగుతూ- "మీ ఫ్రెండు క్రిష్ణమూర్తి కనిపించాడోయ్. వాళ్ళ చెల్లికి సంబంధాలు వెతుకుతున్నాడట గదా! నీ విషయం నన్ను చెప్పమంటాడు. నీతో ఓ మాట కూడా అనకుండా నేనెలా మాటివ్వను? గొంతుమీద కూర్చున్నాడనుకో. నేను చెప్తే సువ్వింటావంటాడు"

"ఇంకా దొరక లేదా రాకుమారుడు" అన్నాడు వెటకారంగా శేఖరం.

"అంటే?" అంది వేణు.

"నాలుగేళ్ళ క్రితం నేనే ఆ పిల్లని పెళ్ళిచేసుకుంటానని అడిగా అతన్ని. అప్పుడు నీలిగాడు. ఇప్పుడు నేను బి.హెచ్.ఇ.ఎల్.లో కాస్త మంచి జాబ్ లోకి ప్రమోట్ అయ్యేసరికి ఇక నా వెంటపడ్డాడు" అని కసిగా ఏదో పంతం నెగ్గినవాడిలా అన్నాడు శేఖరం.

"ఏ... కట్నం చాలినంత ఇవ్వడంలేదా" ఉడికించడానికన్నట్టు అంది వేణు.

"కట్నం కేంలే దెబ్బై వేల దాకా ఇస్తానంటున్నాడు" అని అందుకున్నాడు లెక్కల మాష్టారు.

"ఆ... కట్నం. ఒకప్పుడెలా ఉండేదో గానీ... ఇపుడు కట్నం తీసుకోను. తీసుకున్నవాడితో మాట్లాడను" అన్నాడు శేఖరం.

"ఏంటి" అని ఆశ్చర్యంగా అంది సునీత.

"కట్నం తీసుకుని పెళ్ళిచేసుకో కూడదని నిర్ణయం తీసుకున్నానండీ" అన్నాడు ధీమాగా శేఖరం.

"ఇది మరీ అన్యాయం. కట్నం తీసుకుని పెళ్ళి చేసుకోరా? అలాకట్నం తీసుకుని పెళ్ళిచేసుకోకపోతే, మీకు కట్నం ఎవరిస్తారు? ఎందుకిస్తారూ?" నవ్వుతూ అంది వేణు.

"చాల్లే జోకు..."

"ఏమైతేనేం? ఒకప్పుడు చేసుకో వాలనుకున్నమ్మాయేగా! చేసుకోండి. అదీ గాక, వాళ్ళమ్మాయిని కాస్త స్థితిపరుడికో, మంచి ఉద్యోగస్తుడికో చెయ్యాలనుకోడం అదేమంత అసహజం కాదుగదా? పైగా మనం ఆ విషయాన్ని అర్థంచేసుకోవచ్చు కూడా!" అంది సునీత.

"ఆ... కుదర్దులెండి. ఆ అమ్మాయి ఎమ్మెస్సి పూర్తిచేసి, పి.హెచ్.డి.చేస్తోంది. అప్పుడంటారా? బి.యస్సి చదువుతోంది. మరీ అంతంత చదువుకున్న ఆడవాళ్ళు మన మాట వినరు" అన్నాడు శేఖరం.

వేణు ఆశ్చర్యంగా చూసింది. అతనికి ముప్పై ఏళ్ళుంటాయేమో! కాని అతను మాట్లాడిన మాటలు... అవి అతని నోట్లోంచి వచ్చాయి కాబట్టి అతను కనీసం ఏ అరవయ్యేళ్ళ వృద్ధుడో అయుండాలి. ట్రాజెడీ ఏమిటంటే- ఈనాటి యువకుల్లో వృద్ధాప్య వృద్ధులున్నట్టే, వృద్ధుల్లో నవ యువకుల్లా ఆలోచించగల వాళ్ళున్నారు.




అది వేణుకి బాగానే తెలుసు.

అంతరంగంలో శేఖరానికి ఇపుడిపుడే కాస్త కాస్త చోటిస్తోంది వేణు. అయితే అది అనవసరం అన్నమాట. ఇంతకు ముందు చెప్పిన అతని సంజాయిషీలన్నీ నిజాయితీ లేనివన్నమాట. అతని ప్రవర్తనలో తను భ్రమపడే మంచి వెనకాల ఇంత సంకుచితత్వం దాక్కొని వుందన్నమాట అనుకొంది. వేణు కూడా ఎమ్మే చదివింది.

తనక్కాబోయే భార్య—

తనకన్నా తక్కువ చదివుండాలి.

తనకన్నా తెలివి తక్కువదై వుండాలి.

తన కన్నా చిన్నదై వుండాలి.

తనకన్నా పొట్టిదై వుండాలి.

తనకన్నా బలహీనంగా వుండాలి.

తనకన్నా తక్కువ మాట్లాడాలి.

తనమాట వినేదై యుండాలి.

కాని – తనకన్నా ఎక్కువ డబ్బు కలదై వుండాలి.

అప్పుడే తనకి అన్నివిధాల సరిపోయిన మనిషై వుంటుంది.

ఇలావున్నాయి మగవారి కోర్కెలు.

శేఖరం కూడా అలానే వున్నాడు. కాబట్టి వేణుకి అక్కర్లేదు.

"మీరు మరీ అన్యాయంగా మాట్లాడుతున్నారండీ! నేను ఎమ్మెస్సీనే. అయితే మాష్టారికెపుడన్నా ఎదురుచెప్పానా? వేణు ఎమ్మే. ఎక్కడన్నా ఆ గర్వం వుందా?" అంది సునీత.

"అందరూ మీలా వుండరులెండి...." అతను పూర్తిచేయకుండానే వేణు అంది.

"అంటే...మీరే చెత్త చెబితే ఆ చెత్త మంచి దనాలా మీ భార్య. మీ మాటే ఎందుకు వినాలనుకుంటున్నారు? ఆమె మాట ఎందుకు మీరు వినకూడదు. ఇద్దరూ కలసి ఆలోచించుకుని ఏది మంచిదైతే అది పాటిస్తారా లేక ఆ మాట ఎవరు చెప్పారు అనేదాన్నిబట్టి పాటిస్తారా? మీరు చెప్పాలి. ఆడవాళ్లు వినాలి...అది ఏమైనప్పటికీ... ఎంత తుక్కైనప్పటికీ వినాల్సిందే...అంతేనా?" అంది వేణు.

"అలాఅని కాదు. మీరిద్దరూ నన్ను పూర్తిగా అపార్థంచేసుకున్నారు. మనం మంచిచెప్పినాసరే ఈ చదువుకున్నవాళ్లు— అంటే మీ ఇద్దరూ అని కాదులేండి ... మీలాగా చాలామంది ఉండరు. వినరు"

"ఎందుకని? చదువుకోనివాళ్లు నువ్వేం చెప్పినా వింటారా? ఈ పిల్ల విషయం చూద్దాం. నాల్గేళ్లక్రితం ఎమ్మెస్సీలో చేరేముందు వినే పిల్ల ఎమ్మెస్సీ పూర్తి చేశాక వినదా? నువ్వేం మాట్లాడుతున్నావో తెలుస్తోందా?" అంది వేణు.

"మరీ అలా ఈక్కి ఈకా, తోక్కి తోకా పీకమాక గానీ చదువుకున్న స్త్రీలకి గర్వం ఉండదంటావా?"

"చదువుకోటానికీ గర్వానికీ సంబంధం లేదు. గర్వం అనేది అజ్ఞానంగా ఉండే ప్రతి మనిషికీ ఉంటుంది. దాదాపు ప్రతివాళ్ళు ఏదో ఒక అజ్ఞానంలోనే వుంటారు. గర్వం ఏదో ఒక లెవెల్లో అందరికీ వుంటుంది"

"నేననేది ఆ గర్వం కాదు, మేం చదూకున్నవాళ్ళమనే గర్వం"

"ఏం? అది మగాళ్లల్లో లేదా! నిజంగా విద్యావంతులయినవాళ్ళకి– వాళ్ళు ఆడవాళ్ళయినా, మగవాళ్లయినా తమకి తెలిసింది చాలా తక్కువనీ, తెలుసుకోవల్సింది చాలా ఎక్కువనీ తెలుస్తూనే వుంటుంది. మిడిమిడి జ్ఞానంతో వుండే వాళ్ళకి– వాళ్ళు ఆడవాళ్ళయినా, మగవాళ్ళయినా, తామేదో గొప్ప చదువులు

చదివేశామనీ, మిగిలినవాళ్ళందరికన్నా తామేదో గొప్ప వాళ్లమనీ వుంటుంది" అంది వేణు.

"అదే! ఆ గర్వం మగాళ్లలోకన్నా ఆడాళ్లల్లో ఎక్కువనే నేను అనేది" అన్నాడు శేఖరం.

"అబ్బ! పోనివ్వండయ్యా! ఎందుకు లాభంలేని మాటలు..." అన్నాడు లెక్కల మాష్టారు.

"మీరుండండి... అసలు గర్వం ఎందుకొస్తోంది? చదివినవాళ్ళు మనలో తక్కువ మందవడంవల్ల. ఎక్కువమంది ఎందుకు చదవడంలా. పరిస్థితులు కుదరక. చదువుకునే అవకాశాలు లేక. ఆడవాళ్ళు మరీ తక్కువమంది చదవడం వల్ల, ఆ చదివినవాళ్లల్లో కాస్త గర్వం వుంటే వుంటోందేమో..."

వేణు చెప్పడం పూర్తికాకుండానే శేఖరం అడ్డొచ్చేడు.

"పోనీండి... ఇప్పుడెందుగ్గాని ఆగోల. నేనెలానూ ఆ అమ్మాయిని చేసుకోనని చెప్పేశాను. అందరూ...చదువుకున్న వాళ్ళందరూ మీలాగానో, సునీతగారి లాగానో ఉంటారనుకోమాకండి" అన్నాడు అసందర్భంగా.

"మువ్వ మళ్ళీ వీళ్ళిద్దర్నీ కలుపుతున్నావేమయ్యా! వేణు ఒకటంటే,సునీత మరొకటంటుంది..." అన్నాడు లెక్కల మాష్టారు.

"అసలు ఈ చదువుకున్నవాళ్ళు ప్రతిదానికీ స్త్రీలూ, పురుషులూ, సమానత్వం, హక్కులు అనడం నాకంత బాగుండదు. స్త్రీ పురుషులు సమానులనుకునే స్త్రీలందరికీ ఇదో జబ్బు! మాట్లాడే సమానత్వం అంటారు. మాట్లాడే స్త్రీని నీచపరుస్తున్నారంటారు. అసలు నేననుకుంటానూ...అందరికన్నా స్పష్టంగా ఈ స్త్రీలకే తెలుసనిపిస్తుంది. ఏమనీ? తామెన్నటికీ పురుషుడితోసమానంకాదనీ, కాలేమనీ. అందుకే ప్రతి విషయానికీ గోలచేసి, పోనీ అనో, సరదాపడో, అంతగా పట్టించుకోకో పురుషుడు వదిలేస్తే హక్కులు సాధించామని విర్రవీగుతారీళ్లు అనిపిస్తుంది"

వేణుకి శేఖరాన్ని చూస్తోంటే మహా ఆశ్చర్యమనిపించింది.

'శేఖరం నిజస్వరూపం ఇదన్నమాట' అనుకుంది వేణు.

శేఖరం మాట్లాడిన ప్రతి అసందర్భానికి సరయిన సమాధానం వేణుదగ్గర వుంది. అందుకే-

"సమానత్వం గురించీ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాల గురించీ తెలిసిన స్త్రీలు –

తమని నీచపరిచే సంగతులేమిటో తెలుసుకొన్న స్త్రీలు –

తమని కించపర్చే ప్రతి పనినీ, ప్రతి మాటనీ, ప్రతీ చర్యనీ...

విమర్శించాల్సిందే.

అలా చెయ్యబట్టే స్త్రీకినాడు కనీసం ఈమాత్రమయినా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్నాయిగానీ, లేకపోతే స్త్రీకున్న సహజమైనక్షమా గుణంతోనో, దయతోనో, ప్రేమతోనో, ప్రతి విషయంపట్లా, తమని అవమానించే ప్రతి సంఘటనపట్లా ఓర్మి వహిస్తే, ఈనాడుకూడా స్త్రీ అసూర్యం పశ్యలా, అలంకార వస్తువులా, మగవాడి చెప్పు నాకుతూ పడివుండే కుక్కలా బతకాల్సొచ్చేదే"

అని వేణు అనుకున్నా పైకి అనలేదు. 'స్త్రీ ఎప్పుడూ పురుషుడికన్నా తక్కువే' అనే అభిప్రాయంకల మనిషితో ... 'కాదు స్త్రీకి కూడా....' అని వాదించటం





అనవసరం అనుకుంది.

''నువ్వీ అభిప్రాయాల్లో ఉన్నట్టు ఎప్పుడూ బయటపడలేదే'' అంది వేణు.

''అంటే నేనేదో స్త్రీ అభివృద్ధికి వ్యతిరేకిననుకుంటున్నారా ఏం ఖర్మ !'' అని అందరివంకా చూశాడు శేఖరం.

''ఛ! అలా అనుకోవటంలేదుగానీ... ఇక ఊరుకోవయ్యా బాబూ! వేణుని రెచ్చగొట్టమాక. ఆవిడ మూడ్ చెడగొట్టావంటే మనల్నిక రూముకూడా రానివ్వదు" అని గలగలా నవ్వాడు లెక్కలమాష్టారు.

"చాల్లే ఊరుకోండిక" అని నవ్వింది సునీత.

వేణు మాత్రం 'శేఖరం కూడా అలా మాట్లాడం' అనే విషయం నుంచి బయట పడలేకపోతోంది.

"ఏం వేణూ! మా ఇంటివేపు రావడం మానేశావ్" అంది నిష్టూరంగా సునీత.

వేణు చిరునవ్వు నవ్వి ఊర్కుంది.

లెక్కలమాష్టారు టైంచూసి "వెళ్దామా! మళ్ళీ నేను ఆ ప్లాటుల్దగ్గరికెళ్ళాలి..." అని లేచాడు.

శేఖరం కూడా లేచి నేను రేపు పాల్వంచ వెళ్తున్నా. బహుశా ఓ నెలరోజుల తర్వాత వస్తాను" అన్నాడు.

"ఊహూ...." అంది వేణు.

## 4



వేణు అప్పుడే టిఫిన్, టీలు ముగించి కూర్చుని పేపరు చూస్తోంది- బద్ధకంగా ఏదో ఆలోచిస్తూ...

ఇంతలో వెంకటప్పయ్య గుమ్మం దగ్గర ప్రత్యక్షమయ్యాడు.

"అమ్మయ్య! వచ్చారన్నమాట. మా రూమ్ మర్చిపోయారేమో అనుకున్నా" అంది వేణు.

నవ్వాడు వెంకటప్పయ్య.

"రండి...లోనకి" అంది.

వచ్చి కుర్చీ కాస్త దూరంగా లాక్కుని కూర్చున్నాడు వెంకటప్పయ్య.

"ఇప్పుడే ఉప్మా తిని టీ తాగేశాం నేనూ, లక్ష్మీ. ఇంకేమీ లేదు. టీ మాత్రం ఇవ్వబడుతుంది" అంది నవ్వుతూ.

"బతికించారు. నాకు ఉప్మా అసలిష్టం వుండదు. మీరు పెట్టినా తినేవాణ్ణి కాదు. నాకు టీ చాలా ఇష్టం. ఇప్పుడే తాగి వస్తున్నా. అయినామీరిస్తేమళ్ళీ తాగుతా" అన్నాడు.

"నిజంగా తాగి వస్తున్నారా?"

"ఏం...నిజమైతే ఇవ్వరా?"

"ఇస్తాగానీ, కాస్తాగి"

"అయితే అలానే చేద్దాంలెండి."

"మొన్నాదివారం..."

"అవునండీ ! ఎంతనుకున్నా నో వద్దామని. మా మేనేజర్ బొంబాయె ళ్తున్నాడు. ఏవో టైపు చేయాలంటే వెళ్ళా. ఆ ఫైలనీ, ఈ పేపరనీ, అదనీ ఇదనీ మొత్తం రోజంతా అక్కడే అయిపోయింది. రూంకొచ్చి వంట కూడా చేసుకోకుండా పడుకున్నా!"

"ఏమిటి మీకు వంటొచ్చా !" అంది ఆశ్చర్యంగా వేణు.

"అదేంటి ? అంత ఆశ్చర్యపోతున్నారు?"

"ఆశ్చర్యం కాదు? ఉద్యోగాలు చేసే

మగవాళ్ళు వంటలు చేసుకోవడం?"

"మీకు తెలియదులావుంది. ఉద్యోగాలు చేసే మగవాళ్ళకే వస్తుంది వంట. ఊళ్ళల్లో వ్యవసాయాలు చేసేవాళ్ళకా అవసరం వుండదు. తల్లో, చెల్లో, భార్యో ఎవరో కరు వండి పెడ్తారు. సిటీల్లో హోటల్ భోజనాలంత బాగుండక, రకరకాల జబ్బులేచ్చేసి ... డబ్బులు చాలకా, నేనే కాదు, నాకు తెల్సిన చాలామంది కూడా వంట చేసుకుంటారు..."

"అయితే ఓరోజు మీ వంట రుచి చూడాల్సిందే" అంది ఉత్సాహంగా వేణు.

"ఎప్పుడో ఎందుకు? ఇవ్వాళే! ఇక్కడే రుచి చూడండి. మీరలా కబుర్లు చెప్తూ కూర్చోండి. నేను శుభ్రంగా..."

"అబ్బ! శుభ్రంగా...." అని కళ్ళెగ రేసింది నవ్వుతూ.

"నిజంగా. నేను వంటచేశాక మీ మనసంగీకరిస్తే అప్పుడు ఎగతాళి చెయ్యండి" అన్నాడు సిన్సియర్‌గా వెంకటప్పయ్య.

"సరే! అయితే చూద్దాం. ఇవ్వాళ కాదులెండి."

"ఎందుకనీ? శుభస్య శీఘ్రంఅన్నారు. నా వంట రుచి చూడాల్సిందే"

"అమ్మో" అని భయపడింది వేణు.

వెంకటప్పయ్య నవ్వాడు.

మళ్ళీ నవ్వుతూ- "ఇప్పుడంత భయ పడక్కర్లేదులెండి. ఒకప్పుడైతే..." అని చెప్పకుండా నవ్వులోపడ్డాడు.

"చెప్పండి... చెప్పండి. మీ వీరోచిత వంట కార్యాలు" అని కుతూహలపడింది వేణు.

"ఒకసారేమయిందంటే-నేను వంట మొదలెట్టిన తొలిరోజుల్లోనన్నమాట..." అని మొదలెట్టి-

పెసరపప్పనుకుని మినప్పప్పువేసి దానిలో బోలెడంత - అప్పుడే ఊర్నించి వచ్చిన నెయ్యిపోసి కూర వండితే, తన రూమ్మేట్లు ఎన్నితిట్టారో, ఎంత నవ్వారో తల్చుకుని తల్చుకుని నవ్వాడు వెంక టప్పయ్య.

"పాపం! అదంతా వేస్టేగదా?" అంది.

"ఇంకా నయం. అటువంటి దుబారాలు మన జన్మలో లేవు. పైగా అంత నెయ్యేసి వండింది. మొత్తం తినేశా" అన్నాడు చప్పున.

"ఛ...అంత! మినప్పప్పుకూర?"

"ఆ! ఏ? పెసరపప్పుకూర తినగా లేంది మినప్పప్పుకూర తింటే ఏమవు తుంది?" అని నవ్వాడు.

"మొన్న చెప్పినట్టు గుర్తు. నాకు పెద్దగా ఈ రుచులూ అవీ తెలీవు. అలాగే తేడాలు కూడా!" అన్నాడు.

"అమ్మ...!" అని తెరలు తెరలుగా నవ్వింది వేణు.

'ఏమాటకామాటే చెప్పుకోవాలి. వేణు ఎంత నిష్కపటంగా, ఎంత నిర్మలంగా నవ్వుతుందో' అనుకున్నాడు వెంకటప్పయ్య.

"అయితే ఇవ్వాళ నాకేం వండిపెడ తారు బాబూ! నేనేం తినాలివ్వాళ? ఏం పాపంచేసినందుకు నాకు ఏ కూర తినే శిక్ష విధించబోతున్నారు?" అంది భయ పడుతూ నవ్వుతూ.

వేణు గబగబాలేచి డబ్బాలు వెతికి- "అమ్మయ్య! మినప్పప్పయితే లేదు" అంది.

"అంత భయపడమాకండి మరీను! ఒకప్పటి సంగతదీ! ఇప్పుడా!"

"ఊ" అని భయంగా చూసింది.

వెంకటప్పయ్య నవ్వాడు.




"చూస్తారుగా !" అని గబగబా బాత్‌రూంవైపెళ్లాడు. లక్ష్మి అక్కడ గిన్నెలు తోముతోంది. "లక్ష్మీ! అవన్నీ త్వరగా తోమేసి కడిగేసి తీసుకురా!" అని చెప్పి కాళ్ళూ, చేతులూ, మొహమూ కడుక్కుని వచ్చాడు. టవల్ తీసుకుని తుడుచుకుని పీట వేసుక్కూర్చో బోతోంటే–

"ఆగండి. నిజంగానే వంటచేస్తారా?" అంది వేణు.

"ఊ! ఇంకెందుకాలస్యం" అన్నాడు.

"కూరలు కూడా లేవు. టీ పెట్టు కోవాలి, తాగాలి. తర్వాత...నెమ్మదిగా మీరే చేద్దురుగానిలే. వంట తప్పుతుందీ అంటే అవి ఎలావున్నా తింటానికి నేను కూడా సిద్ధంగానే వున్నాలెండి. లేచి ఇటు కూర్చుని నాక్కబుర్లు చెప్పండి" అంది.

"సరే" అని లేచొచ్చి కూర్చు న్నాడు.

"మొన్న వెంటనే వెళ్ళిపోయారేం?" అంది.

"మొన్నా..." అని కాస్త ఆలో చించి–"మొన్నకదూ... మీరెళ్ళిపోయాక అలా నడ్చుకుంటూ కొంతదూరం వెళ్లాను. అంతలో వర్షం వచ్చేట్టుగావుంటే బస్సె క్కాను" అన్నాడు.

"ఎక్కడ?"

"అమీర్‌పేటలో"

"అమీర్‌పేటా .... పంజగుట్టవతల? అబిడ్స్ నుంచి అమీర్‌పేట వరకూ నడి చారా? నిజమేనా? మీకేమన్నా పిచ్చా!" అంది ఆశ్చర్యంగా.

"నాకలవాటేనండీ. ఈ బస్సులూ... వాటికోసం నిలబడటం, వచ్చాక తోసుకుని ఎక్కడం, లోన నిలబడటం – అంతా చిరాకు. అసలు నాకు నడుస్తూ వెళ్ళడం అలవాటు. టెంగొడవగనక లేకపోతే మొత్తం నడకే సుఖం అన్పిస్తుంది. ఏదో ఒకటి ఆలోచించుకుంటూ, ఎవరన్నా వుంటే మాట్లాడుకుంటూ చాలా బాగుం టుంది నడిచి వెళ్ళడం" అని మొదలు పెట్టి అతను అబిడ్స్‌నుంచి ఏయేసినిమాలు చూసి, ఎవరెవరితో సనత్‌నగర్ ఎప్ప డెప్పుడు ఎలా వెళ్ళిందీ; యూనివర్సిటీ నుంచి మల్కాజ్‌గిరివెళ్ళి, అక్కణ్నించి బోయిన్‌పల్లి మీదుగా ఇసకపర్రల్లోపడి ఐ. డి. పి. యల్. కాలనీకి వెళ్ళిందీ చెబుతోంటే...

"నాకసుమానం మీకేమన్నా స్క్రూ లూజేమోనని" అంది వేణు ఆశ్చర్యంగా.

అతన్నవ్వి వూరుకున్నాడు.

"అమీర్‌పేటదాకా నడిచెట్లావెళ్లారూ?" అని మళ్ళీ ఆశ్చర్యపోయింది.

"ఇంకా వెళ్ళేవాణ్నేనండీ...వాన..."

"బాగానే వుంది. మీక్కాళ్లు నెప్ప లెయ్యవు?"

"వెయ్యవు. బస్సులో ఎక్కితేనే నెప్పులేస్తాయ్"

తెగ నవ్వింది వేణు.

చివరికి ఏదో గుర్తొచ్చి–

"బస్సులో సీటు దొరికిందా?" అంది.

"దొరికిందిగాని ఎంతో సేపు నిలవలా" అన్నాడు నవ్వుతూ.

వెంకటప్పయ్య బస్సులో కూర్చో వాలీ అంటే ఆ బస్సులో ముసలివాళ్ళు నిలబడి వుండకూడదు. నీరసంగా నిలబడి ఎవరూ కనపడకూడదు. ఆడవాళ్ళెవరూ నిలబడి వుండకూడదు. వీటిలో, ఈ రోజుల్లో ఏ ఒక్కటీ సాధ్యంకాదు. మనుషులు సగంపైగా పుడుతూనే ముసలివాళ్లుగా పుడుతున్నారు. మిగిలిన

సగము నీరసంతో. ఇక వెంకటప్పయ్యకి బస్సులో కూర్చునే యోగమెక్కడిది?

"అయితే మీరసలు సీటుకోసం ప్రయత్నించరా?" సానుభూతి నిండిన నవ్వుతో చూస్తూ అడిగింది వేణు.

"ఎందుకు ప్రయత్నించను? కానీ, ఎవరన్నా ముసలివాళ్లు నిలబడి వుంటే మేం కూర్చుంటాం చెప్పండి. సిగ్గుగా అనిపించదూ" అన్నాడు.



అతని మాటల్లో, అతని ధోరణిలో ఎక్కడా 'గొప్ప' కోసం చెప్తున్నట్లు గానీ, తనేదో మంచిపని చేస్తున్న 'పోజ్'గానీ కన్పడలేదు వేణుకి. అతనంటే అతన్తో గడిపిన ప్రతి సెకనుకీ, అతను మాట్లాడిన ప్రతి మాటకీ అభిమానం పెరుగుతోంది వేణుకి.

"మీరేం చదివారూ ?" అంది వేణు.

"నేను పియూసీ పాసయ్యానండీ! అదీ ప్రైవేటుగా కట్టి. ఎప్పటి కైనా గ్రాడ్యుయేట్ నవ్వాలని ఆశ. చిన్న ప్పుడు చదువుకోవాలని మహా కోరిగ్గా వుండేది. కాని... మా ఇంటి పరిస్థితులు నన్ను చదవనివ్వలా. మా అన్నయ్య నాకన్నా నాల్గేళ్లు పెద్ద. ఆయన్ని 'ఎల్లెమ్మీ' చదివించేసరికే మా



పరిస్థితి అదుక్కెళ్ళింది. ఇక లాభం లేదని నేను 'ఎస్సెల్సీ' అవ్వగానే హైద్రాబాద్ బండెక్కా! మీరేం చదివారూ?" అన్నాడు.

"నేను ఎం. ఎ" అంది వేణు.

"మీరేదో ఉద్యోగం చేస్తున్నారని తెలుసు గానీ, ఇంత పెద్ద చదువు చదివారని తెలవదండీ" అన్నాడు భయపడుతూ.

"ఏమిటలా ముఖం పెట్టారు? నాకేం పాఠాలు వప్పచెప్పక్కర్లేదు లెండి. భయపడకండి"

అతనికి ఎంత వద్దనుకున్నా, ఆవిడ తనకన్నా అన్నిటిలోనూ ఎంతో ఉన్నతురాలు అనే ఫీలింగ్‌తోపాటు, తను చాలా చనువు తీసుకున్నట్టూ, అంత చనువుగా వుండే అర్హత తనకి లేనట్టూ అనుకోసాగాడు.

మొత్తంమీద అతనిలో వచ్చిన మార్పుని ఆవిడ కనిపెట్టింది.

ఈ చదువులు, ఈ డిగ్రీల్లో ఉండే పాఠాలూ, అవి బట్టీ పట్టడాలూ, కాపీలూ, వాటిమీద కేవలం చదువుకున్నవాళ్లు అని ఎందుకు గౌరవం చూపించక్కర్లేదో, గొప్పగా చదువుకున్నావాళ్లు ఎంతమంది ఎంత దగుల్బాజీల్లా వున్నారో సోదహరణంగా చర్చించింది. మనిషిని మనిషిగా, అతని ప్రవర్తననీ, అతని సంస్కారాన్నీ, అతని విలువల్నీ బట్టే చూడాలికానీ అతనికున్న డబ్బుని బట్టో, అతనికున్న డిగ్రీనిబట్టో చూడకూడదని అతని బుర్రకెక్కించింది.

ఇప్పుడు వెంకటప్పయ్యకి కాస్త ఇందాకటి ఫీలింగ్ పోయింది. కానీ-

ఆమె ప్రవర్తనని బట్టీ, ఆమె విలువల్ని బట్టీ, ఆమె మాట్లాడే విషయాన్ని బట్టీ వేణు చాలా గొప్ప స్త్రీ అనీ, ఇటువంటి మంచి, గొప్ప మనిషిని తానింతవరకూ చూడలేదనీ అర్థంచేసుకున్నాడు వెంకటప్పయ్య.

చిత్రం ఏమిటంటే వేణు కూడా వెంకటప్పయ్యని గురించి అప్పుడే సరిగ్గా అలానే అనుకుంది.

* * *

ఉల్లిపాయలు తరిగి ఒక గుట్టగా పోస్తున్నాడు వెంకటప్పయ్య.

"అబ్బ! ఎంత చూడబుల్‌గా తరుగుతున్నారండీ! నిజంగా మీరు వంటలో ఉద్దండులేనని మీరు ఉల్లిపాయలు తరగడంచూసే ఒప్పుకోవచ్చు" అంది వేణు.

నవ్వుతూ నవ్వుతూనే వంటంతా వంటిచేత్తో చేసేశాడు వెంకటప్పయ్య. వేణు ఏదన్నా సహాయం చెయ్యడానికి కూడా వప్పుకోకుండా పూర్తి చేసేశాడు.

"నేను కొంచెం హెల్ప్..."

"వద్దొద్దొద్దు. అనక, బాగాకుదిరిన కూరలన్నీ మీరే చేశారని చెప్తారు"

"ఎవరికి చెప్తాను"

"నాకే!"

"మీకు తెలుసుగా మీరే చేశారని"

"అమ్మో! నన్ను నమ్మిస్తారు మీరే చేశారని"

తెగ నవ్వింది వేణు.

"అబ్బ! వారానికి నాలుగు ఆదివారాలుండి, ప్రతి ఆదివారం మీరొస్తే ఎంత బాగుంటుందో!" అని దిగులుపడిపోయింది భోంచేస్తూ.

"వారానికి ఏడూ ఆదివారాలే ఉంటే బాగుండునని కూడా అనుకోవచ్చుగా" అన్నాడు నవ్వుతూ.

"అనుకోవచ్చనుకోండి. కానీ మరీ




బాగుండదులెండి! ఆశపి'తులావుంటుంది"
అంది.

"వారానికి నాలుగాదివారాలంటే అంత ఆశపోతు కాదన్న మాట. సరేగానీ. శేఖరంగారొస్తారనుకున్నానండీ" అన్నాడు వెంకటప్పయ్య.

"పోయిన వారం వచ్చాడు. పాల్వంచ వెళ్ళాలన్నాడు. బహుశా వెళ్ళివుంటాడు"

భోజనాలయ్యాక అల్మరా తెరచి పుస్తకాలు వెతుకుతోంది వేణు.

అన్ని పుస్తకాలు చూసి ముగ్ధుడై పోయాడు వెంకటప్పయ్య.

"మీరేం వెతుకుతున్నారు?" అన్నాడు.

"మీ కోసం ఏదన్నా పుస్తకం ప్రజెంట్ చేద్దామనీ..." అంది నవ్వుతూ.

"మీరు కాస్త విశ్రాంతి తీసుకోండి. ఈలోపు నేను మీ పుస్తకాలన్నీ చూస్తా" అన్నాడు.

అతని ఆత్రుత గమనించింది వేణు.

వెంకటప్పయ్యకి పుస్తకాలంటే పిచ్చి. పరసగా పుస్తకాల పేర్లు చూస్తూ పోతు న్నాడు.

దాదాపు చలం పుస్తకాలన్నీ వున్నాయి. పుస్తకాలు చూస్తూనే వెంక టప్పయ్య నెమ్మదిగా కూనిరాగం తియ్యటం మొదలెట్టాడు. అంటే అతను ఎక్కడున్నాడో ఏమిటో. సగం సగం మనుపులోకి పోతున్నాడన్న మాట.

మరో వరసలోకెళ్ళాడు.

కుటుంబరావు, గోర్కీ, టాల్‌స్టాయ్, ఛెకోవ్, షోలకోవ్, డాస్టవిస్కీ, గొగోల్ కుప్రిన్, టర్జనీవ్-అన్నీ అనువాదాలు.

రావిశాస్త్రి, గోపీచంద్, బుచ్చిబాబు.

పై వరసలో గురజాడ, టాగూర్, శరత్,

తర్వాత రక్తాక్షరాలు, రక్తాశ్రువులు, ఆదర్శజీవులు,

కృష్ణపక్షం, మేఘసందేశం, వైతాళికులు, ఎంకి పాటలు, మహాప్రస్థానం, గాలిబ్ గీతాలు...

ఓహో...

వెంకటప్పయ్య ఒంటి కాలి మీద ఆ పుస్తకాల అల్మరా ముందు రెండు రౌండ్లు తిరిగాడు.

"లేపకే నా యెంకి లేపకే నిదర..." అని ఆగి, "మీరు కాసేపు బైటకెళ్ళినా సరే! లేదా భరించినా సరే" అన్నాడు వేణు వంక తిరిగి...

అంటూనే సమాధానం కోసం కూడా చూడకుండా మూడ్‌లోకెళ్ళిపోయాడు.

"కొమ్మలో కోయిలా కోయంటదే
రాగతనమో ఏమో బాగు ఓగెరుగదే..."

పూర్తిగా పాడేశాడు.

గబగబా పేజీలు తిప్పాడు.

"జాము రేతిరి యేళ జడుపుగిడుపుమని
చెట్టు పుట్టాదాటి చేనులోనేనుంటే
చల్లంగా వస్తాదీ నా యెంకి
మెల్లంగా వస్తాదీ నా యెంకి
యెంకి వస్తాదని ఎదురూగ నేబోయి
గట్టుమీద దాని కంటికగపడగానే
కాలు కదపలేదు నా యెంకే
కరిగి నీరౌతాది నా యెంకీ..."

వెంకటప్పయ్య కన్నుల్లో నీటిపొర తళుక్కున మెరిసింది.

"ఏతామె త్తే కాడ యెదురూగకూకుండి
మల్లీయెప్పటల్లే తెల్లార బోతుంటే
సూరీయుణ్ణీ తిట్టు నాయెంకి
చందురుణ్ణీ తిట్టు నాయెంకి..."

అంటూ వెంకటప్పయ్య కూడా సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ వదలకుండా తిడ్తూ పాడాడు.

పాడుతూ పాడుతూ వేణు వంక చూశాడు.

వేణు కళ్ళు నిండా నీళ్ళతో... ఆ కళ్ళ నిండా ఆరాధన...

ఆ ఆరాధన నండూరి మీదా? ఎంకి మీదా? నాయుడుబావ మీదా? వెంకటప్పయ్య మీదా?

ఏవో కొత్త లోకాలకి ద్వారాలు తెరచుకున్నట్టయింది. ఆ పుస్తకాలు తానెన్నోసార్లు చదివింది. మనసు నీరయ్యేలా ఫీల్ అయింది.

కాని ఆ పాటల్లో నుంచి ఇంత అమృతం జాలువారుతుందని తనెన్నడైనా కలగందా?

వెంకటప్పయ్యగారూ ... మీ జన్మ ధన్యమండీ! ఇలా పాడగలవాళ్లుంటారా? ఇంత అద్భుతంగా పాడే మీతో వంట చేయిందానా? అర్థమైన చెత్తా వాగుతూ కాలం వేస్ట్ చేశానా?

ఎంకిపాటలంటే తనకెంతిష్టం. కాని ఇతను పాడుతోంటే ఎంకిపాటల్లో ఓ పాటనయినా చాలు అనిపిస్తోందేమిటి? ఎంత చక్కగా, ఎంత భావగర్భితంగా, ఎంత మధురంగా పాడుతున్నాడు?

అతని గొంతు ఎలా మారుతోందలా?

'చెందురుణ్ణీ తిట్టు

సూరీయుణ్ణీ తిట్టు...ఆహా...'పాట ఏదో లోకంనించి ఏదో లోకానికి వినిపిస్తోంది. వేణు ఆలోచనలు పాటలో కలిసి వేణునెక్కడెక్కడికో తీసుకెళుతున్నాయి.

వెంకటప్పయ్య పాడ్డం ఆపాడు.

వేణు అతనివంక చూసింది.

ఇంతకుముందు... పాడకముందులా లేడు వెంకటప్పయ్య.

అతని ముఖంలో ఏదో ఆత్మ తృప్తి. అతని కళ్లల్లో ఏదో గర్వం. అతను చాలా ఆనందంగా వున్నాడు.

"కృష్ణశాస్త్రి" అంది వేణు.

వెంకటప్పయ్య "నవ్వి పోదురుగాక" మొదలెట్టాడు.

అది పాడవచ్చని వేణు ఒక్కసారి కూడా అనుకోలా. ఆ పాట ఎంత అద్భుతంగా పాడుతున్నాడు?

ఇతనికెలా వచ్చు ఇవన్నీ?

"మీకు శాస్త్రీయం వచ్చా?"

సిగ్గుగా అన్నాడు-"రాదండీ!"

"మరెలా పాడగల్గుతున్నారివన్నీ?"

సమాధానం లేదు.

కోకిలనడిగితే ఏం జవాబు చెబుతుంది.

పాడగలుగుతున్నవారు పాడుతున్నారు.

"మరొకటి" అంది వేణు.

"ఎనకజన్మములోన ఎవరమోనంటి.."

"చాలా బాగా పాడారండీ" అంది లక్ష్మి.

వేణు "అద్భుతంగా వుంది!" అంది.

"నాకిదో పిచ్చి! పుస్తకాలు చదవకుండానూ, పాటలు పాడకుండానూ వుండలేను. మీరేం ఫీల్ కాలేదు గదా!" అన్నాడు.

"ఎందుక్కాలా! చాలా అద్భుతంగా ఫీల్ అయ్యా. మీరు చాలా గొప్పగా పాడారు. మీరు మాట్లాడ్డం మానెయ్యండి. ఇప్పుడే చెప్తున్నా....మీరెప్పుడొచ్చినా అయిదారు పాటలు పాడాలి. అలా అయితేనేరండి"

"అంతకన్నా సంతోషం నాకు మరొకటేం లేదు. పాడమని అడిగి వినేవాళ్ళుండాలేగాని జీవితమంతా పాడుతూ గడిపెయ్యనూ?" అంటూ, "తూ కహే అగర్...తూ కహే అగర్ జీవన్ భర్ గీత్ సునాతా జావూ..." అని పాడాడు.

"ఏమీ అనుకోకండి. నాకొక మూడ్




వచ్చిందంటే - అదీ పాటల మూడ్... దాన్నుంచి తప్పుకోలేను. నాకు సైగల్, ముఖేష్, హేమంత్ లంటే చాలా ఇష్టం. తెలుగులో మనకి ఘంటసాల ఒక్కడే. కాని హిందీలో ఎంతమందున్నారో నాకు అభిమాన గాయకులు. ఒక్కొక్కరూ ఒక్కో రకంగా పాడతారు. తలత్ చూడండి...గజల్స్ ఎంత అద్భుతంగా పాడతాడో" అని ఎవరో బెదిరించినట్టు ఆగిపోయాడు.

వెంకటప్పయ్య ఉత్సాహం, అతని అభిరుచులూ, అతని ప్రవర్తనలోని నిష్కపటమూ వేణుకి చాలా బాగా నచ్చాయి. అతనంటే ఒకవిధమయిన అభిమానంతో ఆమె హృదయం నిండి పోయింది.

''నాకు హిందీ పాటలు వినడం అంతగా అలవాటవ్వలేదండీ" అంది వేణు.

''అరెరె! హిందీ పాటలు వినకపోతే ఎలా? సైగల్‌ని విన్నారుగదా!"

కొంచెం విచారంగా మొహంపెట్టి "ఊరికే విన్నాను. కానీ అంత అర్థంకాలే దండీ" అంది.

"ఆ!" అని ఆకాశం విరిగి మీదపడు తున్నంత గాభరాపడ్డాడు వెంకటప్పయ్య.

"సైగల్ని మీరు సరిగా అర్థంచేసుకో లేదంటే....అరెరె! భలేపని జరిగిందే! ఆయన స్వరంలోని మాధుర్యంతో నిండిన విషాదం మీకు తెలవలేదా! రెగ్యు లర్‌గా సిలోన్ వినరా మీరు? ఉదయం ఏడున్నరనుంచి ఎనిమిదివరకూ రోజూ పురానీ ఫిల్మ్ గీత్ వస్తుంది గదా!"

నేరం చేసిందాన్లా, విచారంగా తలూపింది వేణు-విననన్నట్లు.

వెంకటప్పయ్యకి కోపం వచ్చేస్తోంది. "వినరా? మరేం వింటారు?''

"ఏమీ వినను. వంట చేసుకుని..."

"ఆ! వంట చేసుకుని... తిని..."

'తిని' అనే మాటని ఎంత వత్తి పలికా డంటే ఆ తినడం అనే పని ఎంత ఘోరమైందో అన్నట్టుగా...

"భలేవాళ్లేనండీ మీరు...వంట చేసు కుంటే నేను చేసుకోనూ? రేడియోలో సిలోన్ ఆన్‌చేస్తే వంట చేసుకోవడం కుదర్దా? రేపట్నుంచి ఏడున్నరనుంచి ఎనిమిదింటివరకూ సిలోన్ పెట్టుకోండి. న్నాలోజులు విన్నారంటే ఇంక ఎవ రొద్దన్నా మీరే వింటారు. అరెరే....ఎన్ని పాటలు! ఎన్ని పాటలు..అన్నీ...సర్లెండి! పోనీండి" అని టక్కున ఆగిపోయాడు.

వేణుకి తెలుస్తోంది. అతను పాపం తన లిమిట్ దాటుతున్నాననుకుంటున్నా డని, అందుకే మాట్లాడదల్చుకున్న దంతా మాట్లాడ్డంలేదనీ. అందుకే-

"అపారేం? నన్ను...నేను చేసిన పాపానికి తిట్టండి" అంది నవ్వుతూ.

"ఛఛ! మిమ్మల్ని తిట్టడమేమిటి? పెద్దవాళ్లు...సైగల్‌ని వినకపోవడం అంటే కొన్ని కొన్ని విషయాల్ని, అనుభవాల్ని జీవితంలో కోల్పోతామే...ఉదాహరణకి తెలుగువాళ్ళయివుండీ చలాన్నీ, శ్రీశ్రీనీ చదవలేదనుకుందాం. చదవలేదంటే అసలు చదవలేదనికాదు, కొందరు చదువు తారుగాని సరిగ్గా అర్థంచేసుకోరు. రంధ్రాన్వేషణంటారే, చలం సెక్సు రాస్తాడనీ, శ్రీశ్రీకి భక్తుందనీ, దేవుణ్ణి నమ్ముతాడనీ...ఇలా-

కొందరు సముద్రాన్ని చూడకుండానే చచ్చిపోతారు.

మరికొందరు సుబ్బలక్ష్మి పాట విన కుండానే జీవితాన్ని దొర్లించేస్తారు. మీరు విన్నారుగదా...?"

'విన్నాను' అన్నట్టు గబగబా తలూపింది వేణు.

"ఆ ..అలాగే...యస్వీ రంగారావు యాక్షన్ గిట్టనివాళ్ళొకడు నాకు తెలుసు. భానుమతిని ఇష్టపడనివాళ్ళున్నారు. ఆవిడ యాక్షన్‌లో గర్వం వుంటుందనీ, పాటలో కూడా ఆ'గీర' వుంటుందనీ ... ఏం వుంది పాపం మనుషులు అలా వున్నారు మరి. కాని నేననుకుంటానూ...వీళ్ళని ఎంజాయ్ చెయ్యలేకపోవడం అంటే అదొక పెద్ద లోపం. అఫ్‌కోర్స్..వాళ్ళకేం కాదనుకోండి. ఏమిటో నా పిచ్చి! అవునూ .... మీరు పథేర్‌పాంచాలి చూశారా?" అనడిగాడు అకస్మాత్తుగా.

త్వరత్వరగా నాలుగుసార్లు తలూపింది వేణు చూశానన్నట్టు.

"పో న్లెండి"అన్నాడు వెంకటప్పయ్య.

వేణు ఇంకా ఏమేం మిస్సయిపోయిందో అని కంగారుపట్టుకుంది వెంకటప్పయ్యకి.

తను గొప్పవనుకునేవన్నీ వేణు కూడా గొప్ప వనుకుంటుందని అతని కెందుకో నమ్మకం ఎప్పుడో కుదిరింది.

వెంకటప్పయ్య నెమ్మదిగా పథేర్ పాంచాలినుంచి మళ్ళీ సైగల్ లోకొచ్చాడు. "ఆహా సైగల్...." అని ఊహల్లోకెళ్ళిపోయాడు. ఆ ఊహాలోకంలో సైగల్ తన్మయంతోపాడుతున్నాడు..విషాదంతో ఆలపిస్తున్నాడు. "హాయే హాయే యే జాలిమ్ జమానా" అంటూ.

వేణు ఎంతో తన్మయత్వంతో వెంకటప్పయ్య వంకచూస్తోంది. అతను ఆమెకు ఓ చిన్నపిల్లాడిలా కన్పడ్తున్నాడు... ఎంత నిష్కల్మషంగా ఉన్నాడితను... ఎంత ఆర్టిస్టిక్‌గా వున్నాడితను,... ఎంత చక్కగా మాట్లాడాడితను...

అలా అనుకోగానే ఇందాక తనన్న మాటలు గుర్తొచ్చాయి. అతని పాటలు విని, "మీరు మాట్లాడం మానెయ్యండి" అ౦దిగదూ తను అనుకుని నవ్వుకుంది.

వేణు నవ్వు చూసి వెంకటప్పయ్య మళ్ళీ ఈ లోకంలోకొచ్చాడు.

తనూ నవ్వి "నాకు కొంత పిచ్చి వుందిలెండి! మా అమ్మ ఎప్పుడూ అనేది..." అంటూండగానే-

"తెల్సులెండి. 'ఇంత పిచ్చాడివెట్టా బతుకుతావురా' అనేగా" అంది నవ్వుతూ వేణు.

"అరె! మీకెలా తెల్సు?" ఆశ్చర్య పోయాడు.

"అందరమ్మలకీ తమ పిల్లలు అలానే కన్పడ్తారు. అందుకే అమ్మలంతా అలానే అంటారు"

వెంకటప్పయ్య నవ్వాడు.

వేణు అంది- "బాగా అలసిపోయారేమో...లేకపోతే మరో పాట పాడమనేదాన్నే"

"నిజమా! మరింకేం! పాట పాడితే అన్ని అలసటలూ పోతాయ్. ఏం పాట పాడనూ?"

"మీరేంపాడతారో నాకేం తెల్సు?"

"మీరేది పాడమంటే అది!"

"కోతీ బావకు పెళ్ళంటా... పాట వచ్చా మీకూ?"

"వచ్చు. రోజుకోసారన్నా పాడుకుంటూనే వుంటాన్నేను" అంటూనే మొదలెట్టాడు. అది పాడాడు. అంతటితో ఆగలా! అలాఅలా "పరుగులు తీయాలి" కూడా పాడాడు.

"ఆకాశవీధిలో" పాడాడు.

"అందమే ఆనందం" పాడాడు.

"ఎచటి నుండి వీచెనో"

"కలపరమాయే మదిలో"





"రసికరాజ తగువారము కాదా"

"చిగురాకులలో చిలకమ్మా" పాడాడు.

వేణుని ఎక్కువ ఆకర్షించిందేమి టంటే-అతను పాడుతూ పొందుతున్న ఆనందం...ఆ ఆనందంవల్లే ఆ కంఠం అంత మధురంగా పలుకుతోందేమో! పాడేప్పుడు అతని కన్నుల్లో వెలిగే కాంతి, అతని మోములో కన్పడే సంతృప్తి... మళ్ళీ మళ్ళీ చూడాలన్పించేలా చేస్తు న్నాయి.

అతను పాడలేని పాట లేదు.

అతని గొంతులో పలకని భావంలేదు.

వేణు ఈ గానామృతంలో తేలిపో తోండగా వచ్చారు చుట్టాలు.

వాళ్ళని చూడగానే టక్కున ఆపేశాడు వెంకటప్పయ్య.

వచ్చిన చుట్టాలు ఏదో నేరం చేస్తూ పట్టుబడ్డవాళ్లని చూసినట్టుగా ఈ ఇద్దర్నీ చూస్తున్నారు.

వెంకటప్పయ్య బాగోదని ఊరుకు న్నాడు గాని లేపోతే 'ప్రేమే నేరమౌనా' ట్యూన్‌తో 'పాటే నేరమౌనా' అని పాడేవాడే. అతనికా మూడ్ వచ్చేసింది కూడాను. వచ్చేసిందేమిటి? అతను లోన లోన అది పాడేసుకున్నాడు కూడాను.

వేణు మహా అయిష్టంగా, ఇబ్బందిగా చుట్టాల్తో మాట్లాడుతున్నట్టు మాట్లాడు తోంది ఆ చుట్టాల్తో.

వెంకటప్పయ్య లేచి "నేను వెళ్తానండీ" అన్నాడు.

"ఎవరమ్మాయీ! ఈ అబ్బాయీ?"

"నా ఫ్రెండు" అంది వేణు.

మూతి విరిచి తర్వాతేం చెయ్యాలో తెలీక వూరుకున్నారు చుట్టాలు.

వేణు లేచి అల్మార దగ్గరకెళ్ళి రెండు పుస్తకాలు తీసింది.

"ఇవి మీ దగ్గరుంచండి" అని ఇచ్చింది.

వెంకటప్పయ్య పుస్తకం తెరిచాడు.

చింగీజ్ ఐత్మతోవ్ రాసిన 'తొలి ఉపాధ్యాయుడు'.

రెండో పుస్తకం తెరిచాడు.

గోర్కీ బాల్యం.

అతనికి సంతోషంతో కంఠం పూడి పోయింది.

ఎంతో కృతజ్ఞతగా, అభిమానంగా అతను ఆ పుస్తకాలు తీసుకుని తలూపి చిరునవ్వు నవ్వి మళ్ళీ తలూపి వెళ్ళి పోయాడు.



5

ఇంకా కాస్త దూరాన వుండగానే సునీత వాళ్ళింట్లో నుంచి నలుగురైదుగురు కలిసి కేరింతల్తో, నవ్వుల్తో చేస్తున్న సందడి విన్పిస్తోంది.

'మంజులా వాళ్లు కూడా వచ్చినట్టుంది, అనుకుంటూ వేణు సునీత వాళ్ళింట్లో కొచ్చింది.

డ్రాయింగురూంలోనే మంజుల, సునీత, వసంతలక్ష్మి, నఫీజ్ బేగం, సుబ్బలక్ష్మి తలోచోటా కూర్చుని తెగ నవ్వుతున్నారు.

వేణు కూడా నవ్వుతూ "ఏమిటింత సందడి చేసేస్తున్నారందరూ?" అంది.

వేణుని చూసి నవ్వులు ఇంకా



పెంచారు.

సునీత- "రావమ్మా వేణమ్మా... రావమ్మా" అంటూరాగం తీసింది.

"సునీతతో పాడించగల్గుతున్నారంటే ఏదో పెద్ద విశేషమేవుంది. ఇంత సంతసంబునకు కారణంబెద్ది" అంది వేణు.

"ఓ హో హో... వేణుగారివ్వాళ తెలుగులో పాండిత్యం వెలగబెడ్తున్నారే" అంది వసంతలక్ష్మి.

"అంటే నువ్వు తెలుగు లెక్చరర్వైనంత మాత్రాన ఇతరులెవ్వరూ మీ తెలుగును ముట్టుకోగూడదా?" అని తన

మాటలకి తనే నవ్వులోపడింది మంజుల.

"ఊ...సర్లెండోయ్! పాపం విషయం తెలియక వేణు బేల మొహం పెట్టింది.." అని తర్వాత వేణుతో, "ఏం లేదోయ్! ఇంతకు ముందే...నువ్వా మలుపు కూడా తిరిగుంటావు... రెండు నిముషాల్లేటన్న మాట...మన మంజుల సిన్మా హీరో యాక్షన్ చేసిందీ...అబ్బ! ఏం బ్రహ్మాండంగా చేసిందిలే" అని మిగిలినవాళ్లను చూస్తూ "ఊ! ఏమందీ" అని నవ్వుల్లో పడిపోయింది సునీత.

వసంతలక్ష్మి అందుకుని "బేగం నఫీజా



నా ప్రేమకూజా! అహో!" అంతవరకూ అని వసంతలక్ష్మి నవ్వులో పడింది.

నఫీజ్ కూడా నవ్వుతూ "అబ్బ! ఏం యాక్షనో ఏమో కాని నా గూడు విరగ్గొట్టింది. నా చెంపలు చూడు ఎంత కంది పోయాయో" అని బిక్కమొహం పెట్టింది.

మంజుల కూడా నవ్వుతూ "అదింకా నేను కాబట్టి అలా ఉంది. అదే మా హీరో గారు అయితేనా?" అంది.

"అబ్బ! ఏం హీరోలోగానీ ప్రేమ సన్నివేశాల్లో మరీ అంత మొరటుగా వుంటారేమిటి!" అంది సుబ్బలక్ష్మి.

"ఊఁ...చాల్లేవోయ్! మొరటుగా అంట మొరటుగా...ఉఫ్ ఉఫ్ మన్నట్టుండాలా మీ హీరో లాగా..."

"అబ్బ పోనిండోయ్! గోల..." అంది సునీత. అంటూనే వేణు వంక తిరిగింది.

వేణు "ఎంత సేపయింది మీరంతా వచ్చి?" అంది.

"నేనైతే అరగంటపైనే అయింది..." అంటూ వాచీ చూసుకుని "అమ్మో...పద కొండు. టిక్కెట్లందవేమో! త్వరగా బైల్దేరండోయ్" అంది వసంతలక్ష్మి.

"వీళ్లంతా మార్నింగ్‌షో ప్రోగ్రాం మీదొచ్చారు. నన్నూ రమ్మంటున్నారు గానీ..." అని అంటోంది సునీత.

"కానీ లేదు గీనీ లేదు. వేణూ..నువ్వు కూడా రావాలి" అంది మంజుల.

"ఏం సినిమా!"

"చూద్దాం. క్రాస్‌రోడ్స్‌కెళ్తే నాలుగు అయిదు సినిమాలుంటాయిగా. ఏదయితే అదే"

వేణు ఆదివారం ఏమేం మార్నింగ్‌షో లుంటాయో పేపరు చూస్తూనేవుంటుంది. క్రాస్‌రోడ్స్ దగ్గరున్న థియేటర్స్‌లో ఇవ్వాళున్నవన్నీ తుక్కు సినిమాలే. సినిమాకెళ్లేంత తీరికే వుంటే ఆబిడ్స్‌లో 'కలియుగ్', రాయల్‌లో 'ఆక్రోష్'ఆడుతున్నాయి. తప్పని సరిగా చూడాల్సిన సినిమాలవి. టైం ఏదీ?

"నన్ను మాత్రం వదిలెయ్యండి" అంది వేణు.

"సర్లే. నిన్నిప్పుడేం ఖర్మ. ఎప్పుడో లిస్టులోంచి కొట్టేశాం. నువ్వసలు తెలుగమ్మాయివైతేగా! నీకన్నీ ఇంగ్లీషో, హిందీనో, బెంగాలీనో కావాలి" అంది మంజుల.

"అదేమీ కాదులేవోయ్. పోయిన వారమే నేను 'జగదేకవీరునికథ' చూసేను తెల్సా! వచ్చేవారం దేవదాసుకెళ్తున్నా" అంది వేణు.

"అదీ! అన్నీ పాతవైతే తప్ప కుదర్దు" అని నవ్వింది సుబ్బలక్ష్మి.

"అంటే మరో పదిహేనేళ్లుపోతేగానీ ఇప్పుడొచ్చిన సినిమాలు చూడదన్న మాట" అని పకపకా నవ్వింది నఫీజ్.

వేణు కూడా వాళ్ళతోపాటే నవ్వి అంది-"బహుశా అంతేనేమో! మరో పది హేనేళ్ళ తర్వాత వచ్చే సినిమాలు వీటిని మంచివనిపింపజేస్తే ఏం చెయ్యను చెప్పు? మరీ పాతవి రావు. కాని ఇప్పుడొచ్చే ఈ మురికి సినిమాలే ఎల్లప్పుడూ రావులే. రాబోయే సినిమాలమీదనాక్కాస్తనమ్మకాలున్నాయి"

"పోనీలే బాబూ! నీతో మాకెందుకు? ఏయ్ సునీతా! ఏమిటి నీ సంగతి తేల్చు"

"తేల్చేదమా గీల్చేదమా! పదపద"

"కాదులే. ఇవ్వాళ కాస్త పనుంది. మీ భర్తలందరూ కట్టకట్టుకుని గండిపేట కెళ్లారు. మరి మా భర్తగారేమో...నన్ను కూడా లిస్టులోంచి కొట్టెయ్యండి" అంది




సునీత.

"అబ్బా! తేల్చిందండీ చివరికి. పదండోయ్"

"టాటా... బై"

అంటూ నలుగురూ గబగబా మాట్లాడు కుంటూ వెళ్ళిపోయారు.

"అమ్మయ్య! వాన కురిసి వెలిసి నట్టయింది" అంది సునీత.

"ఏరీ మీ..."

"వంశోద్ధారకులా!" అని "పక్కింట్లో ఏవో సర్దుతూండివుంటారు. అబ్బ... ఈ పిల్లలు కాస్త కనుమరుగయితే చాలు ప్రాణం కుదుట పడ్డట్టవుతోంది. ఏమల్లరి ఏమల్లరి! చెప్పలేమనుకో ... కాల్చుకు తింటన్నారు"

"సర్లే ఊరుకోవోయ్! చాలుగానీ.. మీ పిల్లలకేం. చాలా సరదాగా వుంటారు"

"ఆ సరదాచట్టుబండలూనూ.సరేగానీ మేం బీరువాకొన్నాం. రాత్రే వచ్చింది. బెడ్‌రూంలో పెట్టాం. ఇటు రా... బాగుం దేమో చూడు"

వేణుకి ఈ బీరువాలూ అవీ అంత ఇష్టంగా వుండదు. గోడలో అల్మరా లుంటే, వాటికి తలుపులు పెట్టుకుంటే హాయిగా వుంటుందిగదా అనుకుంటుంది. కొంత అవసరాన్ని తీర్చినా చిన్న చిన్న రూములూ, వాటిల్లో మళ్ళీ బీరువాలో, డ్రెస్సింగ్ టేబిలూ,డైనింగ్ టేబిలూ..అసలు రూంలోఅటూ ఇటూ కదల్దానికూ్కడాకాళీ ఉండదు. మాకీ వస్తువులన్నీ వున్నాయని చూపించుకోడానికే కొంటారు కొందరు రకరకాలవి. వేణు ఆలోచన్లకి ఫుల్‌స్టాప్ పెట్టి సునీత వెంట వాళ్ళ బెడ్‌రూంలో కెళ్లింది.

బెడ్‌రూంలో రూంకి సరిపడా డబుల్ కాట్స్ వున్నాయి. ఓ చివర్న బీరువా. మంచాలమీద దుప్పట్లు మాత్రం మసి గుడ్డలకన్నా హీనంగా వున్నాయి. ఎంతొద్దనుకున్నా అనకుండా వుండలేక పోయింది వేణు.

"సునీతా...మీ బీరువా బాగానేవుంది గానీ మీ దుప్పట్లు ఘోరంగా వున్నా యోయ్!"

"ఏంచెయ్యను వేణూ! ఎక్కడెక్కడో తిరిగి కాళ్ళన్నా కడుక్కోకుండా వచ్చి బాబూ కొడుకులూ ఈ మంచాల మీదెక్కి తొక్కుతారు. ఎన్నిసార్లు చెప్పినా అంతే! చెప్పి చెప్పి నా గొంతు పోవడమేగాని ఫలితం వుండదు. అక్కడికీ పదిపది హేసు రోజులకోసారి ఉతికి తగలేస్తానే వుంటా. నిన్ననే మార్చా!"

పది పదిహేను రోజులపాటు ఈ దుప్పట్లు ఇక ఇలానే వుంటాయన్నమాట! మంచంమీద పడుకుని ఈ సువాసనలు పీలుస్తూ, బీరువాకి వున్న అద్దంలో ఈ సొగసు చూసుకుంటూ వుంటారన్నమాట.

వేణు ఇక ఆపై ఆలోచన బంద్ చేసింది విరక్తివల్ల.

"కూర్చో" అంది సునీత.

"ఇక్కడొద్దులే... కాస్త గాలి వస్తుంది ముందురూంలో కూర్చుందాం" అంది భయంగా.

"ఫాన్ పెడతాలే... కూర్చో" అని ఫాన్ పెట్టి తనూ కూర్చుంది. ఆ ఫాన్ గాలికి దుప్పట్ల సుగంధం పైకిలేచి రూమంతా వ్యాపిస్తోంది. వేణుకి అప్పుడే రెండు తుమ్ములు కూడా వచ్చాయి ఆ ఫాన్ గాలికి. 'నన్నేం చూశావ్ గాని దిళ్లని చూడు, అన్నట్టు దుప్పటి కాస్త పక్కకి తొలగింది.

ఇక దిళ్లున్నాయి. మడ్డి. వేళ్లతో

ఓసారి గోకితే ఎంత గోళ్లుంటే అంత మట్టి గోళ్లలోకొచ్చేలా నల్లగా మురికి.

వేణు వెంటనే లేచి "నాకిక్కడ ఊపిరాడ్డంలేదోయ్. అక్కడే కూర్చుందాం రా!" అనిముందు రూంలోకొచ్చింది.

"లెక్కల మాష్టారేమయ్యారు?"

"ఆయన మార్గదర్శికెళ్లారు. ఏదో నిట్టీ వుందంట...వీలుగావుంటే పాడొచ్చని"

"అబ్బ! ఆదివారాలు కూడా ఈ పనులేమిటోయ్... హాయిగా కూర్చుని కబుర్లు చెప్పకోక...."

"నీకేమమ్మా ... ఎన్నన్నా చెప్తావు. ఒక్కదానివి. మాకు కుదరొద్దూ?" అంది సునీత నవ్వుతూ.

వేణు కూడా నవ్వుతూ "మీకు మాత్రం ఏమిటి? ఇద్దరూ జాబ్ చేస్తున్నారు. నెల తిరిగే సరికి రెండువేలపైనే వస్తోంది గదా!"

"ఆ! చేతికి నాలుగెదొందలు కూడా రావు. అన్నీ కటింగ్‌లే!"

"ఇద్దరికిద్దరు భలేగా దొరికారులే.. మరీ అంత సేవింగ్స్ ఎందుకూ?" అంది వేణు.

"అంతా సేవింగ్సే అయితే ఇంక లేనిదే ముందీ? ప్రతినెలా ఆయన ముసలాళ్లకి రెండొందలు పంపుతారుగా!" అంది సునీత.

'ముసలాళ్లు', 'రెండొందలు' అనే మాటల వెనక చాలా నిష్టూరం ధ్వనించింది.

అత్త మామలకి రెండొంపలు పంపడం శుద్ధ దండగ అని సునీత అభిప్రాయం.

వేణుకి ఇటువంటి మనస్తత్వాల్ని భరించటం చాలా కష్టంగా వుంటుంది. కన్న తల్లిదండ్రులకి పంపే డబ్బులు దండగకింద లెక్కేసుకుంటారేమిటి? తాము తినేది మాత్రమే సరైన ఖర్చు. తల్లీ దండ్రీ తినకుండా మాడి చావాలా? ఛీ...అనుకుంది మనసులోనే వేణు.

సునీత చెప్తూనే వుంది. తమ పెళ్లయిన ఈ అయిదారేళ్లలో 'ముసలాళ్లకి' ఎప్పుడెప్పుడు ఎంతెంత పంపిందీ?

వాళు కూడా ఎలా ఎలా ఉత్తరాలు రాస్తారో ... వాళ్లకెన్నేళ్లొచ్చాయో చెప్పి... "అసలు అంతంత వయసులొచ్చాక బండల్లాగ వాళ్లుకాబట్టి బతుకుతున్నారుగానీ... మనం అయితే అసలంత వయసుదాకా బతకం..."

"అవును. బతకడంకూడా అనవసరం. తిండి దండగ. పిల్లల్తో తిట్లు తింటూ... మనం కన్న పిల్లలే, మన ఎదురుగా కూర్చుని మనం తినే మెతుకులు లెక్కపెడ్తూ వుంటే బతకడం కన్నా దేన్లోనో పడి చావడం మంచిది" అంది వేణు అసహనంగా.

సునీత కాస్త ఆశ్చర్యంగా వేణు వంక చూసి "నేనలా అంటున్నాననుకుంటున్నావా? వాళ్ల ఆరోగ్యాలు మనకుండవని నా ఉద్దేశం" అంది.

తర్వాత ఎక్కువ సంభాషణం జరగలా. 'టీ పెడ్తున్నానుండు' అన్నా ఉండకుండా వేణు లేచి బజార్లోకొచ్చి పడింది.

వేణు మూడ్ అంతా ఖరాబయ్యింది. 'ఈ మనుషులెందుకింత సంకుచితంగా వుంటారు?' అని ఒకటే చిరాకుపడింది.

విపరీతమైన ఇబ్బందులుంటే – అసలప్పుడు కూడా అలా వుండకూడదు. పోనీఅనీఅర్థం చేసుకోవచ్చు. సునీతవాళ్ల విషయమే తీసుకుంటే,లెక్కల మాష్టార్ని

వాళ్ళమ్మా నాన్నా ఎంత కష్టపడి చదివించారో అతనే చెప్పాడు ఎన్నోసార్లు. ఉన్న పొలమంతా అమ్మి మరీ తనని కాలేజీకి పంపారనీ, ఒకరోజు తినీ ఒకరోజు తినకా ఇబ్బందిపడ్డారనీ అతనే చెప్పాడు. అటువంటివాడు ఇవ్వాళ లెక్చరర్ అయ్యాడు. మరో లెక్చరర్‌ని పెళ్ళాడాడు. ఇద్దరు పిల్లలు. మూడొందల రూపాయిలు అద్దె ఇస్తున్నాడు. ఇంట్లోకి సామాన్య మధ్యతరగతి మనుషులకన్నా కాస్త ఎక్కువగా కొన్నారు. కూకట్‌పల్లి దగ్గరొక స్థలం, జూబిలీహిల్స్‌లో మరో స్థలం, దిల్‌షుక్‌నగర్ దగ్గరొక స్థలం కొన్నారు. రెండు స్థలాలూ అమ్మి మూడో స్థలంలో ఇల్లు కట్టాలని చూస్తున్నారు. చిట్టీలు, స్థలాలూ, బ్యాంక్ ఎక్కవుంట్లూ అన్నిటికీ అన్నీ కావాలి. నానా యాతనాపడి పెంచి, చదువు చెప్పించిన అమ్మా నాన్నలకి నెలకో రెండొందలు పంపడానికి తాము చేసే ఖర్చులన్నిట్లోనూ అదే దుబారా ఖర్చు కింద, పెద్ద దండగమారి ఖర్చుకింద మాట్లాడారు వీళ్ళు.

పెద్ద పెద్ద సిటీల్లో అద్దెఇళ్ళతో బాధ పడుతూ, ఎక్కడన్నా కాస్త స్థలం కొనుక్కుని చిన్న ఇల్లు కట్టుకోవాలనుకోడాన్ని అర్థంచేసుకోవచ్చుగానీ, స్థలాలమీద స్థలాలు కొనెయ్యడం, వాటితో బిజినెస్సులు చేసేయడం, అందుకోసం కన్నతల్లిదండ్రులు తినే మెతుకులు లెక్కెట్టడం.... అబ్బబ్బ...

అసలు రెండొందల్లో ఎలా బతుకుతున్నారు ఆ ఇద్దరు ముసలివాళ్ళూ?

వాళ్ళసలు ఆ మారుమూల పల్లెటూర్లో అంతంత వయసులొచ్చి ఎందుకుండాలి? వాళ్ళని తీసుకొచ్చి తనదగ్గర ఎందుకు పెట్టుకోడు?

ఒకసారి తనామాట అడిగింది కూడా!

"మీకు ఇటువంటి విషయాలు తెలియవు లెండి" అన్నాడు సుందర్రావు.

"నిజంగానే తెలియటల్లా! మీరు చెప్పండి తెలుసుకుంటాను" అంది వేణు.

"ఒకటి వాళ్ళు రారు. ఈ ముసలాళ్ళందరికీ తాము పుట్టిన మట్టిమీదే ప్రేమ. ఆ మన్నులోనే కలవాలని ఓ సెంటిమెంటు. వాళ్ళిక్కడికొస్తే వాళ్ళతో మాట్లాడేవాళ్ళుండరు..."

"అదేమిటి? మీరుంటారుగా!"

"ఆ! వాళ్ళతో మనమేం మాట్లాడ్తాం? మనం వాళ్ళు చెప్పే సొద వినలేం. మన మాటలు వాళ్ళకక్కర్లా. వాళ్ళకెంత సేపూ వాళ్ళ తోటివాళ్ళూ...ముసలివాళ్ళే కావాలి. ఆ ఊరూ, ఆ పొలాలూ, బళ్ళూ, ఎడ్లూ, కలుపులూ, కట్టేతలూ...అవే మాటలు. అందుకని వాళ్ళు రారు. ఒకవేళ వస్తారనుకోండి. మన నడుం విరిగిందే!"

"అదేంటి?"

"ఆ పల్లెటూళ్ళో అయితే పాలూ నీళ్ళూ, అద్దె, కూరలూ, కట్టెలూ ఏమీకొనక్కర్లా. కొనాల్సొచ్చినా చవగ్గా దొరుకుతాయి. ఇక్కడా? వాళ్ళొచ్చినదగ్గర్నుంచీ పాలు ఎక్కువ తీసుకోవాలి. ఈ నీళ్ళపాలూ, నీళ్ళ మజ్జిగా వాళ్ళకి బాగోవు. డబ్బులు పొయ్యలేక మన తాడూ తెగుతుంది. వాళ్ళిక్కడికొస్తే అన్నీ ఖర్చులే. రెండు వందలు ఏ మూలకీ చాలవు. అసలు అన్నిటికన్నా ముందు ఇల్లు మారాలి..."

"మీరు చెప్పేది అర్థం అయిందిలెండి. వాళ్ళురారు. ఒకవేళ వాళ్ళకి వద్దామని వున్నా మీకిష్టంలేదు. ఎందుకంటే ఖర్చు ఎక్కువవుతుందని...మరి వాళ్ళు మిమ్మల్నెంత ప్రేమగా పెంచారుగదా...ఈ

వయసులో మీ దగ్గరవుండి, వాళ్ళ బాగోగులు మీరు చూస్తోంటే, శాంతిగా, సుఖంగా బతుకుదామని వాళ్లకుండదా? మీ పిల్లల్ని చూస్తూ ఆనందంగా కాలం గడుపుదామనే వాళ్లకోరికకి విలువలేదా?"

"ఆ...సుఖాలకీ, ఆనందాలకీ అంతెక్కడండీ! వాళ్లు వచ్చినదగ్గర్నుంచి వాళ్ళొకమాట అనడం, మనం రెండనడం..."

"ఒద్దులెండి. జన్మలో వాళ్ళని మీ దగ్గరికి తీసుకురాకండి"

"అందుకేగా తీసుకురానంది! మా అమ్మ మహా చాదస్తపు మనిషి. రోజుకి రెండు సార్లు స్నానం చెయ్యాలంటుంది. తనే కాదు మనందరం! ఇంటిల్లపాదీనూ. వాకిట్లోకెళ్లొచ్చినా సరే కాళ్లు కడగాల్సిందే నంటుంది. రోజూ బట్టలుతుక్కోవాల్సిందే. రోజూ ఉతికిన బట్టలు కట్టుకోవల్సిందే! మహాపిచ్చి. శుభ్రం శుభ్రం అని అంతా శుభ్రపిచ్చి పట్టుకుందావిడకి. ఇప్పుడున్న ఇంట్లో బాగానే నీళ్లొస్తున్నాయనుకోండి. కాని ఈలెక్కన స్నానాలూ, కడుగుళ్లు, ఉతుకుళ్లు పెడ్తే ఎన్ని సబ్బులు కొనాలి? మా జీతాల్లో సగం సబ్బులకే పోతుంది. ఎంత ఖర్చు, ఎంత దండగ ... అబ్బో అవన్నీ మనకెక్కడ నడుస్తాయిలెండి..." అని నవ్వుతున్నాడు సుందర్రావు.

కాని వేణుకి సుందర్రావు అమ్మని చూడాలన్పించింది. ఆమెకీ కొడుకు... రెండు పూటలా స్నానంచేసే తల్లికి, స్నానం చేస్తే సబ్బు అరిగిపోతుందను కునే కొడుకు...ఎలా పుట్టాడా? – అని ఆశ్చర్యమేసింది.

సుందర్రావు ఎటువంటి మాటలు మాట్లాడ్డానికీ వెరవడు. మనం అతన్ని ఎన్ని మాటలన్నా ఏమీ అనుకోడు. అన్నీ సరదాగా తీసుకుంటాడు. లేదా, మన తెలివితక్కువతనానికో, మన తెలియనితనానికో జాలితో కూడిన నవ్వు నవ్వుతాడు.

అతని ఆలోచనలన్నీ లెక్కల్తో కూడి వుంటాయి. అసలందుకే అతను సైన్సు లెక్చరర్ అయినా పరిచయస్తులందరూ 'లెక్కల మాష్టారు' అనే అంటారు.

అరగంట మనదగ్గిర కూర్చుంటాడనుకోండి.... ఈ అరగంటలో ఎవరెవరు ఎక్కడెక్కడ ఎంతెంత సంపాదిస్తూ వుండి వుంటారో చెప్తాడు.

'డబ్బు' అంటే చాలు ప్రాణం లేచొస్తుంది.

వేణుకి సుందర్రావు పదేళ్లుగా తెల్సు. ఒక కాలేజీలోనే కల్సి చదివారు. మొదట్లో వేణు అంటే సుందర్రావు చాలా ఇష్టంగా వుండేవాడు. వేణుతో పరిచయంకావాలనే పెంచుకున్నాడుకూడాను. శనాదివారాల్లో ఈవిడ రూంకొస్తూండేవాడు. అవీ ఇవీ మాట్లాడుండేవాడు.

సుందర్రావు మొదట్లో వేణుని పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. ఇద్దరూ ఉద్యోగాల్లో సెటిల్ అయ్యాక, చేసుకుంటే బాగుంటుంది అనుకునేవాడు.

కష్టాల్లో, పుట్టి కష్టాల్లో పెరిగిన మనుషులు రెండు రకాలుగా తయారవుతారు.

ఒకరకం – ఆ కష్టాలన్నిటికీ కారణమయిన డబ్బుని కేర్‌లెస్‌గా చూసే –

ఆ డబ్బు ఎంతయినా సరే, ఎలాగైనా సరే ముడేసే రకం రెండోది.

లెక్కల మాష్టారు రెండో రకం.

సుందర్రావుకి పాతిక ముప్పైవేల దాకా కట్నం ఇస్తామని మూడు నాలుగు

సంబంధాలొచ్చాయి. సుందర్రావుకికట్నం తీసుకోకూడదనే ఆదర్శమూ లేదు, అభ్యంతరమూ లేదు. పిల్ల అందచందాల గురించి అసలు పట్టింపులేదు. మరో నాలుగయిదువేలు ఎక్కువిస్తారంటే పిల్ల కేదన్నా కాస్త అవుడయినా ఫర్లేదు. తన పనుల్లు చేసుకోడానికి ఇబ్బంది లేకుండా మామూలు పనీపాటా అన్నీ చేసుకో గల్గితే చాలు.

వేణుకి మంచి ఉద్యోగం వచ్చిందని తెల్సిందగ్గిర్నుంచి అతని ఆలోచనలు పదునెక్కినాయి.

ఇప్పుడో పాతికవేలు కట్నం తీసుకుని ఒకమ్మాయిని పెళ్ళిచేసుకుంటే ఓముప్పై సంవత్సరాల్తరువాత, ఈ పాతిక వేలూ నాలుగు లక్షలవుతాయి—ఫిక్సెడ్ డిపాజిట్టు లెక్కవేసుకుంటే.

అదే ఈ వేణుని పెళ్లాడితే ? పైస కట్నం రాదు. కాని ఇప్పుడు నెలకి వెయ్యి రూపాయలు జీతం వస్తోంది. త్వరలో అది పన్నెండు వందల్దాకా అవు తుంది. ముందు ముందు పదిహేను వందలూ, రెండువేలదాకా అవుతుంది. అంటే ఆవరేజిన నెలకి పదిహేనువందల జీతం వేసుకున్నా ముప్పైసంవత్సరా ల్నాటికి అయిదు లక్షల నలభైవేల రూపాయలు అవుతాయి. ఇప్పట్నుంచీ ముప్పైసంవత్సరాల వరకు పైసకూడా వడ్డీ లెక్క వేసుకోకపోతేనే.

అసలు ఏడున్నర సంవత్సరాలకి లెక్కేస్తే—

పాతికవేల కట్నం యాభైవేలయితే,

నెలకి వెయ్యి చొప్పున తొంభైవేలు జీతమే వస్తుంది— నెలా నెలా దానిమీద వడ్డీకాక.

ప్రతి ఏడున్నర సంవత్సరాలకీ ఈ వచ్చిన మొత్తం ఫిక్సెడ్ డిపాజిట్లతో పెట్టేస్తే—

ఈ తొంభైవేలుకాక మళ్ళీ ప్రతినెలా నెలకి పదిహేను వందల జీతం. అంటే మరో ఏడున్నర సంవత్సరాలకి—

కట్నం డబ్బు లక్షయితే,

ఈ జీతం డబ్బు మూడు లక్షల పది హేనువేలవుతాయి. అదీ, రెండో ఏడున్నర సంవత్సరాల జీతం డబ్బుకీ వడ్డీ లెక్కే సుకోకుండానే!

మరో ఏడున్నర సంవత్సరాలకి—

ఈ కట్నం డబ్బు రెండు లక్షలయితే,

ఈ జీతం డబ్బు, అంతే జీతం వేసు కున్నా ఆరు లక్షల ముప్పైవేలు— ప్లస్ లక్షా ముప్పైఅయిదు వేలు. అంటే ఏడు లక్షల అరవైఅయిదు వేలు, అదీ ఈ ఏడున్నర సంవత్సరాల కాలానికీ జీతం డబ్బుకీ వడ్డీకాకే!

చివరి ఏడున్నర సంవత్సరాలు అయ్యే సరికి—

అంటే మొత్తం ముప్పై సంవత్సరాల లెక్క పూర్తయ్యేసరికి కట్నం డబ్బు మొత్తం నాలుగు లక్షలయితే,

ఈ జీతండబ్బు, మళ్ళీ ఈ చివరి ఏడున్నర సంవత్సరాలకీ జీతంమీద వడ్డీ కాక, పదహారు లక్షల అరవైఅయిదు వేలవుతుంది.

అయితే కట్నం తెచ్చిన పిల్లకన్నా ఈ ఉద్యోగంచేసే పిల్లక్కాస్త ఖర్చెక్కువుంటుంది. చీరలనీ, ఆటోలనీ, ఫాషన్లనీ.... కానీ అవన్నీ జీతంమీద లెక్కేసుకొని వడ్డీల్తో నడపొచ్చు.

కాపోతే, కట్నం పాతికవేలు పెట్టి ఎక్కడన్నా చవగ్గా నాలుగు స్థలాలు కొన్నామంటే దానంత లాభం మరొకటి ఉండదు.

అయితే–

జీతం పెట్టికూడా నెలనెలా వెయ్యి రూపాయలు చిట్టీలు కట్టామంటే నాలుగు సంవత్సరాలు తిరిగేసరికి యాభై వేలు... మధ్యలో చీప్‌గా వస్తే పాడేసి, ఆ డబ్బు ఏ మంచి కంపెనీలోనన్నా షేర్లు కొన్నామంటేనా? కొన్ని కంపెనీల్లో ఇచ్చే డివిడెండ్లే మొత్తంకన్నా ఎక్కువుంటున్నాయి.

ఫతేనగర్‌లో ఆవిడ పేరుమీదొకటి, తన పేరుమీదొకటీ; కూకట్‌పల్లిలో ఆవిడ పేరుమీదొకటి, తన పేరుమీదొకటీ; దిల్‌షుక్‌నగర్‌లో...ఇది బాగా డెవలప్ అవుతుంది. రోడ్‌మీద మంచి ప్లాట్ వకటి తీసుకున్నామా? ఇక చూడండి, రోడ్ మీదకి వరుసగా షాపులు కట్టి, లోన వైపు అద్దెలకోసం రూంలుకట్టాలి. అసలు అద్దెకని కట్టే రూంలు భలేగా కట్టొచ్చు. మనముంటానిక్కట్టే వాటిలా కట్టకూడదు... అబ్బ... ఇకచూడు! ... టకటకా ధనధనా ధనం ధనం....

కాబట్టి అసలు కట్నం తీసుకుని పెళ్లి చేసుకోకూడదు. కట్నం తీసుకుని పెళ్ళి చేసుకున్నంత దండగ, ధండాలం మరొకటి లేదు. ఏమైనా సరే...వేణూలా



ఉద్యోగం చేసే పిల్లనే చేసుకోవాలి...

ఇలా ఉండేవి లెక్కల మాష్టారి ఆలోచనలు.

అయితే, వేణు ఎక్కడికక్కడ బ్రేకులు వేసింది.

వేణు 'వరస' సుందర్రావుకంత రుచించలా!

ఓరోజు లెక్కల మాష్టారు వేణు ఇంటికొచ్చేసరికి, వేణు తన చుట్టూ ఏవేవో అట్టపెట్టెల్తో వుంది. వాటినిండా పుస్తకాలు!

"ఏమిటివన్నీ? మీ ఆఫీసులో ఏమన్నా లైబ్రరీ పెడ్తున్నారా?" అన్నాడు విస్తుపోయి లెక్కల మాష్టారు.

"కాదు... ఇంట్లోనే" అంది వేణు పుస్తకాల పేర్లు చూస్తూ, ఒక్కో పుస్తకాన్నీ ప్రేమగా నిమురుతూ.

"లైబ్రరీ బాగానే వుంటుంది" అన్నాడు లెక్కల మాష్టారు.

లోన అప్పుడే లెక్క మొదలెట్టేశాడు. 'ఒక్కో పుస్తకానికీ పావలా తీసుకోవచ్చు. అన్నీ కలిపి...' అని రూంలో పరిచివున్నవీ, అల్మరాల్లో వున్నవీ చూసి బేరీజు వేశాడు. నాలుగు వందల పుస్తకాల పైనే వుంటాయి. రోజుకో వందమంది జనం తీసుకున్నా పాతిక రూపాయలు. నెలకి ఏడొందల యాభై రూపాయలు. అబ్బ! ఇది చాలా బ్రహ్మాండమైన యాపారమే. ఏం కష్టపడక్కర్లా! రిస్కులేదు. అసలు డిపాజిట్లు తీసుకున్న డబ్బు కాపిటల్‌గా పెట్టి మరికొన్ని పుస్తకాలు తెప్పించొచ్చు. వాళ్ల డబ్బుల్తో పుస్తకాలు తెచ్చి వాళ్ల దగ్గరే 'అద్దె' లాగొచ్చు. అబ్బ! ఏం బ్రహ్మాండంగా వుందీ....'

ఇలా అంచెలంచెలుగా ఆలోచించి 'పదేళ్లు తిరక్కుండా మలక్‌పేట మున్సిపల్ కాలనీలో ఒక టూఆర్టీ క్వార్టర్ కొనేయొచ్చు ఈ డబ్బులు పెట్టి' అనే నిర్ణయాని కొచ్చాడు.

"ఊఁ....చెప్పండి !" అంది వేణు ముంగురులు సవరించుకుంటూ.

సుందర్రావు ఉలిక్కిపడి చూశాడు. పుస్తకాలన్నీ అల్మరాల్లోకి ఎక్కికూర్చుని సుందర్రావువంక చిత్రంగా చూస్తున్నాయి.

"అద్దె ఎంత పెడ్తున్నారు?" అన్నాడు.

"ఊఁ?" అంది అర్థంకాక వేణు.

"మొదట్లో కాస్త చవగ్గా వుండాలి. మార్కెట్లో పావలావుంది. మీరు ఇరవై పైసలనండి. ఇక చూడండి జనం. అబ్బ.. అందరూ మనదగ్గరికే" ఆ వుత్సాహంలో తామిద్దరూ ఒకటి కాదని కూడా మర్చిపోయాడు సుందర్రావు.

వేణు అతని ఉత్సాహానికి ఆనకట్ట వేస్తూ "భలేవారేలే గాని, ఏమిటిక బుర్లు?" అంది.

లెక్కల మాష్టారికి కాసేపు ఏం మాట్లాడాలో అర్థంకాలా.

'అయితే ఇన్ని పుస్తకాలెందుకు ఒక లైబ్రరీలాగా' అని కాసేపు ఆలోచించాడు.

ఏదన్నా ఒకపని ఎవరన్నా చేశారంటే దానివల్ల తప్పనిసరిగా ఆ పనికి అయిన ఖర్చుగాక పైన మరికొంత లాభం వుంటేనే చేస్తారు..చెయ్యాలి- అని అతని అభిప్రాయం. చాలామంది దగ్గర అతను దెబ్బతినవలసిన అవసరం లేకపోయింది కూడా!

అయితే వేణు ఇన్ని పుస్తకాలు ఎందుకొంది? ఏమిటి లాభం? అదే అడిగాడు.

"ఎందుకేమిటి...మంచి పుస్తకాలు ఎందుకొంటాం ? చదువుకోడానికి!"





అంది వేణు.

"లైబ్రరీల్లో దొరకవా?"

"దొరుకుతాయి, దొరకవు. అది కాదు గదా...!" అని లేచి గబగబా అల్మరా దగ్గర కెళ్ళింది. ఒక పుస్తకం తీసింది. "ఇదిగో...ఎంకి పాటలు. ఈ పుస్తకం లైబ్రరీలో తెచ్చి చదివి ఇచ్చేస్తామా? మరి తర్వాత?'' అంది.

''ఎన్నిసార్లు చదువుతారు ఒక పుస్తకాన్ని?'' అనవసరం అనుకుంటూనే అడిగాడు సుందర్రావు.

"ఎన్నిసార్లేమిటి? జీవితమంతా అప్పుడప్పుడూ నాల్రోజులకోసారో, మూడ్నిబట్టి రోజూనో చదువుకోవద్దూ?" ఆశ్చర్యంగా అంది.

లెక్కల మాష్టారికి విషయం అర్థం గావడంలా. ఏ విషయాన్నయినా లెక్కల్లోకి మార్చి చివరికొచ్చే లాభంమీద పని చేసే సుందర్రావుకి ఈ విషయాన్ని ఏ లెక్కలో ఎలా ఇరికించాలో ఏం లాభం చూడాలో తెలియలా !

ఒక పుస్తకాన్ని ప్రతిరోజూ అవే అక్షరాలు, అవే కాగితాలు, అదే మనిషి ప్రతి రోజూ ... రోజూ రోజూ రోజూ చదువుతారా....?ఛ..జోక్ చేస్తోంది. కాని జోక్ చేస్తున్నట్లు లేదే!

ఎంకి పాటలు అల్మరాలో పెట్టేసి మరో పుస్తకం తీసింది వేణు. 'త్రి'. "ఇదిగో చలంగారురాసిన ఈ పుస్తకాన్ని కనీసం రోజుకో పేజీ చొప్పునైనా సరే జీవితాంతం చదువుతూనే వుండాలి. అయిపోతే మళ్ళీ మొదలుపెట్టి. అప్పుడే నేను బతికున్నట్టు లెక్క."

'అమ్మో...ఈ పిల్లకి పిచ్చి. పిచ్చిలోకూడా పుస్తకాల పిచ్చి. పుస్తకాల పిచ్చిలోకూడా మామూలు పిచ్చికాదు...బాగా ముదిరిన పిచ్చి'

అని మొదటిసారిగా 'వేణు గురించి మళ్ళీ ఆలోచించాలి' అనుకున్నాడు సుందర్రావు.

అలా అలా...

వేణు గురించి చూడగా చూడగా ఇంకా చాలా కనపడ్డాయి.

వేణుకి పుస్తకాల పిచ్చేకాదు-సినిమాల పిచ్చి వుంది. చిత్రమేమిటంటే అందరూ విరగబడి చూసే సినిమాలు చూడదు.

ఒకరోజో రెండ్రోజులో ఆడే సినిమాలు కొన్నయితే- ఒక్క ఆట అదికూడా ఏ ఆదివారపూటో ఆడే సినిమాలు చూస్తుంది.

ఇదేదో విచిత్రమైన చిత్రాల పిచ్చి!

అలానే-

మంచి పెయింటింగ్ కనపడితే కొనేస్తుంది.

ఓరోజు రెండువందలయాభై రూపాయలు పెట్టి ఓ చిత్రాన్ని కొనుక్కొచ్చింది. తనూ చూశాడుగా! ఎవరో పల్లెవాళ్లు గోచీలు పెట్టుకుని పడవల మీద సముద్రంలో వెళ్తున్నారు. అదీ ఓసారి చూసి బాగుంది అనుకుని రావచ్చుగా! ఊహూ....కొనెయ్యాలి. దానివల్ల లాభమేమిటి? ఇదీ లెక్కలమాష్టారికర్థంకాని విషయం.

ఆ చిత్రాన్ని తీసుకొచ్చి దానికో తెరకట్టి రూంకొచ్చిన వాళ్ళందరిదగ్గర తలో రూపాయో, పావలో తీసుకుని ఆ చిత్రాన్ని చూపిస్తే లెక్కల మాష్టారు ఏమీ ఫీల్ అయ్యేవాడుకాదు. మరి అంత ఖర్చుపెట్టి కొంది ఎందుకు ఏమీ లాభం లేకపోతే- అని సమాధానం చెప్పేవాడు ఎవరన్నా ఆక్షేపిస్తే. అయితే అతను పది పైసలన్నాసరే ఇచ్చేవాడు కాదు.

చూసేవాడు కాదు. అబ్బో! అలా చూడా లనుకుంటే లక్షలున్నాయ్. ఎన్నని చూస్తారు? ఎంతని ఖర్చుపెడారు? ఎక్కడికి అంతూ? అందుకే మొదలేలేదు.

ఇలా సుందర్రావు దాదాపు సంవత్సరంపాటు వేణుని ప్రత్యేకంగా చూసి, చివరికి ఒక నిశ్చయానికొచ్చాడు.

వేణు చాలా మంచిపిల్ల.

కాని చాలా పిచ్చిపిల్ల.

పైగా తనుచేసే ప్రతి పిచ్చిపనీ చాలా మంచిపని అని నమ్ముతుంది.

ఆ పని పిచ్చిపని అని ఆమెను ఎవరూ ఒప్పించలేరు.

ప్రయత్నించినవాళ్ళని పిచ్చివాళ్లనీ, పనికిమాలినవాళ్ళనీ ఎగతాళి చేస్తుంది. తిడుతుంది కూడా! అదేమిటంటే మీరెందుకు బతుకుతున్నారో మీకు తెలుసా?-అంటుంది.

అదే ప్రశ్న తననడిగితే-

తను చేసే ఈ 'పిచ్చి' పనులన్నీ-

పుస్తకాలు 'కొని' చదవడం.

మంచిదని తనకి తోచిన ఏ పిచ్చి పనైనా సరే చెయ్యడం.

ఏ భాషలో వున్న సినిమాకైనా తైక్కమని పోవడం.

ఖర్చుకి జంకక...

మొన్నోసారి ఓ చిన్నపిల్ల అడుక్కుంటూంటే కళ్ళంట నీళ్లు పెట్టుకుని.., ఏంచేసింది? ఏమాటకామాటే చెప్పుకోవాలి. వేణుది చాలా జాలిగుండె. ఆ అడుక్కునే పిల్లని చూస్తే పాపం లెక్కల మాష్టారికే కడుపు చెరువయ్యింది. జేబులో చెయ్యి కూడా పెట్టాడు. పది పైసలకన్నా చిన్ననాణెం దొరక్కగానీ, లేకపోతే 'పోతేపోయిందిలే ఎన్ని అనవసర ఖర్చులు చెయ్యడంలా' అని ఆ పిల్లకి ఓ అయిదు పైసలన్నా దానం చేసేవాడే కూడాను.

కాని, ఇంతలోనే వేణు ఆ పిల్లని తీసుకెళ్ళి హోటల్లో టిఫిన్స్ పెట్టించి మూడున్నర రూపాయల బిల్లు కట్టింది.

బైటికొచ్చాక ఆ పిల్లదాన్ని పంపేసి దిగులుపడిపోతూ అంది-

"ఏందేశం మాష్టారూ మనది?లెక్కలు కూడా రాని పసిపిల్లలు బజార్లలో అడుక్కుంటారు"

"ఎక్కడ చూసినా-

"ఆకలితో మాడిపోతూ

"ఒంటికి సరైన బట్టలేక

"ఎంత భయంకరమైన రోగానికి మందు లేక, నయంచేసే వైద్యులేక...

అబ్బ! ఏందేశం మాష్టారూ మనది?" అంది.

వేణు మాటల్లో వున్న ఆవేదనకి కరిగిపోయాడు లెక్కల మాష్టారు.

"ఆ! అన్ని దేశాల్లోనూ ఇట్టాగే వుంటారు. కాపోతే మన కళ్ళెదురుగా కనపడ్డంమూలాన మనకి బాధ. అసలీ అడుక్కునేవాళ్ళని అరెస్టు చెయ్యాలి"

"అరెస్టు చెయ్యాల్సింది అడుక్కునే వాళ్ళని కాదు

"వాళ్ళనాస్థితికి నెట్టిన... అడుక్కోక గత్యంతరం లేని పరిస్థితుల్లోకి నెట్టిన... ఈ సమాజాన్ని, ఈ పాలకుల్ని, ఈ ప్రభుత్వాల్ని, ఈ దోపిడి దొంగల్ని" అంది వేణు ఆవేశంగా.

"చాల్లే ఊరుకోండి!" అని భయంగా చుట్టూ చూశాడు లెక్కల మాష్టారు.

మనిషి మంచిదే. కాని...ప్చ్! లాభం లేదు. మహా పిచ్చిది. డబ్బు విలువ తెలవదు ఒక్క మనిషా? రెండు సంవత్సరాల్నుంచి జాబు చేస్తోందా. పట్టుమని

పది వందలు మిగల్చాలా.

పోనీ చీరలో, నగలో, అనుకోడానికి అవీ మామూలు చీరలు. నగల్సంగతి సరే...అసలే లేవు.

ఏమయినా లాభం లేదులే...

ఈ పిల్లని చేసుకుని తనూ సుఖపడ లేదు. తనని చేసుకుంటే... అసలు చేసు కోనంటుంది కూడానేమో! ఏమో ఏమిటి? అంటుంది... ఒకవేళ చేసుకున్నా ఆ పిల్లా సుఖపడలేదు- అనుకున్నాడు లెక్కల మాష్టారు.

ఈ లెక్కల మాష్టారి లెక్కలూ.... ఆలోచనలూ చాలావరకు వేణుకి తెలుసు. ఆయన ఏమీ అంత రహస్యంగా వుంచు కోడు. తననుకున్నదే సరైందను కుంటాడు. కాబట్టి బైటకి మాట్లాడ్తూనే వుంటాడు అన్నీ.

అందుకే తెలివిగా...

సునీతని లెక్కలమాష్టారికి పరిచయం చేసింది వేణు.

అప్పటికే సునీత ఒకటే తొందర పడ్తోంది. ఎవరన్నా ఒక జాబ్‌చేసే మగవాడు దొరికితే చాలు, వాడి కాళ్ల దగ్గర కుక్కలా పడుంటానని. చేసేది లెక్చరర్ పనే. బుర్రనిండా ఎప్పుడు పెళ్ళిచేసుకుని, ఎప్పుడు ఒకింటి దాన్నవు తానా అనే ఆరాటం.

వీళ్ళిద్దరూ సరైన జంటవుతారనుకుంది వేణు. అయ్యారు కూడా!

కాకపోతే...

పెళ్ళికి ముందు కాబోయే భర్తంటే వున్న వినయం పెళ్లయ్యాక పోయింది. లెక్కల మాష్టారిక్కూడా తన భార్య వినయంగా వుందా, గర్వంగా, వుందా అనే విషయాలంతగా పట్టవు.

ఆవిడ జీతం రాగానే మొత్తం తీసు కొచ్చి జాగ్రత్తగా తనకిస్తోందా లేదా అనేదే సమస్య.

సునీత విషయంలో ఆయనకా సమస్య ఎప్పుడూ లేదు. కాబట్టి నో ప్రోబ్లమ్.

వేణు చకచకా నడుస్తోంది. ఆమె మనసంతా చికాగ్గా వుంది. మనుషులు ఎందుకింతలా డబ్బుకి బానిసలవుతారు? అభిమానాలుండవు, ఆప్యాయతలుండవు, కన్న తల్లిదండ్రుల కిచ్చే నాలుగు రూపాయల్తో ఏమేమి కొనొచ్చో ఆలో చిస్తారేమిటి?

ఆమెకెంత బుర్ర పగలగొట్టు కున్నా అంతు దొరకదు! మనుషుల స్వభావాలు అలా ఏడిచాయ్‌లే అనుకుంది విరక్తిగా!

ఈ మంజులా, నఫీజ్ ... వీళ్ళంతా ఉద్యోగాలుచేస్తూ, పదిమందిలో తిరుగుతూ కూడా కాస్తన్నా వాళ్లని వాళ్లు డెవలప్ చేసుకోరెందుకు? ఆ పదిమందీ కూడా వీళ్లలానే వుంటార్లే ... వాళ్లని చూసి వీళ్లు, వీళ్లని చూసి వాళ్ళు ఏంమారతారు? అబ్బ...నాకెందుకు? ఇవన్నీ వారివారి వ్యక్తిగతమైన విషయాలు ... ఎవరి స్వభావాన్నిబట్టి వాళ్లు .... మరిలా అను కుని కూడా ఎందుకు మళ్లీ మళ్లీ ఆలోచి స్తాను. అందరూ అంతే! పోనీ... అను కుని తల విదిలించుకుని నడుస్తోంది వేణు.

ఎవరో ఓ కుర్రాడు ఏదో జలపాతం బొమ్మవున్న బనీను వేసుకుని వేణుని రాసుకుంటూపోయాడు.

వేణు మనసు అసహ్యంతో నిండింది. బస్సుల్లోనూ అంతే! వెనగ్గా వచ్చి అనుకుని, బస్సు కుదుపులకు తాకేలా, నుంచుంటారీ కుర్రకుంకలు. వాళ్ల బుర్రల్లో ఆలోచనలెలా వుంటాయి?



ఆడవాళ్లు అలా చేసే మగవాళ్ల మొఖాల మీద ఉమ్మెయ్యాలన్నంత అసహ్యంతో వుంటారు అని కూడా తెల్సుకోలేనంత అజ్ఞానులన్నమాట వీళ్లు! పనికిమాలిన మంద – అనుకుని 'ఛీ! మనుషులిట్లా వున్నారెందుకు' అని మళ్లీమళ్లీ వచ్చే ఆ ప్రశ్ననే మళ్లీమళ్లీ వేసుకుంది.

మంజుల సినిమా పాటలు బాగా పాడుతుంది. ఓసారి "ఎంకి పాటేదన్నా పాడవోయ్!" అంది వేణు.

"ఎంకి పాటా?" అని ఆశ్చర్యపోయింది మంజుల.

ఆ ప్రశ్నకే ఆమె మొఖంమీద ఆశ్చర్యానికి వేణు తెల్లబోయింది.

ఎంకి పాటలు తెలవని లెక్చరర్లు వుంటారని అనుకోలేదు వేణు. కాని ఉన్నారు. లెక్చరర్లే మిటి–రీడర్లు, డాక్టర్లు, లాయర్లు, రచయితలు కూడా! చాలా మంది. ఎంకిని గురించి విననివాళ్లున్నారు. డాబుగా బట్టలేసుకుని, నవ్వుతూ, ఆస్తులు సంపాదించుకుంటూ.... ఛీ! పోనీ.

శ్రీశ్రీ గురించి చెప్పోంటే –

"ఆ సినిమాల్లో పాటలు రాస్తాడే... ఆయనేనా?" అంది వసంతలక్ష్మి.

శ్రీ శ్రీ పాపం సినిమా కవిగానే గుర్తించబడ్డాడు.

"నువ్వు సుబ్బలక్ష్మి పాట విన్నావా?" అంది వేణు ఓసారి మంజుల్ని.

"నిజమా! మన సుబ్బలక్ష్మి పాడ్తుందా?" అని తెగ ఆశ్చర్యపడింది మంజుల. అంతలోనే ఆమె మొఖంలో కాస్త జెలసీ కూడా వచ్చేసింది.

"మన సుబ్బలక్ష్మి సంగతి కాదు. ఎమ్మెస్సుబ్బలక్ష్మి" అని నీరసంతో ఆగింది వేణు.

"ఏమోనబ్బా! నాకు తెలియదు" అంది పాటలు పాడే మంజుల.

కనీసం పాడటం తెల్సిన మనిషి కూ్కడా సుబ్బలక్ష్మి తెలవకపోతే ఎలా?

'అబ్బ! నాకేం వచ్చిందీ వేళ!' అని తనని తను కసురుకుంది, విసురుకుంది వేణు.

వీళ్లంతా కూర్చుంటే ఎప్పుడూ ఏ పనికిమాలిన తుక్కు సినిమాల గురించో, చీరల గురించో, రకరకాల ఫాషన్ల గురించో, తప్ప ఒక్కముక్క వినబుల్ గా ఉండదు, సరిగదా సహించబుల్ గా కూడా వుండదు.

ఎలా...

ఏమిటింత ఒంటరినైపోతున్నాను... అని దిగులుపడుతూ నడుస్తోంది వేణు.




పాతాళభైరవికి టిక్కెట్లు తీసుకున్నాక గానీ ఊపిరి పీల్చలా వేణు.

"అమ్మయ్య.... ఈమధ్య రెండుసార్లు మిస్సయింది ఈ సినిమా. ఈసారి తప్పదులే అనుకున్నా లెండి..."

"మీరెన్నిసార్లు చూశారీ సినిమా?" అడిగాడు వెంకటప్పయ్య.

"అయిదారుసార్లన్నా చూసుంటా! మీరూ?"

"నేను మూడుసార్లు. మొదటిసారి చూడ్డమే లేటు. ఏం పాటలండీ"

"అవును... మనసే పూలమంటప మాయే... మెల్లన వీణ మోగిందీ... ఎంత చక్కని పాటో– కలవర మాయే మదిలో"

బెల్ మోగింది.

"పాత సినిమాల్లో మనకి నచ్చని దృశ్యాలు కూడా ఎంత టచ్చింగ్‌గా తీసేవారో. అటువంటిది పాతాళభైరవిలో మనకి నచ్చని దృశ్యం ఉండదు. జానపదం గాబట్టి మాయలూ మంత్రాలూ వున్నా ప్రేమని చాలా చక్కగా చూపిస్తారు. ఘంటసాల పాటలూ, రేలంగీ–బాలకృష్ణా హాస్యం, సీయస్సార్ యాక్షన్, ప్రేమ కోసమై వలలో పడటం.... ఈనాడు డబ్బుకోసం, ఉద్యోగం కోసం ఎంత మంది ఎన్ని వలల్లో పడ్తున్నారు? ప్రేమకోసంవలలో ఏం? ఏకంగా బోనులో కూడా పడచ్చు... ఆ ప్రేమ దొరకాలే గాని"

నవ్వింది వేణు.

నవ్వాడు వెంకటప్పయ్య.

"పోయినాదివారం మీరొస్తారని చూశాను అంది" సినిమా నుంచి వస్తూ వేణు.

"పోయినాదివారం నేను రామగుండం వెళ్లా. మా అన్న టెలిగ్రాం ఇచ్చాడు... నన్నుఅర్జెంటుగారమ్మని. చార్జీలుదండగ"

"ఏ...వెళ్లిన పనవ్వలేదా?"

"పనా పాడా? మా అన్నయ్య రెండు సంవత్సరాల్నుంచినన్ను సతాయించడం.. వాళ్ల మరదల్ని, అంటే మా వదిన స్వంత చెల్లెల్ని పెళ్లి చేసుకోమని. ఆ మాటన్నప్పట్నుంచీ చెప్తూనే వున్నా... నాకా పెళ్లిష్టంలేదు అని కాని ఆయన ఆర్నెల్లకోసారి ఆ విషయాన్ని అప్పుడే కొత్తగా మాట్లాడుతున్నట్లు మాట్లాడ్తాడు. ఇక మాట్లాడ్దులెండి. మొన్న వెళ్ళినప్పుడు చాలా సీరియస్‌గా చెప్పా... కాస్త మాటామాటా కూడా అనుకున్నాం..." అసహనంగా చెప్తున్నాడువెంకటప్పయ్య.

అతనికా విషయాలు మాట్లాడ్డం అంత ఇష్టంగా లేదు.

"ఆ అమ్మాయిని మీరు చూశారా?" అంది వేణు.

"ఆ! ఒకటి రెండుసార్లు చూశా. మా అన్నయ్యవాళ్ళింట్లోనే"

"బాగుంటుందా?"

"ఇదేం ప్రశ్న! బాగుండటం అనేది పర్మనెంటు కాదు"

"అంటే?"

"ఒకసారి నేను పాట్నీ దగ్గర ఏదో బస్సుకోసం నించున్నా. అరగంటయ్యింది బస్సు రాలా. ఇంతలో రోడ్డంతా ఏదో తేడా వచ్చినట్లుంది. ఏమిటా అని పుస్తకం లోంచి తల్లెపా. ఇద్దరు అక్కా చెల్లెళ్ళు చిన్నపిల్లాణ్ని చెయ్యిపట్టుకుని నడుచుకుంటూ వస్తున్నారు. రోడ్డుమీద జనం నడవడం మానేయలేదుగానీ ఎక్కడివాళ్లక్కడ వాళ్లని చూడ్డానికాగారు. నిజంగా వాళ్లెంత అందంగా ఉన్నారంటే చెప్పలేను. చాలా బాగున్నారు. ఎంత సేపనుకున్నారు? ఓ అయిదు నిమిషాలు! ఆ అక్కకొడుకు... వాడు కూడా సహజంగా పిల్లల్లానే చాలా చక్కగా వున్నాడు. వాడి చక్కదనానికి తోడు ఏదో మారాంకూడా చేస్తున్నాడు. అల్లరి చేస్తే పిల్లలు చాలా సర్దాగా వుంటారు గదా. నేను పుస్తకం మూసి వాడివంక చూస్తున్నా. వాడేదో కావాలని మారాం చేస్తున్నాడు. ఏమిటా అని వినగా తేలిందేమంటే వాళ్ల హాండ్‌బాగ్‌లో చాక్‌లెట్లున్నాయి. ఒకటి కావాలిప్పుడు







అంటాడు వాడు. వాళ్లేమో ఇంటికెళ్ళాక తిందూగాని అంటారు. అక్కాచెల్లెళ్లిద్దరూ ఇంగ్లీషులో అత్యవసర సమావేశం జరిపి ఇప్పుడిచ్చినా ఫర్లేదుగాని వాడడగగానే ఇస్తే ఇస్తున్నాంగదాని ఎప్పుడూ అడుగుతాడనీ, కాబట్టి ఇంటికెళ్లేవరకూ అడిచి గిపెట్టినా ఇవ్వకూడదనీ నిర్ణయించారు.

వాళ్లిద్దరూ మాట్లాడుకుంటున్నంత సేపూ ఆ బుడ్డోడు వాళ్లవంక చూసిన చూపు ఇప్పటికీ నాకెంత నవ్వు తెప్పిస్తుందో! మధ్యలో చెల్లెలు అనుకూడా అంది "చూడవే! ఎట్లా చూస్తున్నాడో దొంగల్ని చూసినట్టు" అని. వాళ్ళిద్దరూ కలిసి తనని మోసం చెయ్యడానికే ఇంగ్లీషులోకెళ్ళారని వాడికి ఖచ్చితమైన నమ్మకం. తర్వాత చెల్లెలు తెలుగులోనే చెప్పింది— 'ఇప్పుడివ్వం' అని. వాడూ సహజంగానే తన కంఠస్వరం ఎలాంటిదో బస్సాపులో వున్న యావన్మందికీ విన్పించడానికి ఉత్సాహపడ్డాడు.

దాంతో ఆ అక్కా చెల్లెళ్ళిద్దరూ పోలీసుల కంటే కనాకష్టంగా ఆ పిల్లాణ్ని టార్చర్ చెయ్యడం మొదలెట్టారు. అప్పుడు వాళ్ళిద్దర్నీ చూసినవాడెవడైనా సరే వాళ్ళు అందగత్తెలనడానికి సాహసించ

లేరు. ఒకవేళ ఎవడన్నా అన్నా వాణ్ని పిచ్చాడికిందే జమకట్టొచ్చు. అందం అనేది మొదటిసారి చూపినప్పటికన్నా పరిచయం అయినకొద్దీ పెరగాలి. కానీ ఎక్కువ మంది మనుషుల్లో మొదట కన్పడ్డ అందం పరిచయం అయినద్గగర్నుంచీ తగ్గడం మొదలవుతుంది. ఎందుకనంటారూ? వాళ్ల ఆలోచనా ధోరణి, వాళ్ళిచ్చే విలువలో మనకి వాళ్లకి మధ్య వచ్చే అభిప్రాయభేధాలు, అన్ని వికారాలూ వాళ్ల మొఖం మీదకి వచ్చేస్తాయి. అందువల్ల 'అందం' అనే పదానికి అర్థంలేదు."

"మీరు చెప్పింది చాలా నిజం! చూడగానే చాలాఅంద వికారంగా కన్పడే మనుషులు మాట్లాడే మంచి మాటలవల్లా, నిష్కపటత్వం, నిర్మలత్వం వల్లా, పరిచయం పెరిగేకొద్దీ ఫలానా వాళ్లు చాలా చక్కగాఉంటారనిపిస్తుంది. నిజమే ప్రేమికుల విషయాల్లో జరిగేదదే! బయటి వాళ్ళకి అంత అందంగా కన్పడని అబ్బాయిని పట్టుకుని అతన్ని తప్ప పెళ్లిచేసుకోను అనే పిల్లనడిగితే నా కళ్ళతో చూడమంటుంది. అంటే ఆమె కళ్ళకతను అందంగా కన్పడ్తున్నాడన్నమాట. ఎందుకనీ? ఆమె విలువలు అతని విలువల్తో సరిపోయాయి. ఆమెక్కావలసిన మనిషి అతనే అని ఆమె తెల్సుకుంది. ఇది అర్థం కాదు చాలామందికి. నిజమే ... అందం అనేది చూడగానే కన్పించినా, మనిషి ప్రవర్తననుబట్టే ఆ అందంగానీ, అంద వికారంగానీ నిలబడేది" అంది వేణు.

ఇద్దరూ రూంకొచ్చారు. "ఇంతకీ మీకాపిల్ల ఎందుకిష్టం లేదో చెప్పలేదు" అంది వేణు.

"ఎందుకిష్టం లేదంటే...ఆ పిల్లని గురించి నాకు తెల్సినంతవరకూ - ఆమె స్వభావం, నా స్వభావం ఒకటి కాదు గనక. అదెలా తెల్సిందంటే, నేను పుస్తకాల పురుగుని. ఆమె పుస్తకాల్నే పురుగుల్లాగాచూస్తుంది. ఇక నన్నెలా చూస్తుందో! ఆమెకెంతసేపూ వాళ్ళక్కలాగా నగలూ, చీరలూ...పైగా తనో గొప్ప అందగత్తెనని గర్వం. అంతే అయితే అదో రకంగానీ, ఆడవారిలో తనకన్నా అందగత్తెని ఆమె ఊహించలేదు, ఒప్పుకోదు... అమ్మో! ఆవిడదంతా మరో లోకం. నాకూ, ఆవిడకీ పడదని రెండేళ్ళక్రితమే కనిపెట్టేశాలెండి. మా వదిన పోరుపడలేక మా అన్నయ్య, ఆయన పోరుపడలేక అమ్మ నన్ను పోరుబెడుతున్నారుగాని.. ఇక ఆ విషయం వేరులెండి..." అన్నాడు వెంకటప్పయ్య.

వేణు నవ్వుతూ "ఆడవారిలో తన కన్నా అందగత్తెని ఒప్పుకోదు అంటున్నారే అలా చాలామందే వుంటారు ... కాని దానివల్ల మీకు నష్టమేముంది?" అంది.

"అటువంటి స్వభావంవల్ల అంటే... ఒక నిజాన్ని స్వీకరించలేకపోడం, ఓపెన్‌గా ఉండలేకపోడం, అందరికన్నా తనే గొప్ప అనుకోడం-ఇవన్నీ మనిషిని ఎదుగూబొదుగూ లేకుండా చేస్తాయి. పోనీండి ఆవిడ గొడవ...మా అమ్మంటే నాకు చాలా ఇష్టం. ఆమెని కష్టపెట్టడం అంటే నాకు చాలా కష్టంగా వుంటుంది. అందుకే మొన్న మా అమ్మదగ్గర కూర్చుని ఓ గంట మాట్లాడి, 'సరేనా అయ్యా! నీకిష్టమైన అమ్మాయినే చేసుకో! కాని త్వరగా చేసుకో!' అన్పించా!" అన్నాడు సంతోషంగా. ఆ సంతోషం వాళ్ళమ్మని తన పెళ్ళి విషయంగా కష్టపెట్టవలసినవసరం లేనందుకే.




"మీరేం చెప్పారు మీ అమ్మతో" అంది వేణు. వేణుకి వెంకటప్పయ్య మీద చాలా అభిమానంగా ఉంది.

'అమ్మని కష్టపెట్టడం అంటే చాలా కష్టంగా వుంటుంది' అనేమాట వెంకటప్పయ్య అంటూంటే వేణు హృదయం అతనిమీద వాత్సల్యంతో నిండిపోయింది.

వేణుకి వెంకటప్పయ్య మీదేగాక వాళ్లమ్మ మీదకూడా చాలా అభిమానంగా వుంది. వెంకటప్పయ్య ఏదన్నా చెప్పనివ్వు...కాని...కొడుకు తనకిష్టమైన పిల్లని త్వరగాచేసుకుని సుఖంగా ఉండాలని కోరుకునే తల్లులు కూడా కరువయ్యారుగా లోకంలో...తల్లులకి కొడుకు సుఖంకన్నా కోడలు తెచ్చే సంపద మీదే కన్ను. కొడుకు ఎటువంటి స్వభావం కలవాడు? ఎటువంటి పిల్లయితే ఇద్దరూ సుఖంగా వుంటారు? - అని ఆలోచించే తల్లులు చాలా అరుదుగా వున్నారు. అసలు సుఖం అనే పదానికి పర్యాయపదం డబ్బుగా వుంది ప్రస్తుతం.

వెంకటప్పయ్య చెప్తున్నాడు - "మరీ చిన్నప్పుడు అమ్మ వాకిలూడుస్తున్నా, ముగ్గేస్తున్నా తెల్లారగట్టే పక్కలో అమ్మ లేదని తెల్సిపోయేది. వెంటనే వాకిట్లో కొచ్చేసేవాణ్ని. నన్ను చూసి 'అప్పుడే లేచా వెందుకమ్మా! నా బంగారు కొండ' అని ముద్దులుపెట్టి తన వీపుమీద ఎక్కించుకునేది. నేను అమ్మ వీపుమీద పడుకుని భుజాలమీదుగా అమ్మ ముగ్గుతో పెట్టే చుక్కలూ, గీతలూ చూస్తూ, అమ్మ చెప్పే మాటలు వింటూ వింటూ మళ్లీ నిద్రోయేవాడిని. కాస్త పెద్దయ్యాక 'నేను ఊడుస్తానమ్మా' అని అమ్మకి సాయం చేద్దామనుకునేవాణ్ని. అమ్మేమో 'నా రత్నాల కొండవి గాదూ ...నువ్వూడవకూడదమ్మా' అని ముద్దులు పెట్టేది. అమ్మ చేసే పని చూస్తూ, అమ్మ చెప్పే కథలు వింటూ అలానే అమ్మతో పాటు నేనూ తిరుగుతూండేవాడిని. మా అమ్మకి నేనంటే ప్రాణం!" అని కళ్లు మూసి తెరిచాడు వెంకటప్పయ్య.

'నా తాయిలం'అని చిన్నపిల్లాడు తన స్నేహితులకి చెప్తున్నట్టు.

వేణు అంది— "మాక్కూడా ఉన్నారులెండి అమ్మానాన్నలు.మా అమ్మక్కూడా నేనంటే ప్రాణమే. మా నాన్నకి మరీను" అంది ప్రతి మాటనీ వత్తివత్తి-తను కూడా గమ్మత్తుగా కళ్లు మూసీ తెరుస్తూ.

ఇద్దరూ నవ్వుకున్నారు.

వేణుకి అన్పించింది - వెంకటప్పయ్యతో మాట్లాడ్తుంటే చిన్నప్పటి రోజులు గుర్తుకొస్తున్నాయి. తనూ, అరుణా ఒకళ్లంటే ఒకళ్లు ఎంతపడిచచ్చేవాళ్లో.కల్లాకపటం తెలియని వయసులో ఎంత నిర్మలంగా, ఎంత ప్రేమగా వుండేవాళ్లు. ఇన్నాళ్లకి వేణుకి మళ్లీ అంత నిర్మలంగా వెంకటప్పయ్యతో ఉన్నప్పుడే అన్పిస్తోంది.

వెంకటప్పయ్యకైతే తన స్నేహదాహం తీరుతున్నట్టే వుంది.

ఉన్నట్టుండి "కాసేపేదన్నా పుస్తకం చదూకుందామా?" అన్నాడు వెంకటప్పయ్య.

కలిసి ఓ మంచి పుస్తకం చదవడం- అదీ వెంకటప్పయ్యతో కల్సి అనే ఊహే వేణుకి ఎంతో ఆనందాన్నిచ్చింది. వెంకటప్పయ్య చాలా సున్నితంగా ఆలోచిస్తాడు. చాలా సున్నితంగారియాక్ట్ అవుతాడు. మంచి పుస్తకం కల్సి చదివితే ప్రతి వాక్యం దగ్గర తనెలా ఫీల్ అవుతుందో అతనూ అలానే ఫీల్ అవుతాడు..

సందేహంలేదు.

కాని—

వేణుకి టైంసెన్స్ మహా ఎక్కువ. వాచీ చూసింది. మూడున్నరవ్వొస్తోంది సునీత వాళ్ళు కబురు పంపితే నాలుగింటి కొస్తానని చెప్పింది...వెళ్లాలి.

జీవితంలో మొదటిసారిగా 'చెప్పిన టైంకి వెళ్లకపోతే యేం?' అన్పించింది వేణుకి.

ఇక్కడ ఇతన్ని పంపేసి అక్కడి కెళ్ళి ఆ లెక్కల సముద్రంలో పడాలను కుంటేనే గొప్ప విషాదం వచ్చేస్తోంది.

కాని 'పద్ధతిగా ఉండదులే' అనుకుని—

"సారీ సార్..." అంది.

"మొన్న మీరేమన్నారు? స్నేహితుల మధ్య 'సారీ'లుండవన్నారు..."

"సారీ!"

"మళ్ళీ! అంటే నేను స్నేహితుణ్ని కానన్నమాట..."

"సారీ సారీ..."అని నవ్వేసింది వేణు.

వెంకటప్పయ్య నవ్వేశాడు.

"ఏంలేదు గానీ... పుస్తకం కల్సి చదవడం నాకు చాలా ఇష్టం. కానీ నాలుగింటికొస్తానని ఒకరికి మాటిచ్చా. కాబట్టి... మీరు రెండు పాటలు పాడితే వచ్చేవారం వరకూ మీకు శలవిస్తా!" అంది.

"అమ్మో...అయితే టైంలేదు. రెండు పాటలు పాడటానికి నేనేమన్నా టేప్ రికార్డర్‌ననుకున్నారా—మీరెక్కడ ఆప మంటే అక్కడ ఆగడానికి. వచ్చేవారం వస్తాలెండి. అప్పుడు నాలుక్కన్నా తక్కువ కాకుండా ఎన్నంటే అన్ని పాటలు. మూడున్నర దాటుతోంది. మళ్ళీ మీకు టైమయిపోతుంది. నేవెళ్తా" అని లేచాడు వెంకటప్పయ్య.

వేణుకి అతను వెళ్లక ముందే నీరస మొచ్చేసింది.

వెంకటప్పయ్య సరదాగా మిలటరీ శాల్యూట్ చేసి వెళ్ళిపోయాడు.

అతను వెళ్తోంటే అలాగే చూస్తూ ఉండి పోయింది వేణు.

## 7



"ఎందుకోయ్...అంత అర్జంటుగా రమ్మని కబురంపావ్?" అంటూ వచ్చింది వేణు.

సునీతా, సుందర్రావూ ముందు రూమ్ లోనే కూర్చుని ఏవో లెక్కలు చూస్తు న్నారు.

"అయిపోయింది...ఇప్పుడే ఒక్క నిమిషం. ఆ...మిగతా రూపాయి తొంభై రెండు పైసలేమయినాయ్?" అన్నాడు సుందర్రావు

"అబ్బ...ఉండండి! చంపుకుతింటు న్నారూ? నేనేమన్నా కొరుక్కుతిన్నానను కుంటున్నారా?"

"కొరుక్కుతిన్నావో, కొనుక్కు తిన్నావో...అదయినా చెప్పు" అంది వేణు నవ్వుతూ. ఆవిడకి వీళ్ల లెక్కలు బాగా అలవాటే.

రోజులో ఎప్పుడన్నా కాస్త తీరిక చిక్కినట్లన్పిస్తే ఆ దినవారీ లెక్కల పుస్తకాన్ని తీసి ముందేసుక్కూర్చుంటా





రిద్దరూ! తప్పనిసరిగా అరవై పైసలో, రూపాయిన్నరో, ఎంతో కొంత తేడా వస్తుంది. చివరికి ఆలోచించి ఆలోచించి భార్యాభర్తలిద్దరూ ఓ అరగంట 'లెక్క' పేరుతో పోట్లాడుకుని, ఒకరిమీద ఒకరు నిష్టూరాలేసుకుని చివరికి సామాన్యంగా సునీతే మర్చిపోతుంది గాబట్టి ఆవిడకి గుర్తురాగానే రాసి- ఆ పుస్తకాన్ని జాగ్రత్తగా దాస్తారు.

"ఉన్నది మీరిద్దరూ! మళ్ళీ ఈ లెక్కల గోలెందుకు?" అని ఓసారి అడిగింది వేణు.

"ఈ లెక్కల పుస్తకం లేకపోతే ఎంత డబ్బు ఎప్పుడు ఎందుకు ఖర్చు చేశామో ఎలా తెలుస్తుందీ?" అని 'ఇంత తెలివి తక్కువదద్దమ్మవే' అన్నట్టు చూశాడు సుందరావు.

"ఎంత ఎప్పుడు ఎందుకు.... చేశామో తెలవకపోతేనేం? అన్నీ మీవేగా!"

"ఆహా ... భలేదానివే ! ఈ నెల ఖర్చులు చూసి, వచ్చే నెల ఖర్చులు ఏమన్నా తగ్గించవచ్చేమో చూసుకోవచ్చు. ఈ నెల పనికిమాలిన ఖర్చులు ఏమన్నా వుంటే వచ్చేనెల అటువంటివాటిని తప్పించుకోవచ్చు. పాలకెంతయిందో, కూరలకెంతయిందో... అన్నీ వివరంగా వుంటే, వీలయితే దేన్లోనన్నా కాస్త మిగల్చానికి వీలవుతుందేమో చూడచ్చు. ఈ పుస్తకం లేకపోతే అసలీపాటికి దివాళాతీసుండేవాళ్ళం... అయినా నీకు ఇవన్నీ అర్థంకావులే..." అన్నాడు లెక్కల మాష్టారు.

నవ్వి ఊరుకుంది వేణు.

ఎక్కువ మందుండి డబ్బు దుబారా అవుతుందేమోననీ లెక్కలేకుండా ఖర్చు అవుతుందేమోననీ... రకరకాల అనుమానాలుండీ, లెక్కలు రాయడం అంటే అర్థం వుందిగానీ,'రూపాయేంజేశావ్..రూపాయేం జేశావ్!' అని దొంగని నిలదీసినట్టు ఒకర్నొకరు అడుక్కోడానికి తప్ప ఎందుకీ లెక్కలపుస్తకం? టైం దండక్కి తప్ప-అనుకుంటుంది వేణు.

చివరికి భార్యాభర్తలిద్దరూ ఎలాగోలా లెక్క సరిపెట్టారు.

"ఊ... ఇప్పుడు చెప్పు?" అంది సునీత.

సుందరావు లెక్కల పుస్తకాన్నీ, డబ్బులున్న బోర్నవిటా డబ్బానీ, భద్రంగా పట్టుకుని దాచిరావటానికి లోని కెళ్లాడు.

"నువ్వు అర్జెంటుగా రమ్మని కబురంపి నన్నడుగుతావేమిటి?" అంది వేణు.

"సర్లేవమ్మా! నేను కబురంపిన సంగతి తర్వాత చెప్తాలే! ముందు నీ కబుర్లేమిటి?"

"ఏమున్నాయ్....మ్మామూలే..."

"సరేగానివేణూ! మొన్న మీనాన్నగా రొచ్చెళ్లారుగా ... ఆ సంగతేమయింది?" అంది ఆరా తీసే పద్ధతిలో.

"ఏ సంగతి?"

"మాకు తెలుసులేవోయ్! మీ నాన్నే చెప్పారు. లాబ్స్‌లో ఎవరో సైంటిస్ట్ గురించి"

"ఓహో! మీ అందరికీ చెప్పాడన్న మాట. అసలు నాకన్నా ముందు మీకే చెప్పంటాడులే! ఆ సంగతేమవ్వడానికి నేనొప్పకుంటేగా ?" అంది నవ్వుతూ వేణు.

సునీతకి వేణు విషయం బాగానే తెల్సినా .... ఏదో ఆశలాంటిది పీడిస్తుంది. మనిషికి చూస్తే ముప్పై దాటుతున్నాయ్. ఇకనన్నా తన స్వప్న

సుందరుడి మీద ఆశ వదులుకొని ఊహా లోకాల్లోంచి వాస్తవ లోకంలోకి దిగుతుందేమో అనుకుంది సునీత. అదేమాట వేణుతోనూ అంది.

"సునీతా! నేను ఊహించేది ఈ భూమి మీద లేనిదాన్ని కాదు. నా ఊహ వాస్తవం మీద ఆధారపడి వుంది. నా కాళ్లు ఈ భూమి మీదే వున్నాయి. ఆలోచనలూ భూమిమీదే వున్నాయి...

నాకు కావల్సిన నాకిష్టమైన స్వభావం గల మనిషి భూమిమీద వుండదని ఎలా నమ్మను?

నాలాంటి మనిషినే నేను కోరుకునేది. అంతేగానీ ఎక్కడా చూడని, ఎవ్వరూ ఎప్పుడూ ఎరగని మనిషిని కాదు.

నన్ను అర్థంచేసుకునే మనిషి,
స్త్రీని మనిషిగా గుర్తించే మనిషి,
నా ఆలోచనల్ని గౌరవించే మనిషి,
నా ఫీలింగ్స్‌ని పంచుకునే మనిషి...

ఉంటాడు. నాలా ఆలోచించి, నాలానే ఎదురుచూసే మనుషులు ఎందరో ఉంటారు. వీళ్ళు కలవడం అనేదే సమస్య. చూద్దాం. అంతవరకూ..." అంది వేణు నిదానంగా.

"ఏమిటో వేణూ! నీ కోరిక అంత అసాధ్యమైంది కాదన్పిస్తుంది. కానీ... చూడూ ... అప్పుడే ముప్ఫయి దాటుతున్నాయ్. ఎవరో ఒకర్ని .... ఉన్నవారిలో కాస్త మంచివాళ్ళని చూసి ఒప్పుకుంటేనే బాగుంటుందేమోనన్పిస్తుంది. మేమంతా బతకడంలా? మీ లెక్కల మాష్టారు... నన్ను బాగానే చూస్తారు. మేం బాగానే వున్నాం... ఎక్కడో చోట రాజీ పడాల్సిందేనోయ్!" కాస్త ఆలోచనగా అంది సునీత.

"నిజమే సునీతా! మీ విషయంలో నువ్వు చెప్పింది నిజమే. అయితే అనగూడదుగానీ ఒకటి ఆలోచించు. లెక్కల మాష్టారుతో నాకు పెళ్ళి అయ్యుండేదనుకో. మేమిద్దరం బాధపడాల్సొందేది. అవునా కాదా? అలా అని నేనేదో గొప్పదాన్ననీ, మీరు కాదనీ కాదు. ఆయన్తో నువ్వు సహకరించినట్టు నేను సహకరించేదాన్ని కాదు. ఎందుకూ? ఆయన స్వభావం, నా స్వభావం వేరు వేరు గాబట్టి? నా ఆలోచనలు వేరు. నీకు తెలపందేముందీ?"

"అవుననుకో.... ఇప్పుడు నిన్ను పిలిచిందెందుకంటే...." అంటూండగా లెక్కల మాష్టారు వస్తూ-

"ఏమంటోంది పెళ్ళికూతురు?" అన్నాడు.

"ఛీ" అంది వేణు.

పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు, వధువు వరుడు, లాంచనాలు, కట్నాలు, ముత్తయిదువలు, పేరంటాలు, మెట్టపిల్లేళ్ళు, కత్న, ఆడబడుచులు, పతాణంపెట్టె, మనుగుడుపులులాటి మాటలు తెలుగువే అయినా... ఎందుకనో ఆ మాటలు మరో లోకపు మాటల్లా వుంటాయి వేణుకి. తనకి తెలియకుండానే ఆ మాటలంటే ఎందుకనో చాలా వ్యతిరేకత కూడాను.

"అబ్బ... మీరూరుకోండి! అటువంటి మాటలంటే ఆవిడింతెత్తు ఎగురుతుందని తెల్సికూడా..."

"ఎంతెత్తెగురుతుందో చూద్దామనే అన్నాగానీ...నేను చెబుతున్నా విను వేణూ! నీకంటే దేన్లో అయినా కాకపోయినా వయసులో పెద్దాణ్ని. అనభవంమీద చెప్తున్నా. నీకు అవసరమైనదానికన్నా ఎక్కువ ఆత్మాభిమానం. అలనే ఏదన్నా విషయంవుంటే దాన్ని ఆకాశానికెత్తడమో, పాతాళానికి తొక్కడమో చేస్తావుగాని





మధ్యేమార్గంగా అసలు ఆలోచించనే ఆలోచించవు. అలా వుండటం మూలంగా ఎంతెంత దెబ్బలు తగుల్తాయో, ఎన్నెన్ని నష్టాలొస్తాయో నీకు తెలియదు. నే చెప్తున్నా విను. డాక్టర్ గోపీనాథ్ గురించి నీకూ కాస్త తెలుసుగా. అతన్నిన్న సునీత దగ్గర నీ విషయం ప్రస్తావించాడు. అతని కేంటి? అతను 'ఊ' అంటే మూడు నాలుగు లక్షలయినా సరే ఇవ్వడానికి సిద్ధంగా వున్నారు జనం. అందానికి అందం, ఆస్తికి ఆస్తి, చదువుకి చదువు. డాక్టరు. ఎంత బ్రహ్మాండమయిన ప్రొఫెషనూ....అతను నిన్న సునీత దగ్గర...ఏమన్నాడో చెప్పవోయ్" అని సునీతకేసి తలెగరేశాడు.

"నిజమే వేణూ! గోపీనాథ్ నాకు తెలిసినంతవరకు చాలా మంచాడు. ఏమీ వ్యసనాలు కూడా లేవు. ఎప్పుడన్నా కంపెనీకోసం కాస్త డ్రింక్ చెయ్యడం పేకాడ్డం చేస్తాడుగానీ, అవన్నీ కేవలం సరదాకేతప్ప అలవాటుగా కాదు. అవైనా నీకు మరీ అసహ్యం కాబట్టి మాన్పించుకోవచ్చు. కాపోతే నీకూ - అతనికీ పడని సంగతేమన్నా వుందా అంటే అది నీ ఉద్యోగం వక్కటే. అతనేమో తనక్కాబోయే భార్య జాబ్ చెయ్యకూడదంటున్నాడు. అది కూడా జాబ్‌చేసేవాళ్ళమీద ఏదో చులకన అనికాదు- తను కష్టపడి కష్టపడి వస్తాడు. వచ్చేసరికి భార్య నవ్వుతూ ఎదురొచ్చి తన అలసటంతా పోగొట్టాలని...అంతే! ఆమాత్రం ఆశలు ఎవరికయినా వుంటాయి. ఏమో బాబూ! మీ మాస్టారు ఒప్పుకోరనేగాని ఈ పనికిమాలిన ఉద్యోగం వదిలెయ్యమంటే ఈ క్షణంలో రాజీనామా చేసేస్తా! శుభ్రంగా సంపాదించి తెచ్చిపడేస్తానంటే తినికూర్చో డానికి బాధెందుకూ?" అని సునీత తను లెక్కల మాష్టార్ని కాక డాక్టర్ గోపీనాథ్‌నే చేసుకుని ఉంటే ఈ జాబ్ చెయ్యాల్సిన బాధలేకుండా తినికూర్చునే పనికదా అని బాధపడుతున్నదాన్లా మాట్లాడసాగింది.

"నేనేమన్నా మాట్టాడితే అనవసరంగా వాగుతున్నాననుకొంటారు మీరు. కాని, నాకు ఈ గోపీనాథ్‌లాగా ఫీల్ అయ్యే వాళ్లని నరకబుద్ధేస్తుంది" అని మొదలెట్టింది వేణు.

వేణు 'నరకబుద్దేస్తుంది' అనగానే భార్యాభర్తలిద్దరూ మొఖామొఖాలు చూసుకున్నారు.

వేణు అలా మొదలెట్టి మొదలెట్టడం పావుగంట వరకూ ఆపలేదు. "భర్తగారు వెలగబెట్టకపోతే ఆ జాబ్ భార్యతోనే చేయించి, భార్య అలసిపోయి ఇంటికి రాగానే, ఏడుపు ముఖానికి నవ్వు పులుముకుని ఎదురురావచ్చుగదా" అంది.

"ఆర్థికంగా పురుషుడిమీద ఆధారపడటం మూలంగానే స్త్రీల బతుకులిలా బండలవుతున్నాయి. సంసారానిక్కావాల్సినంత నేను సంపాయిస్తాను. అతన్ని జాబ్ మానేసి ఇంట్లో కూచోమనండి-ఇప్పుడు నన్ను కూచోమన్నట్టుగా. ఉహూ...ఆడదాని సంపాదనమీద బతకడం అంటే నామోషీ...సిగ్గు. ఏం? నేనేనా...అంత సిగ్గులేనిదాన్ని? పగలంతా అతను జాబ్ చేసి తెస్తోంటే సోమరిగా, అతని హోదాలో ఒక భాగంగా, ఆ ఇంటికో అలంకారంలా, బొమ్మలా అలంకరించుకుని పడివుండడానికి నాకేనా నామోషీ లేనిది. అతని భార్యగా గుర్తింపబడడంకన్నా నాకో పరమార్థం లేనట్టు, నా బతుక్కో అర్థం లేనట్టు, ఏ వ్యక్తిత్వం లేకుండా డాక్టర్ గారి భార్యలా నేను పడుండాలన్నమాట"



అంది.

డాక్టర్ వృత్తి చాలా అద్భుతమైందే, కాని అది ఆయా వ్యక్తులమీద ఆధారపడి వుంటుందనీ...

సాధ్యమైనంత ఎక్కువ ధనం సంపాదించడానికి మొట్టమొదటి ప్రొఫెషన్ కూడా డాక్టరీనే అనీ నమ్మే హీనుల చేతిలో డాక్టర్ వృత్తి ఒక బందిపోటు వృత్తికన్నా గొప్పది కాదనీ..

అదే ప్రజల్ని రోగాల్నుంచి విముక్తుల్ని చెయ్యాలనే తపన ఉండి, ప్రజాసేవ చేసే వ్యక్తుల చేతిలోనైతే దానంత గొప్పవృత్తి మరొకటి లేదనొచ్చు గానీ...

గోపీనాథ్ మీద తనకలాంటి నమ్మకం లేదనీ... చెప్పేసింది వేణు.

అతనికి తనమీదే అభిప్రాయంవుందీ?

అదెందుకుందీ?

ఎలా ఏర్పడిందీ?

తనలో వున్న ఏ విషయానికి అతను ఆకర్షించబడ్డాడు?

ఇలా రకరకాలుగా అడిగింది వేణు.

కాని, డాక్టర్ గోపీనాథ్ ఇవన్నీ ఏం ఆలోచించలేదు. అసలు అతనికి వేణు గురించి పెద్దగా తెలియదు. ఒకటి రెండుసార్లు చూశాడు. ఆవిడ ఏదో

ఆఫీసులో ఓ మంచి హోదాలో వుందనీ, ఏవో ఆదర్శాలుండటం వల్ల పెళ్ళికాలేదనీ, కట్నం తీసుకోనివాడినే పెళ్లాడుతుందనీ తెలుసు.

చూశాడు కాబట్టి ... 'డాక్టర్‌గారి భార్య'గా హుందాగానే వుంటుందనీ ...

ఆఫీసర్ గాబట్టి అవసరమైనప్పుడు తనకి కంపెనీ ఇచ్చి విందులకూ వాటికీ సోషల్‌గా మూవ్ అవుతుందనీ...

పోస్ట్ గ్రాడ్యుయేట్ కాబట్టి రేపు పుట్టబోయే పిల్లలకి కాన్వెంటు చదువులు బాగా వస్తాయనీ...

ఇలా ఆలోచించి ఆ కొరివితో తల గోక్కుందామని చూశాడు, అసలు సంగతి తెలీక!

గోపీనాథ్ అభిప్రాయం తెలవగానే లెక్కల మాష్టారూ, సునీతా 'అబ్బ! ఈ సంబంధం భలేగా వుంటుంది" "వేణు చాలా అదృష్టవంతురాలు' అనీ అనుకున్నారు.

గోపీనాథ్ విశాల హృదయాన్ని కూడా అదే సందర్భంలో పొగిడారు.

అంతేగాని- వేణు ఆలోచనేమిటి? స్వభావం ఏమిటి? గోపీనాథ్‌కి కావల్సిందేమిటి? అని ఆలోచించలా.

అందుకే ఇప్పుడు వేణు అడిగిన ఏ ప్రశ్నకీ వాళ్ల దగ్గర జవాబు తయారుగా లేదు. కొన్ని ప్రశ్నలయితే అసలు అర్థంగాలా!

కాని వేణుకిక ఈ జన్మలో పెళ్ళి కాదనీ, వేణుకి ఏమివున్నా ఏం లేకపోయినా, విపరీతమైన గర్వం, అహం భావం వున్నాయనీ, అవి ఆవిణ్ని సర్వనాశనం చేసిగాని వదలవనీ గట్టిగా నమ్మారు.

వేణు కాస్త తేరుకున్నాక చెప్పింది -

"నాకు ఈ హోదాలమీదా, ప్రజల్ని దోచుకుని సంపాదించే డబ్బుమీదా, ఈ 'సోకాల్డ్ హైక్లాస్ సొసైటీ' మీదా సరైన అభిప్రాయం లేదు. నేను కావాలనుకునేది సరిగ్గా నాలాగా ఆలోచించే, స్పందించే మనిషిని...అంతే! అతని ఉద్యోగం, జీతం, ఆస్తి, శారీరకమైన అందం - ఇవన్నీ అంత ముఖ్యం అని నేననుకోను. అసలు మీకెందుకు శ్రమ! నాక్కావల్సిన తన్ని నేనే వెతుక్కుంటాలే! మీ ఎవరి సాయమూ అక్కర్లేదని కాదుగానీ, మీరు సాయపడలేరేమో అని...అంతే" అంది.

లెక్కల మాష్టారికి వేణులో నచ్చనిది ఈ ఉపన్యాసాలొకటి. ఈ ఉపన్యాసాల్లో ఉండే 'బహుశా' డబ్బులేని వాడూ, పైగా ఆదర్శాలున్నవాడూ... డబ్బులేకపోయినా ఆదర్శాలు కూడా లేకపోతే ఈనాటిగ్గాపోతే ముందు నాటికి కాస్త సంపాదించొచ్చు.ఆదర్శాలున్నాయా ఇక అంతే...అయినా 'వేణుకావల్సిన వ్యక్తి' అంత నచ్చడు. అయితే లెక్కల మాష్టారికి నచ్చే వ్యక్తి ఎన్నడూ వేణుకి నచ్చడనే విషయం వేణుకి తెల్సుగానీ లెక్కల మాష్టారికి తెలియదు. అసలు రహస్యం అదీ. అందువల్లే లెక్కల మాష్టారు "అబ్బ! కుర్రాడు భలేవాడు. తెగ సంపాదిస్తున్నాడు. వేణుని చేసుకుంటానంటేనా? వేణు అదృష్ట జాతకురాలే!" అనుకుంటాడే గానీ-

"వేణు చేసుకుంటానంటే వీడెంత అదృష్టజాతకుడో" అని ఏ వక్కక్షణమూ అనుకోడు.

లెక్కల మాష్టారే కాదు- 'వేణు నాకు బాగా తెల్సు' అనుకునే వేణు పరిచయ





స్తుల్లోకూడా ఎవరికీ వేణు గురించి ఏమీ తెలియదు. 'వేణూతో జీవితం పంచుకో గల్గే అదృష్టవంతుడెవరబ్బా!' అని ఒక్క క్షణం కూడా ఎవరూ అనుకోలా... అనుకోరు.

వేణు విలువ తెలవడానికి వేణు ఏ విషయాలకైతే విలువిస్తుందో ఆ విషయాల పట్ల కనీస అవగాహన, కనీస విలువా ముందు వీళ్లకి తెలియాలిగదా! వేణు విలువిచ్చే విషయాలమీదే వీళ్ళకి విలువలేదు. ఇక వేణు మీదేం విలు వుంటుంది? ఆవిడో కొరకరాని కొయ్య అనో, అహంభావనో, అమాయకురాలనో, ఊహాజీవి అనో, కలల మనిషనో, బతకటం తెలియని మనిషనో అనుకుంటారు. వాళ్ళ విలువల్నుంచి చూస్తే ఆవిడ నిజంగానే బతకడం తెలియని మనిషే. అంత కొరకరాని కొయ్యే! అంత కలల మనిషే.

దీనుల్ని చూస్తే చాలా మందికి 'అరే! పాపం!' అన్పిస్తుంది. వేణుకి అలా అన్పించడమేగాక, వాళ్లని ఆ దీనత్వం నించి రక్షించలేమా అనే ఆవేదన కల్గుతుంది. వ్యక్తిగతంగా తనకు చేతనైనంత సహాయమూ చేస్తుంది. అలా సహాయం చెయ్యడాన్ని ఒక గొప్పగా గాక అలాంటి స్థితిలో అవతలి వ్యక్తులుండటం చూసి సిగ్గుగా ఫీల్ అవుతుంది. ఇంత సుఖంగానో, ఇంత కన్వీనియంట్ గానో ఉండడానికి తమకు హక్కు లేదనుకుంటుంది.

"పక్షినయ్యేద చిన్ని ఋక్షమయ్యే
దను.
మధుపమయ్యేద చందమామనయ్యే
దను"

అని పాడుకుంటూ కలల్లో తేలిపోతుంటుంది. అంతలోనే మధ్యాన్నం ఆఫీసునుంచి వస్తోంటే చంటిబిడ్డ నెత్తుకుని సరైన బట్టలు కూడా లేక దీనాతిదీనంగా తన ముందుకొచ్చి చెయ్యి చాచిన తోటి స్త్రీ గుర్తొచ్చి హృదయం బరువెక్కిపోతుంది. అలా దిగుల్లోకెళ్ళిపోతుంది.

దేశమంతటా దీనాతిదీనంగా ఏడుస్తున్నట్టుంది అనుకుంటుంది. ఒకర్నొకరు దోచుకుంటున్నట్టుంది అనుకుంటుంది.

అందరూ జీవితంతో రాజీపడిపోతున్నారనీ,

అందుకే అన్ని బాధల్లోనూ బాధతో కూడా రాజీపడిపోయి నవ్వుతుంటారనీ...

వీళ్ళ నవ్వులు సహజంగా హృదయం లోంచి వచ్చే ఆనందానికి చిహ్నంకాదనీ,

జీవితంలో వాళ్లు పడ్డ రాజీకి నిదర్శనమనీ,

అందుకే ఆ నవ్వు అంత నిస్సారంగా, నీరసంగా వుంటుందనీ ఆలోచిస్తుంది.

తానెన్నటికీ రాజీపడకూడదని నిశ్చయించుకుంటుంది.

"జీవితంలో ఎన్నడూ 'లైఫ్ పార్టనర్'కి సంబంధించి రాజీపడను" అని ఖచ్చితంగా అనుకుంటుంది.

ఏ మనిషీ నచ్చడు! పోనీ నచ్చని మనిషితో జీవించడం ఎందుకు?

ఒంటరిగానే వుంటాను. పుస్తకాలున్నాయి. ఎప్పుడో వచ్చే ఓ మంచి సినిమా, ఎప్పుడూ వుండే పువ్వులూ... పిల్లలూ...పిట్టలూ...మంచి పుస్తకాలు రావేమో అని భయపడాల్సిన పనిలేదు. తన జీవితమంతా చదివినా అయిపోనంత అద్భుతమైన సాహిత్యం ఉండనేవుంది.

ఎప్పుడన్నా ఏ మహాబలిపురమో, ఏ కన్యాకుమారో, ఏ భీమ్లినో, ఏ అరకో, ఏ ఎల్లోరానో వెళ్తుంది.

కాని...కాని...

ఆ వెళ్ళడం తనలాంటి మరో మనిషితో కల్సివెళ్తే అనే కోర్కె పుట్టు కొస్తుంది మనసులో ఎక్కణ్నుంచో! అది ఆలోచించినకొద్దీ విశ్వమంతా తానే అయినట్టుగా వుంటుంది.

ఊహలన్నీ తారుమారవుతాయి.

మళ్ళీ ఒంటరితనం....

ఒక్కోసారి తనకే అనుమానం వస్తుంది—'జీవితంలో ఎప్పుడైనా తనకి నచ్చిన వ్యక్తి కన్పడ్తాడా?' అని..

మరోసారి 'అసలిదెంత చిన్న కోరిక ఇన్ని మంచి పుస్తకాలు ఎంతమందో చదువుతారు. ఇంత మంచి ప్రకృతిని ఎంత మందో చూస్తారు. ఇష్టపడ్తారు. లోకం నిండా ఎన్నో మంచి సంగతులుంటే – అన్నిటికీ అందరూ అంధులెందుకవుతారు? లేదు.

8



తనలా ఆలోచించేవాళ్లు...

తనలా కలలుగనేవాళ్లు...

తనలా కోరుకునేవాళ్లు...

కొన్ని లక్షల మందుంటారు. ఎందాకో ఎందుకూ? ఈ హైదరాబాదులోనే ఎంత మందో తనలాంటివాళ్లుండి వుంటారు. వాళ్ళలో ఒక్కరు తనకి పరిచయం అయితేచాలు. పరిచయం అయ్యేవరకే సమస్య. పరిచయం అయ్యిందీ అంటే ఇక తామిద్దర్నీ ఎవరూ విడదియ్యలేరు' అనుకుని తనలోతనే నవ్వుకుంటుంది.

*

"మొన్న నువ్వు 'పాతాళభైరవి' సినిమాకెళ్లావంటగా" అన్నాడు శేఖరం.

"అవును" అంది వేణు.

"ఎవరితో" అన్నాడు ఇష్టం లేనట్టుగా.

"ఏం...ఎవరితో వెళ్తే ఏమిటి?" అంది వేణు.

తనమీదేదో అధికారం చలాయించే పద్ధతిలో ప్రశ్న వేసేవాళ్లంటే వేణుకి పడదు.

"మా రాముడు చూశాడంట. నువ్వెవరితోనో కల్సి సినిమా కొచ్చావని! ఎంత వెటకారంగా మాట్లాడాడో తెలుసా" అన్నాడు శేఖరం.

అంతవరకూ చేస్తున్న పని ఆపేసింది వేణు. తీక్షణంగా శేఖరం వంక చూస్తూ–

"నీ ఉద్దేశం ఏమిటి?" అంది.

"నా ఉద్దేశం ఏమిటి? మా రాముడు.."

"శేఖరం...అనవసరంగా రాముణ్ని లాక్కురామాక. నీ ఉద్దేశం ఏమిటో సూటిగా చెప్పు" అంది వేణు.

"నా ఉద్దేశం ఏమిటి....?"

"నీ ఉద్దేశం ఏమిటో కూడా నీకు తెలియడం లేదా? అయితే నేను చెప్తావిను. నేను ఎవరితోనన్నా ఏ సినిమా కన్నా వెళ్తే ఎవరో చూస్తారు, ఏమిటో కూస్తారు. ఆ కూతలు నువ్వు భరించలేవు. కాబట్టి నేను ఎవరితోనూ సినిమాకో, షికారుకో వెళ్లకూడదు... అంతేగా!"

"అంటే నన్నంత సంకుచితుణ్నను కుంటున్నావన్న మాట"

"అన్నమాటేమిటి? అన్నమాట! మరి కాకపోతే నీ ఉద్దేశం చెప్పు. మొన్న నేనూ,వెంకటప్పయ్యగారూ కల్సి సినిమా




కెళ్లాం. మీ రాముడు చూశాడు. నీ దగ్గర ఏదేదో కూశాడు. మరి మనిద్దరం అంతకు ముందు మధుమతికెళ్లాం. అప్పుడు కూడా మరో భీముడెవరో చూసే వుండివుంటాడు. వాడూ ఎంతమంది దగ్గరో ఏవేవో కూతలు కూసి వుంటాడు...అయితే... అవన్నీ-వీళ్ల కూతలన్నీ ఎవరిక్కావాలి? ఎవరు పట్టించుకుంటారు? ఎందుకు పట్టించుకోవాలి? కాదూ... పట్టించుకుందాం.... నేనిక ఎవరితోనూ కల్సి సినిమాకెళ్లగూడదు, ఎవరితోనూ కల్సి షికారుకెళ్లగూడదు, ఎవరితోనూ కల్సి కూర్చుని మాట్లాడగూడదు, అసలెవర్తోనూ కలవగూడదు, మాట్లాడగూడదు. సాహిత్యం గురించో, సంగీతం గురించో, లోకం పోకడల గురించో, మంచో చెడ్డో మాట్లాడే పనిలేదు...నేను ఎవరి వంక చూడకూడదు—నా కళ్లకి గంతలు. నేనెవరితో మాట్లాడగూడదు-నానోటికి తాళం. నేను అన్నం తినొచ్చా? నేను గాలి పీలవొచ్చా?" చాలా ఆవేశంగా అంది వేణు.

"అది కాదు వేణూ! ఎందుకంత ఆవేశపడ్తావ్. మా రాముడూ..."

"శేఖరం! రాముడి సంగతెత్తకన్నా నా. నాకిప్పుడు ముప్పై ఒక్క సంవత్సరాలు. ఈ హైద్రాబాద్‌లో దాదాపు పన్నెండేళ్ల నుంచీ ఉంటున్నా. దాదాపు ఏడెనిమిదేళ్లుగా జాబ్ చేస్తున్నా. రకరకాల స్నేహితుల్తో... పోనీ స్నేహితులమనుకునే వాళ్లతో కల్సి సినిమాలకెళ్లాను ... షికార్లకెళ్లాను. నేను చేసే పనిలో మంచుందో, చెడుందో నేను నిర్ణయించుకోగలను. నా బాగోగులు నా ఇష్టానిష్టాలు నాకు తెలుసు. నన్ను గురించి ఎంత మంది హీనులు, నీచులు ఎంతెంత నీచంగా అనుకుంటారో నేను కొంత ఊహించగలను...కొంత తెలుసు. వాళ్ళని లెక్క చెయ్యాల్సినవసరం నాకు లేదు. నాతో స్నేహం చెయ్యడం వలన నీకు అవమానంగా వుంటే నిన్నిక్కడ ఎవరూ బలవంతంగా పట్టి ఆపరు. నీ ఇష్టం వచ్చినట్టు నువ్వుండొచ్చు. కాని నా మీద నువ్వు అధికారం చెలాయించొద్దు. లోకుల్ని కేర్ చెయ్యాల్సినవసరం నాకు లేదు. నా మనసుకి నేను సమాధానం చెప్పుకోగల్గితే నాకు చాలు. నా ఆత్మకి విరుద్ధంగా, నా ఆత్మాభిమానాన్ని పోగొట్టుకుని నేనెప్పుడూ ప్రవర్తించను...అది నాకు తెలుసు" అంది వేణు.

"మరీ అంత లెక్కలేకుండా ఉంటే మంచిది కాదనే గాని...నాకెందుకొచ్చిన గోల"

"నేనొక ప్రశ్నడుగుతాను చెప్పు. మీ రాముడు నీతో నేను సినిమాకొస్తే మంచిగా అర్థంచేసుకుంటాడా?"

శేఖరం మాట్లాడలేదు. అతనికి తెలుసు. రాముడు తనతోనే కాదు — వేణు తన అన్నతో సినిమాకెళ్ళినా అపార్థమే చేసుకుంటాడు. అన్నని తెలవక కాదు - అన్నతో వెళ్లడమేమిటి? అన్నాచెల్లెళ్ళకూడా నీతీ, అవినీతీ లేకుండాపోయినయ్-అని ప్రచారం చేసేంత నీచుడే.

అందుకే మాట్లాడకుండా ఊరుకున్నాడు.

అంటే నీతో నేను అపనిందలుపడినా ఫర్లా! కాని మరొకతనితో కల్సి పదగూడదు కదూ? ఎందుకనీ?"

శేఖరం మాట్లాడలేదు.

నెమ్మదిగా వేణు కాస్త శాంతపడింది.

"శేఖరం నా ప్రవర్తన గురించి లోకులేదో అనుకుంటారని నన్ను దిద్ద

డానికి ప్రయత్నించకు. అది మన స్నేహాన్నే దెబ్బతీస్తుంది"

శేఖరానికి వేణు మీద అధికారం చెలాయించడానికి తనకేమీ హక్కులేదని తెల్సింది. స్నేహం...అంటే స్నేహమే.. భార్యాభర్తలయితే భర్తకు హక్కుంటుంది. స్నేహంలో హక్కుల ప్రసక్తి రాదు. ఇష్టం వున్నన్నాళ్ళూ చేస్తారు. లేపోతే ఎవరిదారినవాళ్ళు పోతారు– రైలు దిగిన మనుషుల్లాగా తలో దిక్కుకీ.

కాని వేణు ఇన్నాళ్ళు పెళ్ళి చేసుకోనిదే అందుకు... హక్కుల భర్త వద్దనే! తన భర్త తనకి ప్రియమైన స్నేహితుడుగా తనకి ప్రియాతి ప్రియమైన ప్రియుడిగా వుండాలేగానీ.... అధికారిగా కాదు.

ఆమధ్యెక్కడో ఓ పోస్టర్ చూసింది వేణు. ఆఫీసు కుర్చీలో ఓ చింపాంజీ కళ్ళజోడెట్టుకుని కూర్చుని పైపు తాగుతూంటుంది. 'బాస్ ఈజ్ ఆల్వేస్ రైట్' అని రాసుంటుంది.

'అలానే చింపాంజీల్లాంటి బుద్ధుల్లో... భర్త్రాధికారుల చేతికింద ఆత్మాభిమానం లేని భార్య గుమాస్తాలా పడివుండకూడదనే వేణు ముప్పైఒక్క ఏళ్లొచ్చినా 'సరైనవ్యక్తి' 'సరైనవ్యక్తి' అని ఎదురు చూడటం...

"తెల్సినవాళ్లు రకరకాలుగా అనుకుంటారనే గాని ... వెంకటప్పయ్యతో నువ్వు సినిమాకెళ్ళినందుకు నేనేదో జెలసీ ఫీల్ అవుతున్నాననుకోమాక" అన్నాడు శేఖరం నెమ్మదిగా.

వేణు తలెత్తి శేఖరం వంక చూసి చిన్నగా నవ్వింది.

"శేఖరం! నువ్వు జెలసీ ఫీల్ అయితే దానికొక్కస్త అర్థమైనా ఉంటుంది. అర్థమున్నా లేకపోయినా కనీసం నేనర్థం చేసుకోగల్ను. కాని తెల్సినవాళ్లు రకరకాలుగా అంటున్నావే... అదిప్పుడే తెల్సిందా నీకూ? అంటున్నాను. నీతో సినిమాకొచ్చేప్పుడు కూడా నువ్వది ఆలోచించాలిగదా? వెంకటప్పయ్యగారిలానే నువ్వు నాకు ఒక ఫ్రండువి... అంతేగా. కాకపోతే కాస్త ముందు పరిచయమైనవాడివి..."

"అందరూ నాలానే ఉంటారా..."

"అంటే? నువ్విప్పుడు ఒక సమస్యనొదిలి మరో సమస్యలోకెళ్తున్నావ్. లోకం సంగతి వదిలేశావ్. వెంకటప్పయ్యగారు నీలా ప్రవర్తించడేమోనని అనుమానం వ్యక్తం చేస్తున్నావ్. నాతో వచ్చేవాళ్ళ ప్రవర్తన గురించి శ్రద్ధతీసుకోవల్సింది నేను. నేను ఎవరితో వెళ్తున్నానో వాళ్లు ఎటువంటివాళ్ళో తెల్సుకోవాల్సింది నేను"

"వాళ్లు ప్రవర్తించేవరకూ తెలియదు.. వాళ్ళెలా ప్రవర్తిస్తారో?"

"అవును. కొన్నిసందర్భాల్లో నిజమే. ఏం చేస్తారు? సినిమా చూస్తుండగా పొరపాటుగా పడ్డట్టు చేతిమీద చెయ్యి వేస్తారు. అది నిజంగా పొరపాటుగా పడిందో, కావాలనే పొరపాటుగా పడిందో తెల్సుకోలేనంత దద్దమ్మను కాదుగా. అసలది నాకు మంచి ఛాన్సు–ఆ ఫ్రండుతో స్నేహం చెయ్యొచ్చో, వెంటనే ఆపాలో తెల్సుకోడానికి. శేఖరం ... ఈ గోలంతా నీకెందుకు చెప్పు. అదంతా కేవలం నా పర్సనల్ ఎఫైర్. సిల్లీగా ఆర్గ్యూ చెయ్యకు" అంది వేణు.

ఏం మాట్లాడాలో తెలియక తెల్ల మొహంతో కూర్చున్నాడు శేఖరం.

అతని మనసులో వున్న ప్రకారం




వేణు తన సంరక్షణలో వుంది. కాని ఆవిడ ఆ మాట ఒప్పుకోదు. దానికి ఋజువు లేదు. ఏంచేస్తాడు?



# 9

వేణు రూంనుంచి బైల్దేరి నడుస్తున్నాడు శేఖరం. అతని బుర్రనిండా ఎందుకో ఎవరి మీదో కోపం ... కోపం...

చాలాసార్లు ఆలోచించాడు- వేణుని తను పెళ్ళిచేసుకుంటే ఎలా వుంటుందీ అని. మొదట్లో ఆ ఆలోచన రావడమే చాలా సంతోషాన్నిచ్చింది. తర్వాత్తర్వాత రోజులు గడుస్తున్నకొద్దీ వేణు మాట్లాడే మాటలు, ఆవిడ నమ్మే భావాలూ, ఒక్కోసారి ఆచరణా, అన్నీ వేణుని తనునుంచి దూరం చేస్తున్నట్టుగా ఫీల్ అవుతున్నాడు.

ఒక్కోసారి ఆవిడ చెప్పే సమాధానాలు ఒళ్లు మండేట్టుంటాయి.

ఒక్కోసారి ఆమె ప్రవర్తన, చక్కగా మాట్లాడ్డమూ, అభిమానంగా చూడటం, మేం ఆడాళ్లం, మీరు మగాళ్లు అన్నట్టుగాక సోషల్‌గా వుండటం- అవన్నీ తల్చుకుంటూంటే ఆవిణ్ని పెళ్ళిచేసుకోవాలనీ, తర్వాత తనే మార్చుకుంటుందనీ ఆలోచిస్తాడు.

ఇప్పుడైతే అతని అహం దెబ్బతింది. "నీతో సినిమాకి రావటంలేదా? వేరే వాళ్లతో వెళ్లడానికీ,నీతో వెళ్లడానికీ తేడా ఏమిటి?" అంది వేణు.

నిజంగా చూస్తే అంతే... కాని అదే నిజం కాదనిపిస్తుంది. వేణుని పెళ్లాడి వుంటే తనకామెమీద ఏమన్నా అధికారం వుండేదేమో! అదీ అనుమానమే. అసలు రేపు పెళ్లీ గిళ్లీ ఏమన్నా అయితే అప్పుడు కూడా వేరేవాళ్లతో సినిమా కెళ్ళినంత మాత్రాన నా పాతివ్రత్యానికేం భంగం కలగదులే - అంటుందేమో! అంటుందేమో ఏమిటి... అంటుంది... తప్పకుండా అంటుంది. వేణు అంతా బాగానే వుంటుంది గానీ ఈ ఆడా మగా తేడాలేదనడం అందరూ, ఒకేదేననడం, ఈ స్నేహాలు, ఈ ఆర్గ్యుమెంట్స్- ఇవి లేక పోతే నా? అనుకుంటున్నాడు శేఖరం.

సరిగ్గా అప్పుడే-

వేణుగారు ఎంత అద్భుతంగా ఆర్గ్యూ చేస్తారూ! ఎంత చక్కగా ఆలోచిస్తారూ! ఎంత బలమైన వ్యక్తిత్వం ఆమెది! ఎంత మంచి అభిరుచులున్నాయి - ఇలా ఆలోచిస్తూ ఆటే వచ్చాడు వెంకటప్పయ్య. వేణు ఇంటికొస్తూ శేఖరానికి ఎదురు పడ్డాడతను.

వెంకటప్పయ్యని చూడగానే పాతాళ భైరవి గుర్తొచ్చింది శేఖరానికి.

"ఎలావుంది పాతాళ భైరవి?" అన్నాడు శేఖరం అనుకోకుండానే.

ఆ ప్రశ్న అంత అకస్మాత్తుగా వస్తుందని అనుకోని వెంకటప్పయ్య కాస్త తడుముకుని "బాగుంది....చాలా బాగుంటుంది. నేనింతకుముందు రెండు మూడుసార్లు చూశా" అన్నాడు.

"ఊ! ఎక్కడికీ ఇటెళ్తున్నావ్?"

"మీ రూంకెళ్దామనుకున్నా గానీ

మీరు ఇదే వచ్చుంటారేమోనని నేనూ ఇదే వస్తున్నా! వేణూగారింటికి" అన్నాడు.

"వేణు లేదు. నేనక్కణ్ణుంచే వస్తున్నా. పద..మా రూంకి పోదాం" అని వెంకటప్పయ్యని తీసుకుని తన రూంకి చేరాడు శేఖరం.

రూంలో కూర్చున్నాక కాస్తాగి "నీకో విషయం చెప్దామనుకుంటున్నా ... నీ అభిప్రాయం చెప్పు'' అన్నాడు శేఖరం.

"చెప్పండి.... ఏమిటి?"



"నేనూ, వేణూ పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాం" అని వెంకటప్పయ్య మొహంలోకి చూశాడు శేఖరం.

వెంకటప్పయ్య చూపు మరల్చుకుని ఆలోచనలో పడ్డాడు.

"చెప్పు''

"మీ ఇద్దరూ అనుకుంటే... నేను చెప్పడానికేం వుంది?" అన్నాడు నెమ్మదిగా వెంకటప్పయ్య.

"అలా కాదు... మేం ఇద్దరం పెళ్ళి చేసుకుంటే ఎలా వుంటుంది...? అదీ నన్నడిగేది"

వెంకటప్పయ్య మాట్లాడలా.

శేఖరం కాస్తాగి మళ్లీ "నీ అభిప్రాయం చెప్పు" అన్నాడు.

"అది మీరిద్దరూ మాటాడుకుంటే బాగుంటుందేమో... ముఖ్యంగా పెళ్ళి విషయంలో ఎవర్నీ సలహా అడగ కూడదు. అది ఎవరికి వాళ్లు ఆలోచించి నిర్ణయించుకోవాలని నా అభిప్రాయం"

"అది సర్లేవోయ్! నేనూ ఆలోచించే నిర్ణయించుకుంటాను. అదికాదు నేననేది. మేం ఇద్దరం నీకు తెలుసుగదా! నిర్మొహమాటంగా చెప్పు. మేమిద్దరం సుఖంగా ఉండగలమంటావా?"

"చెప్పాలంటే... మీ ఇద్దరూ నాకంత బాగా తెలవదేమోనని నా అభిప్రాయం. అందువల్ల నేనీ విషయం ఆలోచించలేను. కానీ ... మీకు వేణుగారితో బాగా పరిచయం వుందిగదా! మీరు సరిగ్గా ఆలోచించుకుంటే మీకే తెలుస్తుంది. ఆవిడతో అన్నారా ఎప్పుడన్నా?"

"అనలేదనుకో. కానీ ఇద్దరికీ తెల్సు"

"అలా గాకుండా స్పష్టంగా మాట్లాడుకుంటేనే బాగుంటుందేమో" అన్నాడు.

"అవును. మాట్లాడుకుని డేట్ ఫిక్స్ చేసుకోవాలనే వుంది..." ఆలోచనగా అన్నాడు శేఖరం.

వెంకటప్పయ్య మరికాసేపు కూర్చుని "వెళ్తానండీ" అని లేచాడు.

"వెళ్దూగానిలే... ఏంచేస్తావు? ఆదివార మేగా. మీ అన్నయ్య దగ్గర్నుంచేమన్నా ఉత్తరాలొస్తున్నాయా? ఏమంటున్నాడు?"

"మా అన్నయ్య ఉత్తరాలు రాయ దండీ. మీకు తెలిసే వుంటుందిగా...రైటింగ్ బాగుండదనీ అసలు లెటర్లే రాయడు. ఎప్పుడన్నా నేనే రాస్తుంటా. మరీ అర్జం టయితే రెండుముక్కలు రాస్తాడు. 'రేపాది వారం ఇక్కడికిరా', 'పదో తారీఖున నేనొస్తున్నా ఎక్కడికీ వెళ్ళకు' అనో అంతే!"

"అంతకన్నా ఓ చాట భారతం రాయడం మాత్రం ఎందుకులే గానీ... ఎంతొస్తోంది మీ అన్నకి...?" అన్నాడు శేఖరం.

"సరిగ్గా తెలవదండీ...ఓ వెయ్యిపైనే" అని కాసేపు కూర్చున్నాక "పోయినాది వారం వేణుగారింటికి మీరొస్తారను కున్నానండీ" అన్నాడు.

"ఊఁ". అని ముభావంగా అన్నాడు. కాసేపాగి, "నాకు ఆరోజు కనపడక ముందు ప్రతి ఆదివారం నువ్వేం చేసే వాడివి?" అన్నాడు.

"బట్టలన్నీ ఉతుక్కుని... వంట చేసుకుని తిని... ఎవరితోనన్నా ఏ దన్నా మంచి సినిమా వుంటే వెళ్ళటం... లేకపోతే ఎటన్నా వెళ్ళడం..."

"ఎటన్నా అంటే?"

"నాకు బి.హెచ్.ఇ.యల్.,లో 'అయ్.డి.పి.యల్.లో మంచి ఫ్రండ్సున్నారు. వాళ్ళిళ్ళకెళ్లి వాళ్ళ పిల్లల్తో సర్దాగా గడ పడం, లేకపోతే ఏ పబ్లిగ్గార్డెన్స్‌కో, నౌబత్ పహాడ్‌కో పోవడం, ఆబిడ్స్‌లో, కోఠీలో సెకెండ్ హాండ్ బుక్స్ చూసి ఏమన్నా మంచివుంటే కొనుక్కోడం...ఇట్లా..."

"మరిప్పుడవేమీ చేస్తున్నట్టులేవే?"

"ఎందుకు చెయ్యడంలా! వాటితో పాటు ఇటుకూడా వస్తున్నానంతే! బట్టలైతే శనివారం రాత్రిపూట వుతికేస్తున్నా!"

"ఇప్పుడెక్కడికెళ్తావు?"

"వేణుగారు లేరంటున్నారుగా... ఆఁ ఁడ నాకు ఓ పుస్తకం ఇస్తానన్నారు. సరే...ఏం చేస్తాం? ఎటన్నా వెళ్తా..." అని లేచాడు వెంకటప్పయ్య.




మలుపు తిరిగే వరకూ వెంకటప్పయ్యనే చూస్తూ నిలబడ్డాడు శేఖరం.

వెంకటప్పయ్య కాస్త దూరం నడచి ఆగాడు. 'వేణుగారొకవేళ వచ్చారేమో' అన్పించి ఆవిడ రూంకి రూట్ మార్చాడు

వెంకటప్పయ్యని చూడగానే వేణు కళ్ళల్లోకి వింత కాంతి మొఖం మీదికి సంతోషంతోపాటే వచ్చింది.

వెంకటప్పయ్య కూడా చాలా సంతోషంగా అన్నాడు—"అమ్మయ్యా...వచ్చారన్నమాట!"

"అదేమిటి? నా డైలాగ్ మీరు కాపీ కొడ్తున్నారు? నే నెక్కడి కెళ్ళాను?" అంది వేణు.

"మీరిందాక రూంలో లేరటగదా! శేఖరంగారన్నారు"

"ఎప్పుడు?"

"ఓ గంటవుతోంది. నేనిటు వస్తోంటే శేఖరంగారు మీ రూంనుంచి వస్తూ నా కెదురయ్యి మీరు లేరని నన్ను తనతో తీసుకెళ్ళారు. నేసలు అటొచ్చి అటే వెళ్ళాల్సింది. మీరొకవేళ వచ్చుంటారేమోనని వచ్చాను"

"మంచిపని చేశారు" అంది వేణు—మనసులో శేఖరాన్ని అసహ్యించుకుంటూ. మనుషులకి ఇంతింత జెలసీలెందుకుంటాయో ఆమెకర్థంకావడంలా. సంపాదనలోనో, ఉద్యోగాల్లోనో, అధికారాల్లోనో, పదవుల్లోనో, జెలసీలని అర్థం చేసుకోవచ్చుగానీ,

మానవత్వానికి, స్నేహానికి సంబంధించిన ఉన్నతమైన విషయాలకి కూడా నీచమైన జెలసీలేమిటి?

"మీరు నాకు పుస్తకం ఇస్తానన్నారు"

"అందుకని వచ్చారన్నమాట."

"ఛ! అది కాదు..." అని వూరుకున్నాడు.

...ణు వెంకటప్పయ్యనీ, అతను ఇబ్బంది పడటాన్నీ చూసి నవ్వుకుంది.




శేఖరం వస్తూనే "నీతో మాట్లాడాలి" అన్నాడు.

వేణు అతని మొహంలోకి చూసింది. అతనేదో ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా వున్నాడు.

వేణుకి తెల్సింది అతను మారేజి ప్రపోజల్స్ పెడ్తున్నాడని. కాస్త ఆశ్చర్యపోయింది కూడా. శేఖరం అప్పారావులాంటి అజ్ఞానో అధముడో కాదు.

డాక్టర్ గోపీనాథ్ లాంటి అహంభావో, గర్విష్ఠో కాదు.

లెక్కల మాష్టారిలాంటి లెక్కల మనిషీ కాదు—

కాని...

శేఖరం మళ్ళీ అన్నాడు "నీతో మాట్లాడాలి కూర్చో"

వేణు నెమ్మదిగా నవ్వి—"నాతో ఎప్పుడూ మాట్లాడుతూనే వున్నావుగా శేఖరం...ఇప్పుడు కొత్తగా ఏముంది? మాట్లాడు..." అంది.

"అలాకాదు. ఒక సీరియస్ విషయం" అన్నాడు సీరియస్ అయిపోయి.

వేణు ఆలోచించి నిదానంగా అంది "నీకు సాయంత్రం ఏమన్నా పనుందా?"

"ఏమీ లేదు"

"అయితే సాయంత్రం మాట్లాడు కుందాంలే. ఇప్పుడు నా మూడ్ అంత బాగోలా. కాస్త తలనెప్పిగా కూడా వుంది" అంది.

"అయితే సరే" లేచాడు.

"ఏం...వెళ్తున్నావ్? కూర్చో...టీ తాగెళ్దువు"

"వద్దులే. ఇంతకుముందే తాగా! సాయంత్రం నాలుగింటికొస్తా అయితే"

"ఇక్కడికొద్దులే యూనివర్సిటీకిరా. లాండ్‌స్కేప్ గార్డెన్స్‌లో వుంటా ... నాలుగున్నరా అట్లా"

"సరే" అని వెళ్ళిపోయాడు శేఖరం.

వేణు వెంటనే మంచంమీద పడుకుని ఆలోచనల్లో పడిపోయింది.

"నాలుగున్నరకని చెప్పిందేగాని మూడున్నరకల్లా గార్డెన్స్‌కొచ్చేసి, మెయిన్ గేటు తనకి కనపడేట్లుగా కూర్చుని చుట్టూ చూసింది. దూరంగా ఠాగూర్ ఆడిటోరియం....దానికి సరిగ్గా ఎదురుగా దూరంగా లైబ్రరీ.

వేణుకి ఈ ఆడిటోరియం అన్నా, ఆ లైబ్రరీ అన్నా ఎంతభిమానమో, ఎంత ఇష్టమో! ఈ ఆడిటోరియంలోనే వేణు సత్యజిత్‌రాయ్ పిక్చర్లు చాలా చూసింది-ఫిలిం క్లబ్‌వాళ్లు వేసినపుడు. ఇక ఆ లైబ్రరీ అంటే చెప్పలేనంత పిచ్చి ప్రేమ.దాన్నిండా ఎంతెంత అద్భుతమైన పుస్తకాలున్నాయో. ఈ రెండిటికీ మధ్య గార్డెన్స్... ఈ గార్డెన్ కూడా చాలా ఇష్టం వేణుకి. ఈ చెట్లూ,పూలమొక్కలూ పూలూ...వారానికోసారైనా యూనివర్సిటీ పరిసరాల్లో ఓ రెండు గంటలు గడిపితే ఆ వారం అంతా ఏ దిగులూ లేకుండా ఉండచ్చనిపిస్తుంది.మనసంతా ఆహ్లాదంతో నిండిపోతుంది.

వేణు మనసు వేణు మనసుని హెచ్చరించింది-"ఆహ్లాదం సంగతి సరే. శేఖరం వస్తాడు...ఏం చెబుతావ్." అని.

వేణుకొంచెం కాస్త దిగులనిపించింది. 'చెప్పడానికేం వుంది. ఎలా 'చెప్పడం' అనేదే ఆలోచించాలి' అనుకుంది.

శేఖరం మనకు రోజూ కనపడే చాలామంది మగవాళ్లకన్నా చాలా మంచివాడే.

అతనికి కట్నం తీసుకోడం ఇష్టం వుండదు.

ఆడవాళ్లంటే కాస్త మంచి అభిప్రాయం వుంది.

ఎక్కువగా కాకపోయినా తెలుగు సాహిత్యాన్ని గురించి కాస్త మాట్లాడగలడు.

'మరింకేమిటోయ్ నీ అభ్యంతరం' అనుకుని నవ్వుకుంది వేణు.

నాలుగయిదేళ్ల క్రితం ఇతను కన్పడివుంటే బహుశా ఇష్టపడి వుండేదేమో.

మరి? ఇప్పుడేమన్నా కొమ్ములు మొలిచాయా? మళ్లీ నవ్వుకుంది వేణు.

కొమ్ములు మొలవడం కాదుగానీ ఉన్న అభిప్రాయాలు బలిశాయి.

వేణుకిసారి బాగా పైకే నవ్వొచ్చింది. ఒకటి మాత్రం నిజం -

శేఖరం లాగానైనా వుండే మగాళ్ల నూటికి ఒక్కడు కూడా లేడు.

మరి నీకు కావల్సినవాడెవడు తల్లీ ...?

లక్షకో కోటికో ఒక్కడు అంది వేణు.

ఈ జన్మలో దొరుకుతాడని నమ్మకం వుందా?

కళ్లు మూసి తలూపింది.

తప్పక దొరుకుతాడు.

దొరక్కపోతే పోనీగాని దొరకడని రాజీపడను.





శేఖరంలో లోపాలేమిటి?

లోపాల్దేముందిలే. అందర్లో నూ వుండొచ్చు. నాలో ఎన్ని లోపాలు? నాలో నచ్చని విషయాలు ఎంతమందికి ఎన్నెన్నో వున్నాయి. అతను లోప భూయిష్టుడనీ, నేను లోపరహితననీ కాదు గదా! అతనికీ, నాకూ చాలా విషయాల్లో పడదు. మొన్న చూడలా...

అంతలో శేఖరం వస్తూ కనపడ్డాడు. టైం చూసింది...4.35.

పాపం...ఏ బస్సో లేటయుంటుంది.

వేణుకి దగ్గర్లో కూర్చుంటూ "ఎంత సేపయింది వచ్చి?" అన్నాడు.

"గంట"

"నాలుగున్నరకి రమ్మన్నావుగదూ"

"అవునులే. ఖంగారుపడకు" నవ్వింది.

"వేణూ!" అన్నాడు శేఖరం. అతని కంఠంలో కాస్త మార్పు.

వేణు అతనివంక చూసింది.

అతను మాట్లాడకుండా వూరుకున్నాడు.

"చెప్పు" అంది వేణు.

"నీకూ తెల్సు. అయినా..."

"ఏ విషయం?"

"మా రేజి విషయం"

"మీవాళ్ళు మళ్ళీ గొడవ చేస్తున్నారా?"

"మావాళ్ళ గొడవ సర్లే. అదెప్పుడూ వుండేదే. అసలు విషయం అదికాదు..."

"మరి ఏమిటి అసలు విషయం?"

"మనిద్దరం ఒకమాట అనుకుంచే..." అని ఆగాడు శేఖరం.

వేణు మనసు ఎంత వద్దనుకున్నా భారంగా అయిపోయింది.

కాస్త మౌనం తర్వాత-

"శేఖరం" అని ఆగింది వేణు.

శేఖరం ఆతృతగా చూస్తున్నాడు. తన బాధ వదిలిపోయిందన్నట్లుంది అతని వ్యవహారం.

వేణు అవసరంలేకపోయిన తల సవరించుకుంది. మొహం తుడుచుకుంది.

"శేఖరం! నువ్వు మన విషయం సరిగ్గా ఆలోచించలేదన్పిస్తోంది" అంది వేణు.

"లేదు. నేను బాగానే ఆలోచించాను"

"నువ్వు బాగా ఆలోచిస్తే ఈ నిర్ణయానికి వచ్చుండేవాడివికాదు"

"ఎందుకనీ?"

"ఎందుకనీ అంటే నాకు స్పష్టంగానే కారణాలు కన్పడ్తున్నాయి. కాని నేను ముందే చెప్తున్నాను. జాగ్రత్తగా విను. మనిద్దరికీ స్వభావాల్లో తేడాలున్నాయి. స్వభావాల్లోనే కాదు – ఆలోచనల్లోనూ, విలువల్లోనూ కూడా స్పష్టమైన తేడాలున్నాయి. మన ఇష్టాల్లో కూడా చాలా తేడాలున్నాయి. నేను గమనించాను. అవన్నీ చాలా బహిరంగంగానే మన ముందుకొచ్చాయి. అంటే నీ వాల్యూస్ తక్కువనో, నా వాల్యూస్ ఎక్కువనో, నావి మంచి టేస్ట్‌లనో, నీవి కాదనో అర్థం చేసుకోకు. నిర్మొహమాటంగాచెప్పాలంటే ఎవరి ఆలోచనలూ, అభిరుచులూ, ఇష్టాలూ వాళ్ళకి మంచిగా కన్పడ్తాయి కాబట్టి నీవి నీకూ, నావి నాకూ గొప్పవి. అయితే అవి విడివిడిగా వుండక..."

"ఇన్ని మాటలెందుకు? నేను నిన్ను పెళ్లాడ్డానికర్హుణ్ని కాదని చెప్పు. స్పష్టంగా అర్థమవుతుందిగదా!" అన్నాడు ఆవేశంగా. అతని ముఖంలో ఓడిపోయిన గుర్తులు.

"నువ్వలా మాట్లాడ్తే నేను మాట్లాడ్డానికేమీ ఉండదు" అంది బాధగా వేణు.

"అవన్నీ అనవసరం. నీ అభిరుచికీ,

నా అభిరుచికీ వున్న తేడాలేం గమనిం చవు నువ్వు?"

"ఎందుకంత నిలదీసి అడుగుతున్నావు. నీకూ తెలిసిన సంగతులే. ఉదాహరణకి 'కోశిష్' సినిమా చూస్తుంటే నాకెంత దుఃఖం వచ్చిందో. సరిగ్గా అప్పుడే నువ్వు మహా వెకిలిగా నవ్వావు.. గుర్తుందా? అదొక్కటి చాలు – మనిద్దరి మధ్యా అంతులేని అగాధం ఉందని చెప్పడానికి"

"మన వాల్యూస్‌లో వున్న తేడా లేమిటి?"

"నేను నీతో సినిమాకి రావచ్చుగాని మరొకతన్తో వెళ్ళగూడదు. జనం ఏమన్నా అనుకుంటారు. ఎక్కువ చదివిన ఆడపిల్ల నీ మాట వినదు"

"ఆ అభిప్రాయం నాదికాదు. అదే అయితే నాకన్నా నువ్వే ఎక్కువ చదివావు. నీకు తెలవదేమో! ఇక సినిమా అంటే నీ శ్రేయోభిలాషిగా అన్నానే కాని...."

"సంజాయిషీలు చెప్పొద్దు. ప్రతి కామెంట్ వెనుకా మన స్వభావాలు బైట పడ్తాయ్. నీ స్వభావాన్ని కించపర్చడం కాదు నా ఉద్దేశం. మనిద్దరికీ పడదని చెప్పడమే"

"అయితే... లోకంలో భార్యాభర్తలందరూ వారి వారి స్వభావాలకి సరిపడిన వాళ్ళేనా?"

"అసలు ఈ భార్యాభర్తలందరూ ఎందుకింతలా నిత్యం పోట్లాటల్లో ఒకర్నొకరు హింసించుకుంటూ తమ బతుకుల్ని నరకం చేసుకుంటున్నారో తెలుసా?

ఇద్దరికి 'పెళ్ళి' అనేది వారి స్వభావాలమీద ఆధారపడో, వారి దేస్టుల కనుకూలంగానో నిర్ణయింపబడదు.

అమ్మాయి డబ్బుకి, అబ్బాయి ఆశకి టాలీ అయితే చాలు.

ఎంతకాలం ఇద్దరి స్వభావాలూ, టెంపరమెంట్స్, ఆశలూ, ఆశయాలూ చూడక, డబ్బూ, కులమూ, తాతముత్తాతల వంశ గౌరవాలూ, ఉద్యోగావకాశాలూ, బంధుత్వాలూ చూసి పెళ్ళిళ్ళు జరుగుతాయో, అంతకాలం ఎంత మంచి మనుషులయినా ఈ పెళ్ళి రొంపిలోపడితే ఇక అంతే. ఇదొక ఊబి. నెమ్మది నెమ్మదిగా అది ఎటువంటివాళ్లనీ మింగేస్తుంది నిర్దాక్షిణ్యంగా...

మనమూ అలానే అవుదామనా నీ ఉద్దేశం. దానికి నువ్వు తయారుగావున్నా నేను సిద్ధంగా లేను. అయినా అదేం ప్రశ్న? లోకంలో అందరు భార్యాభర్తల్లానే ఉండాలని నేను అనుకోవడంలేదే? అలా అనుకుంటే ఇన్నేళ్ల ఇలా ఎందుకుండటం...?"

"అయితే నీ కలల పీపుడు కన పడ్డాడా?" అన్నాడు అక్కసుగా.

వేణు అతనివంక ఒకరకమయిన జాలిగా నవ్వి వూరుకుంది.

"వేణూ! నేను చెపుతున్నా విను. ఎవరికీ అన్నీ కల్సినవాళ్లు దొరకరు. నాకూ్కడా నీమీద ఎన్నోసార్లు కోపం వచ్చింది. ఎన్నోసార్లు నువ్వొక పెద్ద మొండిమనిషివనుకున్నా, ఎన్నోసార్లు నువ్వు చాలా చాదస్తంగా వున్నావనుకున్నా. అయినా ఎందుకు నా అంతట నేనుగా వచ్చి అడుగుతున్నానూ?" అని నచ్చచెప్పే ధోరణిలోకి దిగాడు.

"శేఖరం! నీమీద నాకు కాస్త మంచి అభిప్రాయమే ఉంది. అది చెడగొట్టుకునేలా ప్రవర్తించకు. నువ్వు నామీద ఏవయితే మాట్లాడుతున్నావో, అవే నీకూ




నాకూ కుదరని విషయాలు. నీకలా అనిపించడం చాలా సహజం. అసలదే నేను చెప్పేది కూడా! నాలో నీకే లోపమూ కనపడలేదంటే నా ప్రవర్తన నీకన్ని రకాలుగా ఇష్టంగా వుందన్నమాట. నా ప్రవర్తన నీకన్నిరకాలుగా ఇష్టంగా వుందంటే నీకూ, నాకూ తేడా లేదన్న మాట! అలాగే అభ్యంతరకరంగా వుందంటే తేడావుందన్నమాట! మిగతా విషయాలన్నీ వదిలెయ్... నాకు నీతో జీవితాన్ని పంచుకోడం ఇష్టంలేదు. ఒక వేళ నేనిష్టపడినామనిద్దరిలో ఏఒక్కరమూ సుఖంగా వుండము...వుండలేము. కాబట్టి ఇప్పుడెలావున్నామో అలానే ఫ్రెండ్సులా వుందాం. అనవసరంగా ఆవేశపడమాక" అంది నెమ్మదిగానే అయినా స్పష్టంగా!

శేఖరం చాలా అవమానపడ్డాడు. "నీకే పట్టింపులూ లేవుగా. వయసు పట్టింపు మాత్రం ఎందుకూ? వెంకటప్పయ్య స్వభావమూ, నీ స్వభావమూ కలుస్తుందా?" అన్నాడు.

"నీతో ఇక మాట్లాడాల్సినవసరం లేదు" అంది వేణు.

ఆమెకి ఇందాక శేఖరంమీదున్న సానుభూతి నెమ్మదిగా మాయమవడం మొదలయింది.

"ఒక స్నేహితుడిగా అడగ్గూడదా?"

"అది నా స్వంత...ప్యూర్లీ పర్సనల్ విషయం. అది ఆలోచించుకోవల్సిందీ, నిర్ణయించుకోవల్సిందీ, చెప్పవల్సిందీ నేను. నీ వెటకారాలు భరించాల్సినవసరం నాకు లేదు"

"అదిగాదు..."

"డోన్టాక్ నాన్సెన్స్. నీ లిమిట్స్‌లో నువ్వుండు"

"ఫ్రెండ్షిప్‌లో లిమిట్సుండవన్నావు నువ్వు"

"అవును...లిమిట్స్‌లేని ఫ్రెండ్షిప్స్ కూడా వుంటాయి. కాని మనది లిమిట్స్ లేనిస్నేహంకాదు..అది గుర్తుంచుకో" అని లేచింది వేణు.

శేఖరం అక్కసుపట్టలేక అన్నాడు—

"అంత లిమిట్సుంటే నాతో ఎందుకు అంత రాచుకు పూచుకు తిరిగావ్?"

"'నువ్వంటున్నావే 'రాచుకు పూచుకు' అని..అలా నేనెప్పుడూలేను.నువ్వేమిటో నాకు తెల్సిందగ్గర్నుంచీ నేను స్పష్టంగానే ఉన్నాను. ప్రతి సందర్భంలోనూ నీతో వ్యతిరేకించాను..."

"అది కాదు వేణూ! నా తప్పులు నాకు చెప్పచ్చుకదా! నేను దిద్దుకుంటాను కదా..."

"ఎప్పటికప్పుడు నేను చెప్తూనే వున్నాను. అయినా నువ్వు? దిద్దుకో. మార్చుకో. నాకోసంకాదు— నీ కోసం అయినా... ఏం చెప్పమంటావ్ నీకూ? పనిపిల్లని కసురుకోవద్దు... అడుక్కునే వాళ్ళని కసరద్దు... అనాథల్నీ, అభాగ్యుల్నీ, వృద్ధుల్నీ హీనపర్చద్దు అని చెప్పి నిన్ను మార్చనా? నీవేమన్నా పసిపిల్లవాడివా? నువ్వూ లోకాన్ని నాకన్నా ఎక్కువే చూస్తున్నావుగాదూ?

ఒక విషయానికి నువ్వూ, నేనూ వేరు వేరు అభిప్రాయాలు వ్యక్తపరుస్తూన్నాం. ఆమాత్రం కూడా చూడకుండా 'పెళ్ళి' అని వచ్చావు. పెళ్ళిచేసుకునేదెందుకు? కాట్ల కుక్కల్లా పోట్లాడుకోడానికా? నీకర్థంకాదు. చెప్తేతలకెక్కదు. ఏమిటింకా నువ్వు నేర్చుకునేదీ... మార్చుకునేదీ" అని వేణు రెండడుగులు వేసింది.

శేఖరం కసిగా "సర్లే! నువ్వు కాదనగానే నాకిక పెళ్ళాం దొరక్కపోదు!"



అన్నాడు.

తల వెనక్కితిప్పి శేఖరం వంక ఒక పురుగుని చూసినట్టు చూసి వడివడిగా నడిచింది వేణు.

వేణు మనసునుంచి దిగులుమబ్బులూ సానుభూతి మబ్బులూ అన్నీ వక్కటొక్కటే మాయమయ్యాయి.



తన నిర్ణయం పట్ల తనకెన్నడూ అనుమానం లేకపోయినా, ఈ నిర్ణయాన్ని ఇంత ఖచ్చితంగానూ అమలుపర్చినందుకు చాలా సంతోషంగా వుంది. వేణుకి తనమీద తనకి గౌరవంగా వుంది.

శేఖరం ఇప్పుడు విషం కక్కినంతగా ఎప్పుడూ బైట పడలా.

మనుషులంతే! బాగా వున్నన్ని రోజులూ, నెలలూ, సంవత్సరాలూ, ఒక్కో సారి జీవితాంతమూ అలా వుంటారు. ఎక్కడన్నా, ఎప్పుడన్నా, ఒక్క

దుర్లక్షణం బైటపడటం మొదలైందా ఇక అంతంవరకూ చూపించిగాని వూరుకోరు.

మనుషుల స్వభావాల్లో, అట్టడుగున ఆటవికం, మృగత్వం, రాక్షసత్వం అలానే వున్నాయేమో! అందుకే నెమ్మది నెమ్మదిగా బైటపడటం మొదలై ఒక్కసారిగా విశ్వరూపం చూపిస్తారు తమ నీచత్వాల్నీ, హీనత్వాల్నీ.

శేఖరం అక్కడే నిలబడి చూస్తున్నాడు.

వేణు చకచకా వెళ్ళిపోతోంది.

అతనికి తెలుసు—

ఆ వెళ్ళడం వెళ్ళడం ఆమె అతని జీవితం నుంచి వెళ్ళిపోతోందని.

కాని అతనికి తెలియదు—

ఒక అద్భుతమైన... మనుషుల్లోకెల్లా అందమైనా ...అతి సున్నితమైనా సుకుమారమైనా మంచి మనిషిని తాను కోల్పోతున్నానని.

అందుకే అతనికేమీ బాధకల్గలేదు.. కల్గదు.

మంచి మనుష్యుల్ని మంచిగా చూసుకోవడానికి—

సున్నితమైనవాళ్లని సున్నితంగా స్వీకరించడానికి—

అద్భుతమైన వ్యక్తుల్ని అందంగా జీవితంలో నిల్పుకోవడానికి—

అవన్నీ అతనికీ ఉండాలి.

ఒక్కోసారి ఇవేమీ లేకుండానే అటు వంటి మనుషులు జీవితాల్లోకి వచ్చేస్తారు. వాళ్లని వీళ్లు నిలుపుకోలేరు.

వీళ్ల విలువలు తెలిశాక వాళ్లూ ఉండలేరు ఉన్నారు అంటే—

వాళ్ల సున్నితాలూ, మంచితనాలూ, అద్భుతమైన వ్యక్తిత్వాలూ... అన్నీ చచ్చిపోయాయన్న మాట!

ఏ విలువా లేకుండా... మానసికంగా చచ్చిపోయి... శారీరకంగా చచ్చేవరకూ మహా మామూలుగా అయిన్దానికీ, కాని దానికీ చిర్రుబుర్రులాడే మొగుడూ పెళ్లాల్లానే 'పడి' వుంటారు.

వేణు వెళ్ళిపోయింది.



## 11

"ఇవ్వాళ అన్ని మెషిన్లూ ఆపేశారు. ఇవి నడుస్తూన్నప్పుడు చూడాలి...ఇంకా బాగుంటుంది" అన్నాడు ప్రభాకర్రావు.

హెవీ ఎలక్ట్రికల్స్ ఫ్యాక్టరీలో టర్బైయిన్స్ చూస్తున్నారు, ఆయుధపూజ రోజున... అందర్నీ లోనికి రానిస్తారు... అందర్తోపాటు వేణు, వెంకటప్పయ్య.

ఆ మెషిన్లని చూసినకొద్దీ వాటిని తయారుచేసిన మనుషులమీద ఆరాధనగా వుంది వేణుకి.

నిజంగా మనుషులు ఎంత గొప్పవాళ్లు. ఎంతెంత అద్భుతమైన వస్తుసముదాయాన్ని సృష్టిస్తున్నారు. కార్మికులు, కష్టజీవులు, మేధావులు తల్చుకుంటే కాని పనివుందా?

వెన్నెల్లో చల్లగా మెరిసే తాజ్ మహల్ మంచి ఇనుప ముక్కతో రకరకాల వస్తువుల్ని... గుండుసూదుల్నుంచి బ్రహ్మాండమైన మెషిన్లదాకా... కార్మికులు ఎంతెంత అద్భుతమైన వస్తువుల్ని తయారుచేస్తారు!

అక్కడ తయారుచేస్తున్న మెషిన్లని

చూస్తున్న కొద్దీ కార్మికులు లేకపోతే దేశం, దేశ ప్రగతి లేదనే సంగతి బాగా స్పష్టమై పోయింది వేణుకి. దేశంఅంటే కార్మికులూ, కర్షకులే. అలాంటివాళ్ళు ఎంత దుర్భరంగా బతుకుతున్నారో చెప్తున్నాడు. వెంకటప్పయ్య.

ప్రభాకర్రావు చెప్తున్నాడు- అక్కడి కార్మికుల పరిస్థితీ ... వాళ్ల ఎదుర్కొనే కష్టాలూ...

కాని వాళ్ల కాలనీ చూశాక ... కనీసం ఈ కాలనీలాగా అన్నా వుండాలి మిగతా దేశమంతా అన్పించింది వేణుకి.

కాలనీలో వుండే వర్కర్స్‌కి కష్టాలుండొచ్చు. వారి సమస్యలు వారికుండొచ్చు. కాని కాలనీ చాలా బాగుంది. చక్కటి రోడ్లూ. రోడ్ల కిరువైపులా చెట్లు. చెట్లలో ఇళ్ళు. వేణు చూసిన ప్రభాకర్రావు నిర్మలా వాళ్ళ ఇల్లూ,వాళ్ల పిల్లలు మురళీ, శ్రీదేవీ వాళ్ళ ముద్దు మాటలూ- అన్నీ వేణుకి ఈ కాలనీకి సంబంధించినంతవరకూ సోషలిజం వచ్చి నట్లేనన్పించింది.

వెంకటప్పయ్య మీద నిర్మల, ప్రభాకర్రావు చూపించిన అభిమానం వేణుకి వాళ్ల మీద మంచి అభిప్రాయాన్ని కల్గించింది. వాళ్లు తననూ ఎంతో ఆదరించారు. ఉండమని వాళ్ళెంత గొడవచేసినా ఉండకుండా బైల్దేరాడు వెంకటప్పయ్య. ఆరోజు వాళ్లు వెళ్ళవలసిన చోటు మరోటుంది.

వెన్నెలొస్తుందే సరికల్లా నౌబత్‌పహాడ్ మీదున్నారు వాళ్ళిద్దరూ. వేణు పచ్చ గడ్డిలో కూర్చుంటూ "అబ్బా ! ఇవ్వాళ ఎంత తిరిగామో! కాళ్లు బాగా నెప్పులేస్తున్నాయ్ కదూ" అంది.

"తిరిగినమాట నిజమే...కాని నా కాళ్ళకిది అలవాటే" అంటూ కూర్చున్నాడు వెంకటప్పయ్య.

తనూ, ప్రభాకర్రావు, ప్రసాద్ ఎంత కల్సిపోయుండేవారో చెప్తున్నాడు.

"ప్రసాద్‌గారున్నారిక నేను చూడవల్సినవారు" అంది వేణు.

"ఆయన మహా మంచిమనిషి. మహా మెతక. మేం ఆయన్ని 'మర్యాదరామన్న' అంటాం. ప్రతివాళ్ళనీ అవసరమున్నా లేకున్నా మర్యాద చేస్తాడు. ఎప్పుడు, ఎవర్ని కష్టపెడ్తానో అని అనవసరంగా ఎంతో గడబిడ పడ్తూంటాడు. విజయ గార్ని మాత్రం తెగ సతాయిస్తాడు - వచ్చినవాళ్ళందరికీ మర్యాదలు చెయ్యాలని. ఆవిడ పాపం ఉద్యోగం చేసి చేసి అలసి పోయుంటుంది. ఇక వచ్చినవాళ్ళందరికీ అనవసర సేవలు కూడా చెయ్యాలంటే ఎంతని ఓపికుంటుంది? మధ్యలో వాళ్ళ రాజాగాడొకడు! వాడికన్నీ సందేహాలే. వాడికి అవసరంలేని సంగతిలేదు. వియత్నాం యుద్ధం గురించి కూడా వాడికి చెప్పాల్సిందే. ఇంతాచేస్తే వాడికి ఏడేళ్ల కూడా లేవు.

వేణు గడ్డిలో మోచేతులాన్చి రెండు చేతుల్లోనూ మొఖాన్ని పెట్టుకుని వెంకటప్పయ్య వంక చూస్తోంది.

వెన్నెల నగరమంతా కురుస్తోంది చల్లగా తెల్లగా.

నగరమంతా లైట్లతో, అక్కడక్కడా అలంకరణల్తోసహా ... దూరంగా విన్పడే కోలాహలం. ఉండుండి లారీల, బస్సుల హారన్లు కాస్త గట్టిగా.

వెంకటప్పయ్య కళ్ళల్లో వెన్నెలని చూస్తోంది వేణు.

"అసలు మీరు వింటున్నారా?" అన్నాడు వెంకటప్పయ్య.

నవ్వింది వేణు.

"చెప్పండి. బోర్ కొడ్తున్నానా?"

"లేదు. వింటున్నా."

"సరే మీరు చెప్పండి. ఎంతసేపూ నేనేనా?" అన్నాడు వెంకటప్పయ్య.

"మీకింకా ఫ్రెండ్సున్నారా?" అంది వేణు.

"నాకా...? నాకు స్నేహం అంటే చాలా ఇష్టం. దాదాపు అందరికీ ఇష్టమే అయుంటుందనుకోండి. కాని నాకు స్నేహమే ప్రాణం అన్నంత ఇష్టం. అయితే స్నేహాన్ని విలువలేకుండా, ఏ అవసరానికో వాడుకోడానికి స్నేహం చేసి దాన్ని కించపర్చే మనుషులంటే చాలా అసహ్యం. ఆ మనుషుల్ని పట్టుకుని స్నేహంకోసం వేళ్లాడ్డంకన్నా ...వాళ్ళెంత గొప్పవాళ్లతానీ..."

"అటువంటివాళ్లు గొప్పవాళ్ళెలా అవు తారు" అంది వేణు నెమ్మదిగా.

"మనకి కాదు...లోకం దృష్టిలో.ఎంత గొప్పవాళ్ళయినా వాళ్లని వదిలెయ్యడం, మనల్ని మాట్లాడించేవాడు లేకపోయినా, ఒంటరిగానైనా పడుండొచ్చుగానీ స్నేహం ముసుగులో మనల్ని మనం మోసం చేసుకోకూడదని నా నిశ్చలమైన అభి ప్రాయం"

"మీ జీవితధ్యేయం ఏమిటి?" అంది అకస్మాత్తుగా వేణు.

"ఎప్పటికైనా నాలాంటి మనిషిని ప్రేమించడం ... ప్రేమించబడటం" అన్నాడు. అతని చూపు వేణు మీదినుంచి నెమ్మదిగా చందమామ మీదికెళ్ళింది.

వేణు చూపు వెంకటప్పయ్య మోము మీదనుంచి అతని కన్నుల మీదికెళ్ళింది.

"అంతే! నాకు మరో ఆశలేదు" అన్నాడు నెమ్మదిగా.

"ఇదేమన్నా తక్కువ ఆశగనకనా?" అంది చిరునవ్వుతో వేణు.

"చిన్నదీ పెద్దదీ అన్నీ అదే! అది నా జీవితాశయం... నేనందుకే బతుకు తాను. అవసరమైతే అందుకే..."

"చాలు. ఇక ఊర్కోండి" అంది వేణు.

"మిమ్మల్నెవరన్నా స్నేహితులు గాయపర్చారా?" అంది వేణు.

"నేననుకోడం ప్రతివాళ్లూ తాము సున్నితులమనీ, తమని ఎవరెవరో మోసం చేశారనీ, గాయపర్చారనీ అనుకుంటారనే. నిజంగా కూడా అలానే జరుగుతుందను కుంటాను. మనం ఎంత జాగ్రత్తగా వున్నా మనమూ ఎవరెవర్నో గాయపర్చు తూనే వుండి వుంటాం. అయితే అది మనకి తెలియదు. రెండో విషయం గాయ పడటం అనేది ఆయా వ్యక్తులిచ్చే విలువల మీద కూడా వుంటుంది. మనం ఒకందుకు బాధపడ్తే మరొకరు మరొకందుకు బాధ పడ్తారు. నన్ను సరిగ్గా ప్రేమించడంలేదని నేను బాధపడితే, నేనేదో పనిచేసిపెట్ట లేదని మరొకరు నావల్ల బాధపడటం.... పోనీండి....మీరడిగారు కదూ...అవును. నేనుకూడా చాలామంది నుంచే దెబ్బలు తిన్నా. అయినా ఈ 'స్నేహం ఆట' ఆడకుండా ఉండలేను. ఎందుకంటే అదే నా ఊపిరి. ఒకచోట దెబ్బతిన్నా, మరెన్నోచోట్ల సేదతీర్చే చల్లని స్పర్శ దొరుకుతోంది గదా!"

"మానవుడు ఆశాజీవి. మనకికావల్సిన స్నేహం, ప్రేమా దొరుకుతాయనే మనం బతుకుతాం. నిజమే...అలానే ప్రతివాళ్లూ వాళ్లక్కావల్సినవి వాళ్లకెప్పటికైనా దొరు కుతాయనే నమ్మకంతోనే ఎన్నెన్ని కష్టాలు కూడా పడటానికి సిద్ధపడతారు...

మీకూ, ప్రభాకర్రావుగారికి, ప్రసాద్‌గారికీ ఎప్పట్నుంచి స్నేహం" అంది వేణు.

"చాలా ఏళ్లనుంచే. మొదట్లో మామూలు పరిచయంగా వుండేది. ఒక సారి..." అని ఆగాడు వెంకటప్పయ్య.

"ఆగారే! చెప్పండి" అంది వేణు.

ఇబ్బందిగా మొఖం పెట్టి..."ఈ వెన్నెలా, ఈచల్లని వాతావరణం ఇప్పుడు ఆ 'ఒకసారి' చెప్పబుద్దెయ్యడంలా" అన్నాడు.

"ఫర్లాచెప్పండి. ఎలాంటి విషయమైనా మీనుంచి వింటే నాకు బాగానే వుంటుంది"

"కాని ఈ విషయం బాగుండదు. అయినా చెప్తా లెండి..ఒక మంచి పుస్తకం చదివితే మన ఆప్తులకి, పరిచయస్తులకి చెప్పి అది త్వరగా చదివించాలనుకుంటాం. అలానే ఒక నీచుడి గురించి తెల్సినప్పుడుకూడా..మనకితెల్సినవాళ్లకివాణ్ని గురించి చెప్పాలనుకుంటాం... అయితే మంచి పుస్తకం గురించి చెప్పేప్పుడు ఎంతో సంతోషంతో చెప్తాం. అలానే ఇటువంటి అసహ్యకరమైన విషయాలు చెప్పాల్సివస్తే మనసంతా చీదరగా అవుతుంది. ఇప్పుడు మనసుని చీదరగా చేసుకోడం... సర్లెండి..." అని మొదలెట్టాడు వెంకటప్పయ్య.

అతని మొహం అసహ్యంతో జేవురించింది.

వేణుకొక్క క్షణం ఆ విషయం ఇప్పుడొద్దులే అందామన్పించింది. కాని... కాదు. వెంకటప్పయ్య నుంచి అన్ని విషయాలూ వినాల్సిందే అనుకునిమనసుని సిద్ధంచేసుకుంది.

"ఎప్పుడో ఏడెనిమిదేళ్ల క్రితం... మేం పదిమందిమి ఆమీర్‌పేట్లో ఓ బిల్డింగ్ తీసుకునివంటతన్ని పెట్టుకునిఉంటున్నాం. ఓ రోజు అందరమూ కల్సి ఎగ్జిబిషన్ కెళ్లాం. సరదాగా ఆ షాపులూ అవీ చూస్తూ తిరుగుతున్నాం. ఇంతలో ఓ పది పదకొండేళ్ల పాప ఏడుస్తూ కన్పడింది.

'ఎందుకమ్మా ఏడుస్తున్నావ్'? అన్నా.

ఆ పిల్ల ఏదో ఊర్నించి వాళ్ల చుట్టాలింటి కొచ్చిందట. 'మా అమ్మా వాళ్లు కనపట్టంలా' అని ఏడుస్తోంది.

మేం వలంటీర్స్ కాంప్‌కి తీసికెళ్తాం! మైక్‌లో చెప్పిస్తే పిల్ల అమ్మావాళ్లొస్తారని ఆ పిల్లని సముదాయిస్తూ కాంప్‌కెళ్తున్నాం.

ఈలోపు- అప్పారావని ఒకడుండేవాడ్లెండి. వాడు అడ్డొచ్చి-

'ఉండండి గురూ! ఓ మూడు నాలుగేళ్లు మన రూంలో అట్టిపెడదాం ఈ పిల్లని. భలేగా తయారవుతుంది లెండి' అన్నాడు.

అంత కోపం, అంత అసహ్యం నా కెప్పుడూ రాలా..."అని వెంకటప్పయ్య చెప్తున్నాడు.

వేణు పళ్లు పటపటలాడినాయి. కళ్లు నిప్పులు కురిపిస్తున్నాయి. ముక్కుపుటాలు ఎగిసి పడుతున్నాయి. ఆమె లేచి కూచుంది.

"మీరేం అన్నారు?" అంది మహా అసహనంగా.

"అనడమా గినడమా? చాచిపెట్టి దవడమీద కొట్టాను. ఆ దెబ్బకి వాడెళ్లి అటుగా వస్తున్న జనం మీద పడ్డాడు. చుట్టూ జనం మూగారు. మా వాళ్లు నన్ను 'ఊరుకోవయ్యా' అంటున్నారు. నేను వాడిని మరో మూడు తన్నులు తన్నాను.

ఎవరో వాణ్ని అవతలకి లాక్కెళ్లారు. నన్నెవరో గట్టిగా పట్టుకున్నారు.

చుట్టూవున్న జనంలోంచి ఏడుస్తూ

'ఓసినాయమ్మో' అని వచ్చి పిల్లని కావిలించుకుంది తల్లి.

ఎవరో "అయిపోయిందిలే వూర్కోండి' అంటున్నారు.

అప్పుడు ప్రసాద్ అన్నాడు "ఊర్కోడ మేంటయ్యా! అందరమూ తలో నాలుగూ తన్నక! వీడి గురించి నాకు కాస్త అనుమానంగానే వుంది. వెధవ తిరుగుళ్లూ వీడూను! వీడి విషపు చూపుల్నుంచి పసి పిల్లల్ని కూడా మినహాయించడా ఈ ఛండాలుడు" అని.

ప్రభాకర్రావు వాడిని అవతలకి లాక్కెళ్ళిన వాళ్ల మీద ఎగిరాడు—'వాణ్ని అందరం కల్సి చితకతన్నాల్సింద'ని.

అప్పట్నుంచి వీళ్ళిద్దరూ అంటే నాకు మంచి అభిప్రాయం ఏర్పడింది.

తర్వాత ఆ అప్పారావుగాడు నన్ను కొట్టాలని చూశాడట. వీళ్లిద్దరూ వాడికి వార్నింగిచ్చారట. నా ఒంటి మీద చెయ్యి బడ్తే వాడితల ఎగుర్తుందని.

ఆ బిల్డింగులో ఉన్న అందర్లోకీ నాదే చిన్నజీతం. అందరికన్నా తక్కువ చదివిందీ నేనే .... అందరికన్నా చిన్నాణ్నీ నేనే.

తర్వాత-

మేం ముగ్గురం కల్సి బైటికొచ్చేశాం. స్వంతంగా వంట చేసుకుంటూండేవాళ్లం. వాళ్ళిద్దరూ ఒకే సంవత్సరం పెళ్లి చేసుకున్నారు. తర్వాత వాళ్లిద్దరికీ మంచి ఉద్యోగాలు కూడా దొరికి వాళ్లు వెళ్ళిపోయారు. నాకేమో సరైన చదువులేదు. అలానే ఉండిపోయా ... ఎక్కడ మొదలెట్టానూ? ఎక్కడి కొచ్చాను?" అన్నాడు వెంకటప్పయ్య.

నవ్వింది వేణు.

వెంకటప్పయ్య గురించి దాదాపు అంతా తెల్సుకున్నట్టే అనుకుంది వేణు.

అతను పసిపిల్లవాడిలా నిష్కల్మషుడు.

'అతను అద్భుతమైన స్నేహపాత్రుడు. అతను చందమామలా చల్లనివాడు.'

అనుకుంది.

చందమామ నవ్వాడు చల్లగా, మెల్లగా.

ఇద్దరూ లేచారు.



## 12

"వెళ్తా...వెళ్తా! అని నీళ్లు నమలడమే గాని కదలవేం? వెళ్లు... బాగా పొద్దు పోయింది. మళ్లీ అవతల బస్సులు దొరకవు. చాలా కష్టం అవుతుంది" అంది వేణు.

"వెళ్తా....వెళ్తా..." అని మళ్లీ నీళ్లు నమిలాడు వెంకటప్పయ్య.

వేణుకి రెండ్రోజుల్నుంచి జ్వరం.

ఆమె వంకచూశాడు వెంకటప్పయ్య. టెంపరేచర్ బాగావుంది. అందువల్లే వేణు మొఖం అంతా ఎర్రగా కందిపోయుంది. పెదవులు ఎండిపోయి, మనిషంతా నీర్సంగా...రెండ్రోజులకే వారం రోజుల్నుంచి జబ్బుపడ్డ మనిషిలా వదలిపోయింది.

ఇలావున్న మనిషిని వదిలి ఎలా వెళ్లడమో అర్థంగావడంలా వెంకటప్పయ్యకి. అతని మనసు బరువెక్కి

పోయింది.

ఒక్క మనిషి ... లక్ష్మి కూడా వూళ్లోలేదు...జబ్బుతో...రాత్రంతా... ఏ అవసరమొచ్చినా...ఎలా వుంటుందీ? ఎంత కష్టం!

"వెళ్ళూ! నీ కవతల కష్టం..." అంది నీరసంగా వేణు.

"వెళ్తా" అని లేచాడు. గదిలోనే రెండ డుగులు వేశాడు. మళ్లీ వేణుని చూశాడు.

'వెళ్లావులే కూర్చోవోయ్' అన్నాయి అతని కాళ్లు.

వెంకటప్పయ్య వెంటనే కూర్చున్నాడు.

వేణు మనసునిండా నవ్వుకుంది.

ఆవిడకి చాలా ఆనందంగావుంది అతని వరస. తనకోసం .... తానెక్కడ కష్టపడుతుందో, తానెక్కడ ఇబ్బంది పడ్తుందో అని అతను ఎంత పెనుగు లాడుతున్నాడో తెలిసేసరికి వేణు మనసు మనసంతా ప్రేమతో,అనురాగంతో నిండి పోయింది.

ఈ లోకాన్నంతా ఒక్కసారిగా తన కౌగిల్లోకి తీసుకుని ప్రేమతో ఆలింగనం చేసుకోవాలన్పించింది.

మనిషి ఎంత అద్భుతం!

మనసు ఎంత సున్నితం!

భావాలెంత ఉన్నతం!

వెంకటప్పయ్య వంక చూసింది వేణు.

ఆ చూపు చూడగానే వెంకటప్పయ్య ఏ మాత్రం ఆలస్యం చేయలేదు.

ఆ మంచం పక్కగా కింద తన పక్కకి ఏర్పాటుచేసుకుంటూ –

"మీరేమన్నా అనండి...అనుకోండి. ఈ జబ్బుతోవున్న మిమ్మల్ని ఈ గదిలో వదిలివెళ్లేది లేదు. అమ్మో... మీ కెంత ఇబ్బంది. మీకేమైనా అవ సరమైతే ఎవరు చూస్తారు? ఈ రాత్రికి మిమ్మల్నొదిలి వెళ్ళేది లేదు" అన్నాడు.

'ఈ రాత్రికేనా?' అని వేణు మనసు మూలిగింది. పైకి మాత్రం–

"అయితే నేను జీవితాంతం ఈ జబ్బు తోనే మంచంపడతా" అంది.

అప్పుడుగానీ అతనికి తామిద్దరూ ఎంతదూరం వచ్చేశారో అర్థంగాలా!

నవ్వుతూ "ఒద్దులెండి! జబ్బెందుకూ మనమధ్య. త్వరగా కోలుకోండి. ఈ రూంనుంచే కాదు – మీ నుంచీ కూడా ఇక నేనెక్కడికీ వెళ్ళదల్చుకోలా!" అన్నాడు.

అతని కనులు తళతళ మెరు స్తున్నాయి.

అతని పెదవులు ఆనందంగా నవ్వు తున్నాయి.

అతని ముఖం వింత కాంతితో వెలిగి పోతోంది.

అతని ఊపిరి భారంగా వస్తోంది.

అతని మనసు ఆనందనాట్యాలు చేస్తోంది.

అతను ప్రేమగా ఆమెను చూస్తున్నాడు.

వేణు ఒక్క ఉదుటున మంచం మీది నుంచి లేచి–

ఖంగారుపడ్తున్న వెంకటప్పయ్యని తన కౌగిలిలోకి తీసుకొని "అబ్బ...మందుల వాసన" అని గోణిగే అతని తలమీదో దెబ్బవేసి –

"మొద్దు" అని గట్టిగా ముద్దు పెట్టు కుంది.

ముద్దునుంచి కాసేపటికి తేరుకుని –

"నా జన్మ ధన్యతజెందెన్" అన్నాడు వెంకటప్పయ్య.

"నాదీను" అంది వేణు.



# వలపు నాదం...



ఇపుడేగా...వచ్చింది వయసు వసంతం
ఆడుకోనీండి కన్నెపాపను వల'పూల' సందిట తలపుల కోలాటం



చూసేవారి రాకకోసం మనసు 'కళ'గా అద్దినదీమహాలు
నా చూపే వాడకైవసం మనసును ఆ 'కల'దోచినది మొదలు


మనసున మనసైన ఊసుకు ఉలికులికపాటు
వయసుకు వరసైన ఊహకు ఉలి'కులుకు' పాటు



వెన్నెల కన్నులలో మనసు . కురిసిన మంచిముత్యం, నీదైన
ఈ చూపు
నీ రాక మరి, తొలికరణమవునో, కాదో తెలుపు



కాదని మనసును కప్పించేవుసుమా...అందుకే కళ్ళద్దాలు
ఔనని వయసును మురిపించేవేమోసుమా...పాందుకే ఈ నవ్వు
ముద్దులు



ఎదలోని కోరిక ఎడారి
ఎదురు చూసిన క్షణం ఎండమావి



కనులు రమ్మని సాచినది కమ్మని కబురులకోసం
గుబాళించు గులాబీలు,మూగచూపు గుండెకోసి హత్తుటకోసం



ఎందుకో మరి పలుమారు పగతే కల పలకరిస్తది
అందులోకొచ్చి ముమ్మారు కళ్యాణాం పులకంతలె సారెగిస్తది


నా లోలోన ఆలోచనాలోచనల సులోచనాలు
నా నీలి నీలి లోచనాల నిరీక్షణలో అపేక్షణాలు



ఇది నిజం నే దాచిన జిలిబిలి నవ్వులు
నాదు నాదంతో వేచిన నీ గుండె గొంతుకు శృతులు



పిలిచిన నా పిలుపుకు వలపే నీ బదులైతే
తలపులు తెరిచిన నా చూపులు నీకెదురవుతయ్



నే పున్నమి కొమ్మకు పూసిన వెన్నెల పూవునోయి
నా కన్నులు కమ్మగ విరిసినది కోరికల కోవెలజేరుటకేనోయి


కోటి కాంతుల వెలుగులవారు నా పుట్టినింటివారు
కాపాడే చేతులతో కాపుగాసేవారే నా మెట్టినింటివారు



నవ్వేసినా, 'ఊహు' మేం నవ్వనేలేదన్నాయి కదూ నా కనులు
మొగ్గేసిన, 'ఊహ'ను మరి, దాచల్లేదూ 'సిగ్గు'రాకులు

ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికి ఉపయోగపడుతుంది.

వెల రు. 25.00

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

ప్రతులకు:

ఉషోదయా పబ్లికేషన్స్

ప్రయివేట్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,

హైదరాబాద్ – 500 004.



## రాంగ్ నంబర్

"హలో! సుందరంగారున్నారా అండీ?"

"ఏ నంబరుకయ్యా నువ్వు చేసింది. పొద్దున్నే ప్రాణం తీసేస్తున్నావ్. ఇంతకీ ఏ నంబరుకి చేసేవ్ ఫోను?"

"44611 అండి"

"మా నంబరు 44511"

"సారీ .... రాంగ్‌నంబర్!" అని పెట్టేశాడు అవతలాయన ఫోను.

తెల్లవారుజామున క్రిష్ణా ఎక్స్‌ప్రెస్‌లో బెజవాడ వెళ్తున్న వాళ్ళ ఆఫీసరు సుందరంగారు-అసిస్టెంట్ లింగమూర్తిని "పొద్దునే 5.30కి టెలిఫోను చెయ్యి నన్ను లేపినట్లూ అవుతుంది. ఏదైనా విశేషముంటే మాట్లాడుకోనూవచ్చు" అన్నాడు. ఇప్పటికే టైమ్ 5.20 అయింది. నంబరు తప్పు పోకుండా వుండాలని ఈసారి టెలిఫోన్ వంకే చూస్తూ డయల్ చేశాడు లింగమూర్తి.

"హలో... సుందరంగారాండీ?"

"ఎవరండీ మాట్లాడుతా?" అవతలి కంఠం.

"నేను లింగమూర్తినండీ!"

సుందరంగారింట్లో భార్యా, కొడుకూ తప్ప ఎవరూ లేరే! మరిప్పుడు మాట్లాడిందెవరూ? ఆలోచించే లోపల, "హలో! సుందరం హియర్" అందొక మగ కంఠం.

"గుడ్‌మార్నింగ్ సార్! ఆ ఫైలు మీరు చెప్పినట్లు ప్యూనుకిచ్చేసేను సార్! స్టేషన్‌కొచ్చిస్తాడండీ వాడు" అన్నాడు లింగమూర్తి వినయంగా.

"చూడండి... నాపేరు సుందరేశన్. నేను ఇక్కడ స్టేట్ బేంక్‌లో ఎంప్లాయ్‌ను. మీకి ఎవరు కావాలాంగో" అన్నాడు అవతలాయన.

"మీ నంబరూ..."

"దిసీజ్ 44612 సామీ"

"సారీ!" అని టెలిఫోన్ పెట్టేశాడు లింగమూర్తి.

పైగా ఈ తప్పు నంబర్లు చేస్తున్నప్పుడల్లా కాల్స్ దండగ అనుకున్నాడు.

అటు క్రిష్ణా ఎక్స్‌ప్రెస్ టైమ్ అయిపోతోంది. సుందరంగారు అసలే చండశాసనుడు, అనుకుంటూ ధైర్యం చేసుకుని, ఈసారి కళ్ళు పెద్దగా తెరుచుకుని ఒక్కొక్క నంబరూ తిప్పటం మొదలెట్టేడు లింగమూర్తి.

అలా 4 నంబర్లు డయల్ చేసేడో లేదో, ఎవరివో యిద్దరి ఆడగొంతుకలు లింగమూర్తికి స్పష్టంగా వినపడ్డం మొదలెట్టాయ్.

"అదికాదే ... మెరూన్ కలర్ మీద నల్ల బార్డర్ చీర వెంకటగిరివి చాలా బావుంటాయే... అవే పట్టుకురా"

"ఏమోనే! ఆ కలర్‌లో గద్వాల్ చీరలయితేనే బావుంటాయ్"

"మొన్న మా మరిది పెళ్ళికి, పోరుపెడితే ఏడుస్తూ కొన్నారు మా ఆయన ఏడొందలు పెట్టి"

లింగమూర్తికి తిక్కపుట్టింది.





''ఏమండీ! మీకు వెంకటగిరి, గద్వాలం, పోచంపల్లి, నైలెక్స్ ఎలాంటివి కావాలన్నా తెల్లారాక నీలకంఠం బాలకృష్ణయ్యగారి షాపుకెళ్తే దొరుకుతాయండీ మన్నికకైతే కంచివి బావుంటాయండీ .... దయచేసి టెలిఫోను పెట్టెయ్యరూ'' అంటూ ప్రాధేయపడ్డాడు.

అమ్మాయిలిద్దరూ దయతలచి టెలిఫోను పెట్టేశాక మళ్ళీ డయల్ చెయ్యడం మొదలెట్టేడు లింగమూర్తి గడియారం వంక చూసుకుంటూ.

''హలో... 44611?''

''కౌన్ హైరే తూ? గలత్ నంబర్ కర్‌తా హై! సుభాసుభా కామ్, దందా నహీ హైరే?... ఏ 48611.''

లింగమూర్తికి టెలిఫోనుమీద చచ్చేంత కోపం వచ్చింది.

199 తిప్పేడు అసిస్టెన్స్‌కోసం.

ట్రింగ్... ట్రింగ్... అలా మూడు నిమిషాలు మోగిం తరువాత, "హలో... ట్రంక్ బుకింగ్, 180" అన్నదవతలి కంఠం.

కోపంతో నెత్తి బాదుకుంటూ మళ్ళీ తిప్పేడు 199...

ఒక మృదుమధుర భాషిణి– "నమస్కారం...అసిస్టెన్స్" అంది ఈసారి.

లింగమూర్తి వెయ్యి దేవుళ్ళకి మొక్కుకున్నాడు, అయిదు నిమిషాల తర్వాత ఎలాగైతేనేం 44611 దొరికినందుకు.

'నమస్కారమమ్మా' అన్నాడు– అవతలి గొంతు సుందరంగారి భార్యదని గుర్తించి. "సార్ వున్నారాండీ?"

"ఏమిటి మూర్తీ... పదిహేను నిమిషాల్నించి, నీ టెలిఫోను వస్తుందని చూసి చూసి ఇక లాభంలేదని తనే ఎన్నో సార్లు ట్రైచేసేరు నీ నంబరుకు. ఏమిటయ్యా...ఇంత పొద్దునే ఎవరితో నీ రాచ కబుర్లు. నీ నంబరు ఎప్పుడూ ఎంగేజ్ గానే ఉందే?" సుందరంగారి



భార్య అంది కొంచెం కటువుగా.

"నేను మీ నంబరే ట్రై చేస్తున్నానండీ! ఎప్పుడూ రాంగ్‌నంబర్‌కే వెళుతున్నదండీ..." ఇంకేదో చెప్పేలోగే టెలిఫోన్ కట్టయింది.

"హలో..హలో" అంటూ లింగమూర్తి అరవటం మొదలెట్టాడు పిచ్చెక్కినట్టు. ఇంతలో టెలిఫోను కట్ అయిపోయింది. కోపంతో రిసీవర్ టెలిఫోన్ మీదేసి కొట్టాడు.

ఆతర్వాత టెలిఫోన్ మూడు రోజులు అవుటాఫ్ ఆర్డర్. నాలుగు రోజులయింది. టెలిఫోన్ ఇంకా బాగా కాలేదు.

అప్పుడే ఆఫీసునుండి ఇంటికొచ్చి మొహం కడుక్కుని కాఫీ తాగుతూ పేపరు చూస్తున్నాడు లింగమూర్తి. ఆకస్మాత్తుగా సుందరంగారూ, వారి భార్యామణీ దిగారు కార్లోంచి. లింగమూర్తి ఆశ్చర్యపోయేడు.

"రండి సార్! ఊర్నించి ఎప్పుడొచ్చారండీ?" అంటూ ఆహ్వానించాడు.

"మరేం లేదయ్యా! దగ్గర్లోనే మా ఫ్రెండ్ ఇల్లు వుంది. వాళ్ళింటి ఆనవాలు మరిచాను. వాళ్ళింట్లో ఫోనుంది. ఓసారి చేసి అడ్రస్ కరెక్టుగా తెలుసుకుందామని ఇలా వచ్చేను"

"సారీ సార్...నా టెలిఫోన్ నాల్రోజుల్నించి అవుటాఫ్ ఆర్డర్ సార్! అందుకే మొన్న మీకు సరిగా చెయ్యలేకపోయేను" అంటుండగానే టెలిఫోన్ మోగింది.

లింగమూర్తి గుండెలో రాయిపడింది. సుందరంగారు చురచురా చూస్తున్నారు. భార్యామణి విసుగు మొహం పెట్టింది. ఆఫీసరు బయటికి నడిచాడు సతీసమేతంగా కోపం ఉండబట్టలేక.

"అది కాదు సార్! ఈ ఫోను..."

"డోన్ట్ టాక్" అంటూ కారెక్కేసి పోయారు సుందరంగారు.

లింగమూర్తి పిచ్చివాడైపోయాడు. 'హల్లో' అని అరిచాడు కోపంగా టెలిఫోనెత్తి.

టెలిఫోను మళ్ళీ కట్!

—నూకల సీతారామరావ్

## ఇష్టం

"నేనంటే నీకు అంత ఇష్టమా?"

"ఎంత ఇష్టమో చెప్పలేను డాళింగ్. అందుకేగా నువ్వు ఇలా కోరగానే అలా తెచ్చేసాను" అంటూ జేబులోంచి మంచి ముత్యం తాపించిన బంగారు ఉంగరం తీశాడు రాజా.

రోజా ముసిముసిగా నవ్వుతూ తన ఉంగరం వేలు చూపించింది.

రాజా ముత్యాలముద్దుటుంగరాన్ని రోజా వేలికి తొడిగాడు.

"తప్పే అనుకో....అయినా అడుగుతున్నాను. రాజా....ఈ ఉంగరం ఖరీదెంత?"

రాజా కాస్త కంగారుపడ్డట్టు కనిపించినా వెంటనే తమాయించుకుని—

"ఆ ఎంత...జస్ట్ ఏడొందలయాభై" అన్నాడు.

"రాజా గత ఆదివారం నువ్వు కొన్న చీర ఎంత బాగుందో! దాని ఖరీదెంత?" అడిగింది రోజా.

"రెండొందలయాభై" తకీమని జవాబు చెప్పాడు.

"అంటే...ఓ వారంలో నా గురించి నువ్వు వెయ్యి రూపాయలు ఖర్చు చేశావ్" అదోలా అడిగింది రోజా.

"నీ కోసం వెయ్యేవిటి....ఎంతైనా




ఖర్చు చేస్తాను. నువ్వు నాకు దక్కాలేగాని ఆ చందమామనే దించి నీ ముంగిట వుంచనూ" అన్నాడు రాజా.

రోజా గలగలమని నవ్వింది.

రాజా తన్మయంగా ఆమెను చూస్తున్నాడు.

"రోజా..."

"ఊ..."

"మన పెళ్ళి విషయం...." అర్ధోక్తిలో ఆగిపోయాడు రాజా.

"ఆ విషయం మర్చిపో రాజా" కటువుగా అంది రోజా.

రాజా మ్రాన్పడి ''రోజా...ఏమిటి రోజా నువ్వంటున్నది" అన్నాడు.

"రాజా... నీ జీతం ఎంత?"

''వెయ్యి రూపాయలు" జవాబు చెప్పాడు రాజా.

"రాజా! నేను వాస్తవంగా ఆలోచించే మనిషిని. నువ్వు నన్ను ప్రేమిస్తూండవచ్చు గానీ నా వ్యామోహంలోపడి, నీ శక్తికిమించి పరుగులు తీస్తున్నావు. ఇలా ఖర్చులు చెయ్యడం ప్రారంభిస్తే ఎక్కడ తేలావు? ఈ రెండు వస్తువులూ నువ్వు నిశ్చయంగా అప్పుచేసే కొని వుండాలి. అప్పులుచేసేవాళ్ళన్నా, శక్తికి మించి దుబారా ఖర్చులు చేసేవారన్నా నాకు గౌరవంలేదు. నిజాయితీగా, ఉన్న దానితో ప్లాన్డ్‌గా జీవించేవాళ్ళంటేనే నాకు ఇష్టం. కానీ నీ తత్వం అదికాదు. అంచేతే మనకు కుదరదు...గుడ్‌బై" అంటూ ఉంగరాన్ని తిరిగి రాజా చేతిలో పెట్టి వెనుదిరిగి వడివడిగా వెళ్ళిపోయింది రోజా.

—దేవరాజు రవి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD